# శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత
# శ్రీ నా గే శ్వ ర మా హా త్మ్య ము

ప్ర థ మా శ్వా స ము

## ఇ ష్ట దే వ తా ది స్తు తి

శ్రీ రామామణి కేలుమోడ్చి ధవు సంసేవింప నేతేర, నా
క్షీరాంభోనిధి కన్యకన్ హృదయరాజీవ స్థలిన్ జేర్చి త
త్స్మేరాంగు వ్రజవాహినీలహరి నుద్దీపించు నారాయణుం
డారూఢస్థితిఁబొల్చి మాకొసఁగు సర్వైశ్వర్యసౌభాగ్యముల్.

అంతరాక్కర: రజతగిరిఁ దాను, నీహార శైలజాత
యు, జతగూడి సత్త్వద్వయోర్వుల నేలి, భ
క్తజనపాల విఖ్యాతిఁ దనరు మేనకా
త్మజ మగఁడు తీర్చు మా హృద్యముల్ సతమ్ము.

ఆల్పాక్కర: నిగమగానము లీను నెమ్మోములు,
జగముల సృష్టించు చాతుర్యము
ను, గల వాణీయుతానూన మూర్తి
యగు బ్రహ్మ మా కోర్కు లన్ని తీర్చు.

మధురాక్కర: తల్లిదండ్రులయెడ భక్తి తనరు చిత్తాబ్జమందుఁ
బల్లవించిన స్వీయవైవాహికేచ్ఛ యవిఘ్నమై
యుల్లసిలు నుపాయమెఱుఁగు యుక్తిగల వినాయకుఁ
డెల్లవేళల మముఁ బ్రోచు నెట్టి యడ్డుండ నీక.

మహాక్కర :

వివిధ వాఙ్మయవితతి కు శేశయ పీఠమ్ము, శబ్దముల్ పూరేకులు,
వివిధ భావౌఘములు నిలువుటద్దము, విజ్ఞానసంస్కృతుల్ నిద్దములు
వివిధ మాధుర్యముల్ వదనామృతవృష్టులు తద్ధారలు రచనలు,
కవులు పిక, కీర, శిఖి, హంసలగు వాణి కరుణ మాకిచ్చు
శక్తియు యశస్సుం.

మంజరి : అలివేలు మంగమ్మ యను పేర నెసఁగు
పద్మావతీ దేవి, ప్రత్యక్ష దైవ
మేడుకొండల వేంకటేశ్వరుఁదలఁచి
ప్రార్థింతు మీ కావ్య రచనకు ముందు.

తే.గీ. వాయుసుతు, వీరు, శ్రీరామ భక్త వర్యు,
నిర్జితేంద్రియు, వానర నివహ ముఖ్యు,
నంజనా పుత్రు, హనుమంతు, నర్థివరదు,
నెలమి గొలుతు మొసంగ మాయీప్సితములు.

మంజరి : మధురమౌ తెలుఁగున మాన్యతఁ గన్న
కవులకు మ్రొక్కి, సకల భాషలందు
రచనలు చేసిన ప్రఖ్యాత కవుల
నుతియింతు మెప్పుడును వినమ్ర భక్తి.

మధ్యాక్కర :

జనకుఁడు నాగుడుండగుట స్మరియింతు భక్తితో నిపుడు
మనమున నంజలుల్ చేసి. మందాకినీ సరిత్సమము
గను మత్కవిత్వ ప్రవాహ గమనమ్ము సాగి. యీరచన
ఘుష్టమైన కావ్యమై గణుతిఁ గాంచు నట్లొనరింపుమనుచు.

త్రిపురాంబాయుతుఁడౌ చతుర్దశధరిత్రీ నాథు, నాగేశ్వరున్,
దపనీయామృత సన్నిభుం దలఁచి, తత్ప్రాసాద నిర్మాతయౌ
విపులా నిర్జరు, రామచంద్రుని, గోత్రవిఖ్యాత వంశ్యున్, దదీ
య పురంధ్రీమణి జానకీసతిని చిత్తాబ్జంబునం దెంచెదన్.

## శ్రీ నాగేశ్వరాలయము

ఈ నాగేశ్వర దేవుఁ డీశ్వరుఁడు, సర్వేశుండు, శంభుండిటన్
దానై పుట్టి, కౌశికులాబ్ధి మహిమాధామున్. ధరిత్ర్యాది తే
యానీకేంద్రుని రామచంద్రుని, గటాతౌక్షుద్వయిన్ దేవియున్,
దానున్ జూడ. నతండు కట్టెనట యుద్యద్భక్తిసీ కోవెలన్.

దానము చేసినంట కలధౌతశిలోచ్చ యశృంగ సుందరో
ద్యాన హిమాద్రిజా సహా విహారికిఁ, బన్నగ దామహారికిన్.
మానవలోక నిర్జరుఁడు మాన్యము కుంటలు నాల్గు నూఱు లీ
శానుఁడు, సర్వమంగళయు, సర్వజనమ్ములు సంతసింపఁగన్.

వ: దేవా! అట్టి యెడం బ్రతి నిత్యమును,

వేకువ జాములన్ గుసుమ వీధుల నింకను బంభరీసుతా
నీక గరున్ని నాదములు నిండక మున్ను, ప్రశాంత వేళ, ము
క్త్యాకరమై ధ్వనించు భవదాలయ వాటికనుండి హే, శివా!
హే,కుముదాప్త శేఖర!మహేశ!యుమాధవ!యన్న శబ్దముల్.

తెలతెల వారు వేళ, చిఱుతెమ్మెర కన్నెలు దేవలోక శా
ద్వాల, తరు, వల్లరీ, సుమవితాన సుగంధము దెచ్చువేళ, చే
ల్పొలుపులు, గీత, వాద్యచయ గోష్ఠులుమున్న గుసుప్రభాత సే
వలు తొలిమై. యథావిధిగ స్వామి సపర్యలు సాగునిత్యమున్.

అనునిత్యమ్మును స్త్రీజనమ్ములటసాయాహ్నమ్ములన్ భక్తితో డను శంభో! శివ దేవ! శంకర! హరా! ధక్కాధరా! యంచుఁగీర్తనలన్ బాడ, 'మనోహరం' బనెడు కాంతా కంఠ విస్పష్టసుస్వనమాధుర్యములోన మేనుమఱచిన్ భక్తాంగనాసంఘముల్

ప్రతిసాయాహ్నపు సంజవేళనచటన్ ప్రారంభమై పొల్చు భారత ధర్మంబునుఁ దేట తెల్లముగ నేర్పంబూని భాషించు విశ్రుత విద్వన్మణి వాఙ్మరంద మధుర స్రోతస్వినీధార, పర్వత శృంగాగ్రఝరీనిభంబు, త్రిముహూర్తవ్యాప్తకాలంబునన్.

క. ఇందిందిర బృందము మక
రందార్థం బెట్లు కుసుమ రాజిన్ జేరున్
వందలుగా నిత్యము జన
సందోహము వచ్చి కొలుచు స్వామిన్, దేవిన్.

క. రేలను, తొలియామము తుది
నాలయమున హరునకిచ్చు హారతి వఱకున్
భూలోకపుఁ గైలాసము
వోలెన్ గోవెల చెలంగుఁ బుణ్యప్రదమై.

సీ. ఆరోగ్యమునకునై యభిషేక మొనరింప
నర్థిమై జనతతు లరుగుదేర,
చదువులం దున్నతస్థానముల్ కాంక్షించి
యర్థిమై విద్యార్థులరుగుదేర,
రాజకీయమ్ముల రాణింపఁ జేయు మం
చర్థిమై ప్రముఖౌఘ మరుగుదేర,

బిడ్డలనిమ్ము, నీపేరు పెట్టుదుమంచు
 నర్థిమై దంపతులరుగు దేర,

నిత్య దర్శనమునకు ననేక జనులు,
మ్రొక్కు బడులనుఁ జెల్లింప లెక్క పెట్టఁ
జాలని జనమ్ములగు దేర, శంభుఁడచట
నెల్ల వేళలఁ గొలువుండు నింతితోడ.

కావ్యావతరణము

వ. అట్టి భవదాలయ సమీపంబున నేను కాపురం బున్న పదునెనిమిదవ వత్సరంబున.

క. నా కూఁతురు ధర్మావతి
యీ కావ్యము వ్రాయు తలఁపు లేర్పడఁ జేసెన్;
నా కప్పుడపుడు తోడ్పడె
నీకథ గురురాజు తత్కృతీంద్రునకు బలెన్.

ద్వి. రగడ: కోలఁదిగను పద్యములుకూర్చితిమి జోడుగను
 కలకండపొడిని శర్కరఁగలుపు వడువునను;
 మల్లెపూదండలో మారేడు చిఱుదళము
 లల్లి మెడ నిడినట్టు లందుదువు కడుముదము.

క॥ నాతనయ భాషణమ్ముల
నేతత్కథ వినుము పార్వతీశ్వర! నీకున్
జేతము పల్లవితంబగుఁ
జూతము గ్రొంజివురుఁ దొడిగి సొంపగురీతిన్.

క. శారద నవరాత్రులలోఁ
భారతి పూజాదినమ్ము వచ్చుటచే, నే
నారోజున నాగేశ్వరు
గూరిచి పద్యములు వ్రాయుకోర్కి జనించెన్ *

సీ. మందాకినీ నదిన్ మఱపించు కాసార
మిల సర్వ పుణ్యాపగలకునునికి;
శ్రీరాముగుడియును. చెంత మంటపమును,
నిల సర్వ కల్యాణములకు నెలవు;
భజనలు, హరికథల్, బహుపురాణమ్ములు
జరుగు మంటపము విజ్ఞానమయము;
వెలయు నైరావత ద్విపకుంభములఁబోలు
గోపురమ్ములు ద్రుంచుఁ బాపములను;

గర్భగృహమందు శివునిలింగమును, బయట
శివున కభిముఖముగ నంది, శివున కెడమ
వైపు గుడిలోన గౌరి శుభంబులొసఁగ,
నాలయంబొప్పు పావనశ్రీలు చెలఁగ. *

సీ. జంబూ రసమ్ములో జలకమాడు పసిండి
తీగనుఁబోలిన దేహకాంతి,
తొలకరి మెఱపులా? చలదింద్రనీలంబు
లా? యని భ్రమఁగొల్పు నతీయుగ్మ,
మమృతకాసారమై, యలరు తేనియకోవ
యై, యొప్పు చిఱునవ్వుటాననమ్ము,

బాలపల్లవ సన్నిభంబులు కల్హార
పాటలమ్ములునైన పాదయుగళి,
కలిగి యే దేవి సర్వమంగళములొసంగు
నామె బాలాత్రిపురసుందరాంబయునంగ
నలరు నాగేశ్వరస్వామి కర్ధదేహ,
సర్వజగములు పాలించు శాంతమూర్తి. *

శారదపూర్ణిమా నిశలచంద్రునిఁబోలిన కాంతిఁగల్గి, మం
దార సుమంబుపై నళికదంబముఁబోలిన కుంతలాల, బృం
దారక వాహినీందులనుఁ దాల్చిన పన్నగభూషణుండు, గౌ
రీరమణుండొసంగు జనహృద్యముల చ్చట లింగమూర్తియై.

తే.గీ. చరమసంధ్యా సమయమున హరియు, సిరియు,
భారతీబ్రహ్మ, లష్టదిక్పాలు, రమరు
లును, నవగ్రహములు, నాగులునరు దెంతు
రనుదినంబును శివదర్శనార్థులగుచు. *

క. గిరిజా, స్కంద, వినాయక,
సురభిజయుత పూలి కొలువు సొంపుగఁదీర్పన్,
సురుచిర దీపావళితోఁ
దరళించు మణియుతమగు నుదధివలె నెప్పుడున్. *

సీ. తూర్పుదిక్కునుండి కర్పూరముత్యముల్
నావికుల్ కొని తెచ్చి ప్రోవులిడగ,
దక్షిణదిశనుండి తమ నాట్యగాంధర్వ
శోభకళావతుల్ చూపుచుండ,

పడమటిదెసనుండి పాలు కుండలనిండ
కొని తెచ్చి గొల్ల భామినులొసంగ,
నుత్తరదిశనుండి యుత్తమ ఫలపుష్ప
వస్త్రకాంచనములు వణిజులొసఁగ,

నర్చకులు పూజలొనరింప, సకలజనులు
స్తోత్రములుచేయ, భూసురుల్ శ్రుతులుపాడ,
భద్రపీఠాసనస్థుఁడౌ పరమశివుని
నంబికనుఁ జూచునదె భాగ్యమాలయమున. *

ఈ తేఁబ్రాయపుబాలపద్యములు నాగేశాఖ్యుసాన్నిధ్యమం
దాలాపించినవేళ, స్వామికథ వ్రాయన్ బూంగి భావాబ్ధి, రా
కాలావణ్యమయేందు బింబమునుఁ దాకన్ బూనుసింధూర్మికా
జాలంబున్ గమియించి, చేరె గిరిజా సర్వజ్ఞ పాదాబ్జముల్.

ఆ. వె. అంత ధర్మకర్త హనుమంతరాయుని
కెఱుకచేయఁ, బ్రోత్సహించి రచన
తెలిసినంతకథయు తెలుపఁగఁ జవులీను
కావ్యధునిస్రవించెఁ గలముకొనను.

ఆనాఁడిట్లు మహాత్ముగన్ సవితృ బింబాంతర్గతుండైన ల
క్ష్మీనారాయణమూర్తి ప్రేరణను, తత్ శ్రీనాథు సంప్రీతిగా,
నీనాగేశ్వరుప్రీతి, ప్రేరణయు, బ్రాహ్మీప్రౌఢియున్ దోడ్పడన్,
నేనైతిన్ బితఁగావ్యకన్య కుమకున్ నీహారశైలక్రియన్.

* ఈ గుర్తుగల పద్యములు చి॥ సౌ॥ ధర్మావతీ రచితములు.

## కృతికర్త వంశము

మధ్యా: భువిని శ్రీవత్స సగోత్రమున జన్మమంది, భార్గవుఁడు, చ్యవనుఁడు, నాప్లవానుఁడును, నౌరవుఁడును, జామదగ్ని, ప్రవరయగు తేకుమళ్లాన్వవాయతరు ఫలమునైన కవియశార్థి నగు నావంశకథ నొకించుక విన్నవింతు.

తే. గీ. అంబికానాథ! తేకుమళ్లాన్వయంబు
మొగలుఫౌజ్ దార్ల, సుద్యోగముఖ్యజనుల,
గోలకొండను, నార్కాటునేలు విభుల
మంత్రులను గన్నవంశమ్ము, మాన్యయశము.

వ. మొగలుచక్రవర్తుల దక్కన్ సైన్యాధ్యక్షుఁడును, 'వీర బల' బిరుద విభ్రాజియు, మా పూర్వుఁడునునగు కపిల నరసింహులు నేఁడాంధ్రప్రదేశ్ నకు రాజధానియగు హైదరాబాదునకు సమీపమున 'తేకుమళ్ల'యను గ్రామమున నివసించెను. ఆయన కుమారుండగు రాముజీకి ధర్మాజీయును, ధర్మాజీకి కృష్ణప్పయును నరసింహారావును జన్మించిరి. ఆ నృసింహారాయఁడు.

ఆసఫుజాహి వంశమున కాదిపితామహు కూర్మిమంత్రిగా భాసిలి, బందిపోట్లణచి, వర్తకరీతుల పెత్తనమ్ము, విశ్వాసము తేనికింగలుగఁ, బాలితులాతని న్యాయశీలమ గ్రాసనయోగ్యమంచుపలుకన్ నెఱపెన్ దనకాలమంతయున్.

తే. గీ. పిల్లలను, స్త్రీల, నగలను, వెండి, పైడి
దొంగిలు ముఠాల వధియించి, దుష్టులెచట

నున్న నచటఁ బ్రత్యక్షమై యుక్కడంచి
తెలుఁగు సింహము నాకీర్తి తెచ్చుకొనియె.

వ. కపిల నరసింహాఖ్యుని మొదటి కుమారుండగు రంగశాయి కవితాసంపన్నుఁడయ్యె. నాతనిపౌత్రుండగు అచ్చన్న పంతులు 'వీరవర' 'ఫౌజ్ దార్' అను వంశ, బిరుద నామంబులును, 'రాయజీ' యను లౌకిక నామంబునుఁ గలిగి యార్కాటు నవాబున కుం బ్రధాన మాత్యుండై.

తే. గీ. తురకలను, హిందువుల నొక్క తూకమునను
తూఁచి దుష్టులదండించి, ప్రోచిజనుల,
సస్యవంతముఁ జేసి దేశమ్ము మాదు
రాయజీ కీర్తిగాంచె నార్కాటు సీమ.

వ్రితి పల్లెన్ మధురామృతాశయముల్ ద్రవించి పాలాశ విస్తృత సస్యాంబరఁ జేసి భూసతిని, శాసీక్రుత్ప్రభుత్వేందిరా శ్రిత సన్మంగళ చంద్రికా స్ఫురిత పృథ్వీవాస సంతుష్ట హృద్గత నిత్యామలరత్నదీపకళికా కాంత్యాకృతిన్ నిల్చుచోన్.

వ: ఒక్కనాఁడు,

నెలవైయె, వాకిట చాప చుట్టనిడి, కోనేటన్ గృత స్నాతయై
కులకాంతామణియో ర్తువచ్చుసరికిన్ కూండాయొకండందు లో
పలమూంసంబును దాఁచి,కూడెవనునీవయ్యారి, భక్షించె నెం
గిలి నాతోడను, కాపురమ్మునిఁక సాగింపన్ దీనిఁగొంపోమెదన్

ఆ. వె. నేను పలుకు మాట నిశ్చయమ్మని తెల్పు
సాక్ష్య మీయఁ గలదు చాపచుట్ట,

యనిన, దానఁ గాంచి యామిని ఖండముల్
వనిత చేష్టలుడిగి వణక సాగె.

కం. దుష్టయని కొందఱన, ని
ర్దుష్టయనిరి కొంద, ఱిటునుఁ దోఁపక యితరుల్
భ్రష్టగ నెంచుట యొప్పని
యిష్టము వచ్చిన ప్రకార మిటునటు పలుకన్.

వ. ఇట్లవమాన వ్యాకుల సంక్షోభిత చిత్తయై, యారామా మణియు, నామె పెనిమిటియు, సహృదయులును నా గూండాను వారించుచుండ.

తే. గీ. ఇంతలో నాల్గు నూఱుల యిండ్లవారు
మొదటి గూండాకు నండగా కదలి వచ్చి
పంపకుండిన మాతోడ, పట్టి కట్టి
వెలదిఁ గొంపోదుమని హూడావిడీ యొనర్ప.

ఆ. వె. ఆమె మామగారు రాయజీకడ కేగి,
మనవిచేసికొన్న మఱి విభుడియు.
కూల్చి త్రవ్వఁ బంచె గూండాల కొంపలా
యూరినుండి వారి పారద్రోలె.

అపుడు డాక్టరు నవాబుగారికడ ఫిర్యాదాఖలుల్ చేసి, యో నృపతీ! మమ్ము, మహామ్మదీయులను, మంత్రి శ్రేష్ఠుఁడంచీవు మా ర్ధపదంబం దిడుకొన్న రాయజి యెటుల్ రాపాడెనో చూడు; మీ విపరీతంబగు చర్య తెల్పుగద తన్నిర్భీతి నిర్లజ్యముల్.

అనిన, నవాబుపల్కె : పురమందున నింతటి దుష్టులుంటకే జనపతియున్ సహింపఁ;డతి శాంతుఁడుగాన నమాత్యుఁడింతతో గనికరమూనె; నేనయినఁ గత్తికి మిమ్మెర చేసియుండెదన్ : మన మతమేకమంట,యవమానము నాకు 'ఖురాను'కీర్తికిన్.

తే. గీ. తప్పుచేయఁడు రాయజీ; తథ్యమిద్ది;
ప్రజలసేమమ్మె, న్యాయధర్మములు. దైవ
భక్తి, నాత్మేమయోగానురక్తి కలిసి
ప్రాణపంచక మాయెదు రాయజీకి.

వ. అని, ఇంక మీరూరుచొరక, దూరాన సద్వర్తనులై మెలంగు; డిందుకుం దప్పినఁ గఠినశిక్షకుం బాత్రులగుదురని యానతిచ్చె; నంత నొకనాఁడు.

తే. గీ. స్నానఘట్టంపు మెట్ల పార్శ్వంపురాతి
యేన్గుతలను ముక్కుపుడక నెవరొ మఱువ,
నామె యెవ్వతో తేలెదు నంతవఱకు
పదిలముగఁ జూడ రాయజీ భటులనుంచె.

తే. గీ. ఒక్క యేడాదికొక పొరుగూరినుండి
తల్లికూఁతుండ్రు పయనించు దారిలోన
సరసి, 'నాముక్కుపుడకి దేనమ్మ, దొరికె'
నను సతికి రాయజీ దాని నందఁజేసె.

వ. ఇట్లు ధన, మాన, ప్రాణ రక్షణమును, ప్రజల సుఖ సంతోషములునుఁ బ్రభుత్వ కర్తవ్యంబులనుటను విస్మరింపని రాయజీని గురించిన యనేకంబులగు కథలును, ననేక ప్రదే

శంబుల రాయజీ చెఱువులును, నేఁటికిం గలవు. పైన పేర్కొన్న నృసింహామాత్యునకు శాయన్నయు, నాయ నకు శ్రీనివాసరావును జనించిరి. శ్రీనివాసరావును, ఆయన కుమారుండగు రామారావును నిడదవోలు, సెట్టి పేటలయందు నివసించిరి. పిదప రామారావు విజయ నగరంబున నావాస మేర్పరచుకొనియె. ఆయనకు నా పితామహుండగు నారాయణరావు జన్మించె; నాయనకు.

తే.గీ. నేఁటికెనుబది యాఱేండ్ల నాఁడు ధాత
వత్సరాషాఢమునఁ గృష్ణపక్షమందు,
తదియనాఁడు జనించె మా తండ్రియైన
రాజగోపాలరావను ప్రథిత యశుఁడు.

తే. గీ. తెలుఁగుకైత నన్నయమున్న వెలయలేదు,
యుద్ధమల్లుని శాసన మొప్పు వచన
మందను జయంతి రామాది ఘనులకందుఁ
గలవి మధ్యాక్కరలటంచుఁ దెలిపెనతఁడు.

వ. కాదని వాదించిన కాశీభొట్ల బ్రహ్మయ్యశాస్త్రి మున్నగువారి కిట్లు నజ్జనకుండు సత్యంబు సతార్కికంబుగా వివరింప వారంగీకరించిరి. ఇట్లు తెలుఁగు కవిత్వపుఁ బ్రాచీనతయు, తెలుఁగు సాహిత్యమున నక్కరల పునర్దర్శనమును స్థిర పడియె. ఇట్లనేక విద్వచ్ఛాఖలందారి తేజి,

క. తెలుఁగుల ప్రాచీనతయునుఁ
బలుకుల పుట్టుకయుఁ, దోడి భాషల ఛందం

బుల తెలుఁగును, సాహిత్యముఁ
దెలిసి యతఁడు వానిఁ దేటతెల్లము చేసెన్.

తే. గీ. తెలుఁగు, మలయాళ, కన్నడ, తుళు, తమిళము
లును, ట్యుటోనికు భాషలలోని తొలుత
పలుకులును, ఛందములు నొక్క ఫక్కివనియు
నార్యభాషల తొలిశాఖలనియుఁ దెలిపె.

తే. గీ. తెలుఁగు భాషకు ద్యుమణియై చెలఁగె, నందు
చెన్నపురి విశ్వవిద్యాలయోన్నతాధి
పత్యము వహించె; గ్రంథముల్ వ్రాసె పెక్క;
తనకుఁ దానొక్కఁడేసాటి యనఁగఁ జెలఁగె.

క. ఆ విజ్ఞానమమోఘుం
బావనయంబతియతుల్యు, మా శాంతము నో
ర్పు విశ్వంభర గుణనిభ,
మా విమల విశాల హృదయ మత్యున్నతమున్.

వ. అట్టి మాతండ్రి బహుధాన్య మార్గశీర్ష బహుళ ప్రతిప
ద్దినంబున అఱువదిమూఁడవయేట నస్తమించె. నేఁటి
కేబదితొమ్మిదేండ్ల నాఁటి శోభకృదాశ్వయుజ బహుళ
దశమినాడు మాతల్లి రంగనాయకమ్మకు జన్మించిన నేను.

సీ. అగ్రజుండ నిరువురాత్మజులను, రామ
చంద్రరావందురు జనులు నన్ను;
విద్యార్థి, గ్రంథాలయాద్యుద్య మమ్ముల
నాంధ్రోద్యమమున నాయకతఁ బూని,

సంఘుసేవకు జీవసౌరభమర్పించి.
ప్రజల మేలునకునై పాటుపడుచు,
నవలలు, వ్యాసముల్, నాటకమ్ములు, కథల్
గ్రంథముల్ కొన్నింటి రచనచేసి,

న్యాయవాదిగ బందరునందు వృత్తి
నెఱపు సద్వంశ జాతుఁడ; నీకునేను
సరళకవితా విలాస వైశద్యమొలుకు
కావ్య మంకితమిచ్చు భాగ్యమ్ముకలిగె.

అంకితము

ద్విపద: బందరు పురవాస! పన్నగభూష!
యిందు కళాశీర్ష! యీశ్వరీతోష!
విశ్వనాథ! గిరీశ! వృషభాంక! త్రిపు
రీశ్వరీ సహిత నాగేశ్వరస్వామి!

ద్విపద: ఈకృతినంకితమిచ్చు చున్నాఁడ;
స్వీకరింపుము, దేవ! చిత్తముప్పొంగ,
సావధానమ్ముగాఁ జదువుము దీని;
దీవనల్ మాకిమ్ము. దేవాధిదేవ!

ధరణీదత్తులు, మేనకాద్రిపతులే తత్సూతినీయంగ, సా
గరుఁడ భ్రాపగ, దుగ్ధవార్ధి శశిరేఖన్, దత్కోటీంద్రుండుమం
దిర, కాసార, వనావనీస్థలుల భక్తిన్ గూర్పనీ కావ్య
సుందరి నేనిచ్చితి, స్వీకరింపుము దయన్ దాక్షాయణీవల్లభా!

క. నీప్రేరణచే, దయచే,
నేప్రావీణ్యమును లేని రేనొక కవినై,
నీప్రీతి రచనచేసిన
యీప్రౌఢోజ్వల సుకావ్యమెసఁగుత ఘనమై.

క. దీనిని జదివిన, వినినను,
మానిత శబ్దార్థ భావ మననము జరుపం
బూనినను, నీవు సదయుఁడ
వై, నాగేశ్వర! యొసంగు మీప్సితసిద్ధిన్.

షష్ఠ్యంతములు

క. నవకోటి సంఖ్యనెసఁగెడు
శివలింగములందు నభీఁజెలఁగిన పిదపన్
భువిమీఁదఁ బొల్చిసజ్జన
నివహాళ్ముల పూజలుగొని నెగడు హరునకున్

క. తనయంతట నీ పురిలో
వనమందున బయలువెడలి, భవ్యాలయమున్
దనకై నిర్మింపఁగఁజే
సిన నాగేశునకు, శీర్ష శిఖరేందునకున్.

క. గౌరీసతి కోరికపై
నీరేడుజగంబులందు నెల్లెడ సృష్టిన్
బ్రారంభింపఁగఁజేసిన
కారుణ్య సుధాంబునిధికి, గౌరీపతికిన్.

క. నానాపుణ్య నదీనద
పానీయము లిటకుఁ దెచ్చి, పద్మాకరమం
దానీరు నిలిపి, తీర్థం
బానటు లొనరించినట్టి యంబాపతికిన్.

క. తమి బాలా త్రిపురాంబా
రమణుఁ గోటీ రామచంద్ర రావు ప్రతిష్ఠిం
ప, మురిపెమున జనుల నమది
నము సంరక్షించునట్టి నాగేశునకున్.

క. దీనుల, కార్తుల, కితరుల
కానందముఁ గూర్చి, యొసఁగ నడిగెడు వరముల్,
తానిత్యము త్వత్పాలన
కై నాథునితోడ తరలు నంబకు, సతికిన్.

మత్త. అన్నపూర్ణకు, సర్వమంగళ, కద్రిరాజ తనూజకున్,
సన్నుతామరకోటి, కార్యకు, శంభురాణికి, గౌరికిన్;
బన్నగాభరణోరు సుందర బాలచంద్రకిరీటికిన్,
గిన్నరేశ్వరు మిత్రుఁడౌ గిరికేళిసద్మ విహారికిన్.

తే. గీ. మానసమ్మున భక్తి నమస్కరించి,
యభ్యుదయ పరంపర లధికాభివృద్ధి
యగునటుల నీదు జనన, మాహాత్మ్యములను
దెలుపు నీకథ మొదలైన తెలుఁగు వినుము.

## కథా ప్రారంభము

ఆ. వె. తెలుఁగు కడలిపొంత, నెలవంక చాడ్పునఁ
బరగు తీరమధ్య భాగమందు
ధరణి తరుణి మెడను తాళిబొట్టననొప్పు
బందరనెడు తెలుగు పట్టణమ్ము.

తే. గీ. తేఁడొకఁడు చేపకంటితో రేవుగవనిఁ
గట్టఁగ 'మచిలీ'బందరై క్రాలెపురము;
బందడను నొక జాలరి పట్టెనంట
యీమహాఘనమొక యుపాయమ్ము పన్ని.

మచిలీబందరు పట్టణమ్ము జగతిన్ మాన్యంపు రేవై, యశో
నిచయమ్ముంగొనె రాజసూయమునఁ గుంతీపుత్త్రునింబోలి; యి
ట్లుచనెన్ వర్ష సహస్ర; మయ్యు, నిఁక నేఁడున్ బందరీయొుడెనా
వచియింపంబడు గొప్ప రేవు లిలపై వర్ధిల్లుటల్ సాగినన్.

సీ. ఈ బందరున్న మహీఖండ మాదిలో
నంభోధిఁ బెనుమీన మట్టులాదిగె;
దక్షాత్మజాతతోఁ దాను చెప్పినయట్టు
లబ్ధిని లింగఁడై హరుఁడు పొడమె;
వార్ధి మొరకవేయ, వసుమతీ గర్భమ్ము
గేహమయ్యెను నందివాహనునకు;
నాగ లోకమునం దనంత, వాసుక్యాది
గోనసమ్ములు తెల్లగొడుగు పట్టె;

నాగమందిరుండు, నాగసేవితుఁడును
నాగభూషణుండు, నాగవరదుఁ
డై గిరీశుఁ డెసఁగ నాగేశ్వరుండయి
భూమిలోన నూఱు పుష్కరములు.

తే. గీ. వార్ధి నీవట్లు పుట్టి, యీ పట్టణంపు
రత్నగర్భను నూఱ్ఱ వర్షమ్ము లోదిగి,
ప్రసవ సమయమ్మునకు వేచు నిసువువోలె
నెదురుచూడ, నొకానొక యుదయ వేళ.

## సూ ర్యో ద య ము

సీ. ఉదయ పాథోరాశి నుదకోపరిస్థలి
నూర్మికాడోలల నూఁగి యూఁగి
పొడుపు గుబ్బలిగద్దె పూర్వసోపానమ్ము
లొకొక్కటిగ నన్ని యెక్కి యెక్కి,
నందనోద్యానవన ధరణిరుహ లతా
వ్యాకోచ సుమగంధ మాని యాని,
మలయాచలాగతానిల వీచికారోహ
ణాలాఘవమ్ములఁ దేలి తేలి,

చెంతనున్న యుషాయోష సెలవుపొంది,
పలుకరించుచు నరవిచ్చు పద్మములను,
ధరణిసురులిచ్చు నర్ఘ్యపాద్యములు గొనుచు,
బాలభానుండు తోఁచె నంబరమువీఁద.

స్వాగతమిచ్చు వేళఁ దగువస్త్రములన్ నిగలొప్పనెంచి, సూ
ర్యాగమనార్థియై, యరుణరాగపుఁ జీరధరించి, చూడగన్
బాగుగఁ దోపమిం, గపిల, పాండుర, రోహిత, పీత చేలముల్
బాగుగ లేక, తాల్చెసితవస్త్రము సాంధ్యపురంధ్రి తృప్తిగన్.

తే. గీ. గగనసౌధంపు తూరుపు గవనియొద్ద
తెలుపు మబ్బుల తోరణములనుగట్టి,
యల నవాబుల చంద్రశాలలకుఁ బైన
బావుటాలెత్తి యందించె స్వాగతమ్ము.

18 వ శతాబ్దములో బందరు పట్టణము

సీ. సంవర్తికలఁ బోలు సౌధాగ్రపంక్తులు,
పారియాత్రముఁ బోలు భవనచయము,
శశి, సూర్య, తారా, భ్ర సౌందర్య బింబిత
స్వచ్ఛాంబుపూర్ణ కాసార నికర,
మహా హారిద్వ్యాప్త రత్నాకర సంచార
కనక శైలాభ నౌకాశతంబు,
వస్తువిస్తార సంపద్విశేషాపణ
భాసుర జనపూర్ణ పణ్యవిధు,

లారసాతల హారి సంచారమైన
కందకమ్మును, జైతన్య కళయుఁ, గలిగి
ధరణి యదరంగ ధాన్యముల్ దాపు నినద
మొప్ప, బందరు వెలసె నాయుగము వేళ.

సీ. ఉత్తుంగ హేమకూటోర్జ కందరముల
దీటౌ నవాబుల దేవిడీలు,
మల్లెపూవుల చెండ్లమధ్య గులాబులో
యను కోఠివారి మహాలులబారు,
క్రొమ్మావి కోఁటలోఁ గొబ్బరిగుబురట్లు
వఱలు కాంట్రేగుల వారిమేడ,
కొలని తామర పూలగుత్తియా నేర్లగ
డ్డాన్వయనీడుల హర్మ్యములును,
వైశ్యముఖ్యులు మాజేటివారిదైన
స్వర్ణచంపక గుచ్ఛము పచ్చమేడ,
ధవళగిరి తనయ లితర భవనవితతు,
లలరి భానుని లేయెండనాడఁగొనియె.

తే. గీ. పుడమిని బొడుచుకొనివచ్చు కడలిపాయ
చివరఁగట్టిన మత్స్యంపు గవనిపొంత,
మన నవాబు లొసంగిన మాన్యమ దు
వర్తకముచేసి రింగ్లీషు వణిజు లపుడు.

తే గీ. కొన్ని గిడ్డంగులును నొక కోట కట్టి,
చాకిరేవులచోటి కీశాను దిశను
వాసమొనరించి రింగ్లీషుపాలెమునను;
మొగలిపూవట్లు సందులు మొనసె నచట.

తే. గీ. దానితూర్పున ఫ్రెంచివర్తకులగేహ
ములును, గిడ్డంగి బారులు చెలఁగెఁ దీర్చి

దిద్దినట్లున్న రహదారు లద్దమట్లు
శుభ్రమై క్రొంచిపేటకు శోభఁగూర్చె.

తే. గీ. దానికుత్తరమున వలందాలు కట్టు
కొనిరి గిడ్డంగులును, నిండ్లకూడలులును;
చెఱువులనుఁ ద్రవ్వి రింటింటిచెంత, వారి
సుందరంబగు హాలండు నందు వోలె,

తే. గీ. ఇనుగుదురు దక్షిణప్రాంతమున, నవాబు
లును, షియాలును, సున్నీలుఁ దనరుచుండ,
గొడుగుపేట, యీడేపల్లి, కడమపేట
లందుఁ జెలఁగె హైందవుల గృహమ్ములపుడు.

సీ. ప్రతియింటి గడపకుఁ బదియారు వన్నెల
బంగారు చాయలోఁ బసుపుఁబూసి,
మంకెన పూలెఱ్ఱ మందారసుమముల
యటులందుఁ గుంకుమ బొట్లుపెట్టి,
వాకిట గోమయవారి ధారలు చల్లి,
లక్ష్మీప్రదంపు కోలములుపెట్టి,
వాకిటికెదురుగా వఱలు లోద్దొడ్డిలో
తులసమ్మ చుట్టు ముగ్గులనుఁ జుట్టి,
బొట్టు, కాటుక, దుద్దులు, పూస, పుస్తె,
పెడన చీరయు, పసు, పంచె కడియములును,
పైట, రవికయుఁ, గొప్పు, పుష్పములు, గాజు,
లలరు సతులొప్ప, శోభించె నన్నియిండ్లు.

ప్రతి ప్రత్యూషము స్వీయగేహముల విప్రశ్రేష్ఠులున్, శిష్యులున్,
శ్రుతి, వేదాంత, పురాణముల్ పలుకగన్, క్షోణీతలానేకవృ
త్తితతిన్ గోవిదులిండ్ల నేర్చు పటిమార్థిశ్రేణి వర్ధిల్ల, సం
తత సారస్వత కల్పభూజమయి తత్స్థానంబు రంజిల్లఁగన్.

తే. గీ. వస్త్రముల నేఁతయందును, వానియద్ద
కంబునందుఁ, జక్కని కలంకారియందు,
మిసిమివన్నెల 'మసిలిను' వసనములను
నేఁతనేయుట యందును నేర్పుమీఱి.

తే. గీ. నేఁతకాంద్రను మించిన నేఁతకత్తె
లద్దకపు చక్రవర్తిను లనఁగ వెలసి
రందెవేయని దొకచేయియైన లేని
నాఁటి గొప్పలు వర్ణింప నలువతరమె!

తే. గీ. ఒప్పెసఁగెఁ బణ్యభాగమ్ము లూరినడుమ,
నొక్క రకమైన వస్తువు లొక్కవీధి
బరఁగునట్లు బజార్ల నేర్పఱిచినట్టి
సురుచిర యశమ్ము బందరు పురికిఁ గలిగె.

## రక్కసదిబ్బ

ఆపురి ముఖ్యవీధిని గజాశ్వములున్, శకటంబులున్ గడున్
మోపుగ సాఁగ; బల్లకులు, మూసిన మేనలు నేగ; నావికుల్
సౌపథగాములై సకల సంసరణమ్ముల కక్షిపర్వమౌ
రూపముఁగూర్ప, రక్కసలప్రోగులు క్రొవ్వన మొల్చె నొక్కెడన్.

ఆ.వె. బొమ్మజెముడు, రేఁగు, తుమ్మ, పల్లేరులు,
నాగజెముడు, కొండగోఁగు పొదలు,
కానుగలు, కసింద, కామంచి, యుమ్మెత్త,
లన్ని ముండ్లమొక్క, లర్కములును.

ఆ.వె. గచ్చ, కుక్కమేడి, గర్దభాండములును,
దురదగొండి, తాండ్ర, దిరిసెనలును,
కాకివెదురు, మంగ, కలిమారకమ్ములు,
తిప్ప, ఛాగ, నల్లతెగడచెట్లు.

ఆ.వె. ఈత, తాటిగుబురు, లిక్షుగంధఁబులు,
కాక, ఘూక, ఝిల్లికలునుఁ దేళ్లు,
నక్కబొక్క, లక్కడక్కడ పాము
పుట్టలుండె పెద్ద మిట్టలట్లు.

కొత్త రామచంద్రరావు

తే.గీ. తత్తనలపు దొరయగు జమీఁదారు, సుజన
జనవరుఁడు, కొత్త రామచంద్రరావు
ద్వైతమతవర్తి, పూర్ణబోధ ప్రశిష్యుఁ
డఖిల సద్ధర్మ సంపన్నుఁ డలఘుఁడెసఁగె.

క. రేవులఁ బాలించుచు, నా
కా వాణిజ్యాది సకల కార్యాధ్యక్షుం
డై వెలసెను, నైజామున
కా విప్రోత్తముఁడు హితుఁడు నాప్తుండగుచున్.

తే. గీ. దక్షతయు, నీతి, కార్యతత్పరత, నియతి,
శ్రద్ధ, విశ్వాసపాత్రత, సత్యనిరతి
కలిగి, వర్తక వాణిజ్యములను వృద్ధి
పఱిచె నా కోఠివంశ పావనుండు.

తే.గీ. ప్రాచ్య, పాశ్చాత్య వర్తక ప్రముఖు లఖిల
రాజదూతలు దర్శనార్థమ్ము రాఁగ,
క్షణము తీఱిక లేని యాత్మ్నసురే ప్రఁ
డెట్టిటులో తీఱుబడి కని, కట్టఁడపు.

క. ఒక సాయాహ్నము వాహ్యా
ళికి తత్స్థలమునుఁ గన వెడలె నందుమిగులన్
వికటమగు నా ప్రదేశము
నొక చక్కని యుపవనముగ నొనరుచు నూహన్.

సీ. పున్నమ నడురేయిఁ బొలుచు శాంతాబ్ధిమో
యన, శాంతగంభీరమైన మోము,
సింధురత్నములట్లు చెలఁగు చదన ముద్ర
లతిశుభాంగార, మక్షతలబొట్టు,
బాణపుంజములట్లు భాసించు చూపులు,
వారణ కరములౌ బాహువులును,
వీణ మీటిన యట్లు వెలయు కంఠధ్వని,
గౌరవర్ణంపు టంగరఖ తీవి,

కౌముదీ ఖండమగు కండువా మెఱుంగు,
కాలి ముచ్చల సౌందర్యగతులు నొప్పు,

పదియు నాలుగు విద్యల పట్టభద్రుఁ
డైన యా భూమిసురుఁ డట కరిగి, చూచి.

అల్పాక్కర : పేరు పెంపుల మధ్య పెద్దమ్మనైయె
యూరి నడుమ నిట్టు లుండకూడ
దారామముకన్న శ్రీ హర్మ్యముగ
మాఱు నిది, యని నెమ్మదిఁ దలంచె.

అని, సంకల్పమొనర్చి, తత్క్షణము, కార్యాసక్తిఁ బ్రాభాత వేళను దైవజ్ఞులఁ, బెద్దలన్, హితుల నుల్లాసంబునన్ బిల్చి, చక్కని యుద్యానము దిబ్బయున్నడను యుక్తంబౌనునిర్మింపగా నని తోఁచెన్; దగు సన్మహూర్తమునకై యర్థింతు
మీ యానతిన్.

క. అని, కైకొనె నామోదం
బును; నపుడేర్పఱిచి లగ్నమును దైవజ్ఞుల్
వనమున నగునని రోకపా
వనకార్యంబతని పాణిపల్లవకృతమై.

ఆ.వె. కొడుకు, చెఱువు, నిధియు, గుడియు, వనంబును,
భూసురాగ్రహారమును, సుకావ్య
చయము వినుతికెక్క సప్తసంతానమై
వీనిలోనఁ గొన్ని వెలయు నిచట.

తే.గీ. అనిన, దైవజ్ఞ సత్కారమా చరించి,
వీడుకోలిచ్చి హితులకుఁ బెద్దలకును,

నాఁటి మధ్యాహ్నమే బోడపాటి వంశ్యుఁ
డును తన దివానగు గురురాజునకుఁ దెలుప.

తే. గీ. స్వామి భక్తిని నంజనా సంభవుండు
కాక యొరులెవ్వరును సాటికాని యుక్తి
వంతుఁడు దివాను చేయించె వలయు పనులు,
రక్కసల దిబ్బను శుభమ్ము ప్రాప్తమయ్యె.

ఉ ద్యా న వ న ము

మధ్యాక్కర:
శుభముహూర్తమునాఁడు సకల సుజనులు, పెద్ద, లాశ్రితులు
నభిమానులునుఁ జుట్టములును, నరుదేర, నతియథావిధిగ,
నభిరామ విభవమ్ము లొప్ప, నారామ సుప్రతిష్ఠా ప
న భగవ త్ప్రీతిగ జరుగ, నయనోత్సవంబయ్యెఁ బురికి.

సీ. మాలతీ, మల్లికా, మందార, మాధవీ,
నవమాలికా ప్రసూనములతోడ;
శమ్యాక, పున్నాగ, చంపక, బంధూక,
పారిజాతక పుష్ప పంక్తితోడ;
కట్మ్రల, వల్లరీ, కోమలాంకుర, లతా,
పల్లవోరు పరాగ పటలితోడ;
పడాకులరటితో, నింపైన మొట్ట తా
మరలతోఁ, బోఁకల తరులతోడ;

కుంద, క్రోటను మొక్కల కుండ్లతోడ;
లేగరిక పచ్చబాటల సోగతోడ;

మేలు పూదేనెలాను తుమ్మెదలతోడ,
దనరె వనసీమ చైత్రరథమ్ము వోలె.

సీ, ఆరామమున నొప్పు నీరజాకరములో
పనరాణి తనచక్కదనము చూడ;
వనజాత సంభవు వాహనమ్ములు నిత్య
మే తెంచి చెలువులో నీదులాడ;
చంద్రికల్ చవిలేక చాతకమ్ములు జలా
కర సుధామధురోదకమ్ములాన;
నడిరేయి నాగకన్యామణి స్తోమంబు
చనుదెంచి కొలనిలో స్నానమాడ;

కొనలు వీడెడు శతపత్ర, కువలయముల
దళిసి, రోలంబచయము నృత్యములు చేయ;
తోటదారయగు రామచంద్రుని విశుద్ధ
హృదయఫలకంపు టద్దమై హ్రదము తనరె.

క. తిరునాళ్ల ప్రజలవోలెను,
సురపథమున నీలరాత్రి చుక్కలవోలెన్,
తరులతల వెల్లివిరిసిన
విరుల విడరు, గంధమాని వృషదశ్వాదుల్.

తే.గీ. తోట రమ్యత రోహిణీందులు వరించి
గగనదుర్గాబ్ధినుండి యీజగతి జారు
పండు వెన్నెల సెలయేటి బాటవెంట
వచ్చి విహరించుచుండి రావనమునందు.

ఆయారామమునన్ జరింపమనమందాకాంక్షతోఁ బన్, బురం
ధ్రీయుక్తుండయి రామచంద్రుఁడొక జ్యోత్స్నన్ బుచ్చె యా
మత్రయం
బాయుద్యానవనంపుపూపొదల, వల్యానోకహచ్ఛాయలన్,
రేయిన్ బూచిన పూలపాన్పుల యొడిన్, శ్రీపర్ణి పెన్నీడలన్.

## శ్రీబాలాత్రిపురసుందరి సాక్షాత్కారము

వ. అంతనాలుగవయామంబునజానకీబాయమ్మకుస్వప్నంబున.

తే.గీ. మూవురమ్మలకును నిత్యపూజచేసి,
యెలమిఁ గర్పూరహారతు లిచ్చు నట్టి
క్షణమునందునఁ బార్వతీకాంత యామె
కలనుఁ దోఁచిన తెఱఁగు హృత్థ్సలికి వెలుఁగు.

సీ. మంచుకొండలమీది మబ్బుపొత్తిళ్లలోఁ
దారాడు తనుఁగని తల్లి పొంగ:
మృగరాజు మూపెక్కి నగశృంగములు దాటు
తనుఁగాంచి జనకు నెమ్మనము విరియ;
నమరాలయమ్ములో నచ్చరల్ తనుఁజూచి
తీరుగా నందాలు దిద్దుకొనఁగ;
పెండిగుబ్బలి నిల్చి విశ్వమేలెడుసామి
తనమెచ్చి స్త్రీయార్ధతనువొసఁగ;

తే. గీ వఱలు మాహేశ్వరీదేవి భర్తతోడ
భూమిపాలింప వచ్చి తత్పూజవేళ

శైశవముతొట్టి యిట్లు సాక్షాత్కరించి,
మూఁతమూసిన కన్గవ ముందు నిలిచి.

వ. తల్లీ ! మున్నొకప్పుడు త్రిపురాసురుల నెడు కూ్రరరాక్షసులు మూవురు మహాతపంబొనరించి.

కడురమ్యంబులు, కామగాములును, సౌఖ్యప్రౌఢసాంద్రంబుల య్యేడుస్థానీయములయ్యు పేంద్రుదయ దైత్యేంద్ర త్రయంబందగా నుడులన్ దోఁకలుపుట్టెనగ్రభమున, విద్యున్మాలియున్ దారకాక్షుఁడు, నింకన్ గమలాక్షుఁడున్ భువనసంక్షోభంబు నూహించుచోఁ.

తే.గీ. పైడితో నొక్కపురి, వెండితోడ నొకటి,
యినుముతో నొక్కటియుఁ గట్టి, వనయుతమ్ము
లైన నూతులమర్చిరి, వానినీటఁ
దడిపిన శవమ్ము ప్రాణముల్ వడయునట్లు.

తే.గీ. ఆ పురమ్ములు వెవ్వేర నలరకుండ
మూఁడు నొకచెంతఁ గలియుచో ముప్పు తప్ప
దసురుల కటంచు నచ్యుతుం డానతిచ్చె
దుష్టులకుఁ బూర్ణవరము నికృష్టమగుట.

తే.గీ. అవి యెగిరి వ్రాలి దేవ, మానవ పురమ్ము
లణఁగఁజేయ, నరామరుల్బృందము
శంభుఁ బ్రార్థింప, దేవతేజమ్ములడిగి,
కైకొని, తరలె శివుఁడు సంగ్రామమునకు.

తే.గీ. ధరణి యరదమ్ము, వేదముల్ తురగచయము,
రవిశశులు చక్రయుగము, సారథి విధాత,
శరము మాధవుఁ డంబికాజాని జోదు
నై యరుగుదెంచు ధూర్జటి నసుర లరసి.

మహాస్రగ్ధర. శివుని వామార్ధదేహానై మితిలేని చెలువమ్ము
చిందునన్నుఁ దిలకించి,
యెవరు కానోపు! నేవేళ పదియురెండేండ్ల ప్రాయముతోడ
నొప్పునీమె ?
భువనముల్ పదునాల్గిట నీ బాలపూర్ణ సౌందర్యము మెఱపు
మెఱసె ?
నువిద నాకూఁతురై యింటిని, బురిని యుద్ధర్షమునఁ దేల్చు
నట్లొనర్తు.

అల్పా: అని, యొక్కొకఁడెద నూహాలుచేయఁగ
నినుప పురము ముందెగిరివచ్చె ;
వెనుకనె మిగిలినవి యొకటి మీ
దనొకటి నిలిచె ; నంతట దనుజుల్.

అంత: నన్ను బలిమిఁగొనఁగ, జానకినిఁగొనుచు
మున్ను చనిన పులస్త్యపుత్రుపలెఁ, గుట్రఁ
బన్ని ; రత్తరి నేను పాదరసమునై,
పున్నమొటు లందదో పాపుల కటులైతి.

తే. గీ. ఏలయను దేమొ? నాజూకు తెలుఁగనట్టి
మొరటువాని కొసంగిన మొగలిపూవు

చందమెఱుఁగవె? తలిదండ్రు లెంద అసుర
లటుల హింసింతు రెఱుఁగవే యాఠరసులను?

తే. గీ. పాశుపతమును సంధించి భర్గుఁడపుడు
త్రిపురములఁగూల్చి దనుజులఁ దెగడనేసె;
పుడమిలోఁ బుట్టు చక్కెసన్ బాలముకాపు
చెక్క, నేర్పుచ భస్మమ్ము చేయునట్లు.

అపుడుమహోగ్రమూర్తియ ఘనాస్త్రమథాధిపురౌద్రవహ్నికిన్
దపన జనించి, మాహాత్మ్యసుధాంశుఁ; మాయమర్షమున్
గృపయగునట్లు మార్చ్పనికిన్, త్రిపురేశ్వరి పేరుఁదాల్చి, యత్య
పరిమితంపు చక్కఁదనమొంది, ప్రశాంతునిఁజేసితీశ్వరున్.

వ. అట్టిత్రిపురసుందరినైన నేను నీయందనుగ్రహించివిచ్చేసితి.

తనయులమూవురన్ బడసి, ధాన్యధనాది సమస్తభాగ్యముల్
గని, పతి మన్ననన్ నెగడు కాంతవు; నీవును మానసంబునన్
దనయలు లేని యాభవ మధన్యమటుంచును నెంతు; నేను నీ
తనయగ జన్మమందుదును, తల్లిగ సాకుము నన్నుఁ బ్రేముడిన్.

క. తల్లీ! నీ కడుపున నా
చెల్లెండ్రై పుట్టఁగలరు శ్రీ వాగ్రమణుల్;
ఫుల్లోత్పల హృన్ముఖివై
యుల్లాసంబునఁ జెలంగు ముత్తమసాధ్వీ!

ఈ మహనీయమూర్తి, యురగేశ్వర భూషణుఁ, డర్ధచంద్రబింబామల మస్తకాభరణుఁ, డాశ్రితభక్త సురద్రుమమ్ము, నా నోముల పంట, పెన్నిధి, మనోహరుఁ డివ్వనసీమఁ బుట్టు సుమ్మా మహిమాపగాధరుఁ, డుమేశ్వరుఁడేనును నిల్తుమిచ్చటన్.

వ. వేగిరం పడకుము; పునర్దర్శనం బిత్తుమని పలుకుచు,

సీ. శ్యామారుణ జటాశైలేందు కలికతోఁ,
గాలవేణీ ఫణాగ్రమణితోడ,
గాత్రప్రభావళీ కలశవీచికలతో,
దేహేంద్రనీల చంద్రికలతోడఁ;
గటివేష్టిత ద్వీప కాలచర్మమ్ముతోఁ,
బరిధీయ వల్కలాంబరముతోడఁ,
బాదార్ఘ్యమోదయ పాండుర ప్రభలతో
నబ్జోదయేందీవ రాంఘ్రితోడ.
హరిణములజంట యాశ్రమ మందు వోలె,
నంది, హరియు నెసఁగ, ఫణుల్ నగలు గాఁగ,
నంబకములు సుధా కలశంబు లగుచుఁ
గరుణ స్రవియింపఁ, బతియందు గలసి నిలిచి.

తే॥ గీ॥ జానకమ్మను దీవించి చాలసార్లు
చల్లగా, మెల్లగా, చంద్రసంజ్ఞవోలె
ననిలమున నంతర్ధానమయ్యె నర్ధ
సుందరేశ్వరమూర్తి యాసుదతి చూడ.

తే॥ గీ॥ అంత మేల్కాంచి పతికి నయ్యాతివ తెలిపెఁ
బట్టజాలని సంతోష ముట్టిపడగ
వినుఁడు, కలఁగంటి, నాగర్భమున జనింతు
ననుచు గిరిబాల నా స్వప్నమందుఁ బలికె.

వ. అని, స్వప్నవృత్తాంత మంతయుఁ దెలిపిన, జానకీబాయమ్మ
పలుకులామె భర్తకమందానందంబుఁ గలిగింప, నాదంప

తులు దేవీ కటాక్ష నిరీక్షణ మానసులై మానసంబున భక్త్యంజలు లర్పించిరి.

## ఆశ్వాసాంతము

శాలిని. బాలార్కాంశు వ్రాతసుస్నానలోలా!
నీలాభ్రోద్యన్మేఘ మాలాతపత్రా!
బాలజ్యోత్స్నాభాసి తానందరూపా!
కాలా, శా, భ్రూ, కార! విశ్వప్రపూర్ణా!

తెలుఁగు వసుంధరన్ జలధితీరము పజ్జను నీకునీవుగా
నెలకొని, నాల్గునీరధుల నిత్యనివాసులు తెల్గునావికల్
వలగొను లింగమూర్తివయి, పంకరుహాంతర నాభి పోలికన్
జెలఁగిన పన్నగాభరణ! శిష్టగుణాకర! స్వర్ణదీధరా!

ఉత్సాహ, శివ! మహేశ! శూలికేశ! సృష్టిపూర్వశోభితా!
మువురు రాక్షసులనుఁ జంపి,మూఁడుపురుల గెల్చి, భూ
దివులఁ బ్రోచుదేవ! యోసతీహృదీశ్వరా! హరా!
సవన, మదన హరణ! తుహినశైలజా మనోహరా!

గద్యము : ఇది శ్రీవత్ససగోత్రాంతర్గత తేకుమళ్లాన్వయ సంజనిత రాజగోపాలరావు తనూభవ రామచంద్రరావు నామధేయ ప్రణీతంబైన శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత శ్రీ నాగేశ్వర మాహాత్మ్యంబు నందుఁ బ్రథమాశ్వాసము.

మంగళమ్ మహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత

# శ్రీ నా గే శ్వ ర మా హా త్మ్య ము

## ద్వి తీ యా శ్వా స ము

క. (శ్రీ)రమణి మిథిలఁ బోడమిన
తీరుగ, బందరున వసుమతీ గర్భోద్భూ
తోరగ భూషణ లింగా
కారత వెలసిన మహేశ!, గౌరీరమణా!

వ. అట్లు కౌశేంద్రుని యుద్యానవనము దేవతలకుఁ గూడ సమందానందంబుఁ గలిగించు చుండ.

### గ్రీ ష్మ ము

తే. గీ. ఋతువు చెల్లంగ, వేఱొక ఋతువు చెల్లి,
వరుస వెంబడి గ్రీష్మము వచ్చె; నెండ
లెక్కువగ నుండ మొదలిడె; నుక్కపోఁత
పోయుటయు సాగె బందరు పురము నందు.

సీ. అంతకంతకు సహస్రాంశు ప్రచండోగ్ర
రౌద్రాతపమ్ము దుర్భరము గాఁగ,
నా చెవి వడగాడ్పు లీ చెవిలోఁ గొట్టి
యుసురు లుద్ధతి నసురుసురు చేయ,

పశు, పక్షి, జన, తరు ప్రాణి సంఘము మహా
తాప దాహార్తి విద్ధమ్ముగాఁగ
పర్ణశాలలు, నిండ్లు, భవనముల్, గ్రామముల్
హుతభుగర్చులకు నాహుతులుగాఁగ.

కూప, కాసార, శైవలినీ, పయోధు
లింకఁ బాఱఁగ, నూష్మకమిలను మాడ్చి,
తపనుఁడను పేరి యగసాలె ధరణిఁ బట్టి
విశ్వమను మూసలోఁ గాఁగఁ బెట్టినట్లు.

తే. గీ. పగలు వడగాడ్పు, రేల నిర్వాతబాధ
కొన్నినాళ్లు; రాత్రి, పగలు కూడ వేడి
గాడ్పు కొన్నాళ్లు; చెమటలు కార్చు నుడుక
పోఁత కొన్నాళ్లు పీడించె భూమిజనుల.

తే. గీ. చలువ పందిళ్లు దాహోపశమన మంది,
సత్రములఁ, జెట్లనీడ, విశ్రాంతి పొంది,
తేట మజ్జిగ, కొబ్బరినీటి తోడ
బాటసారులు తాపమ్ము బాపుకొనఁగ.

## శ్రీ నాగేశ్వర సంభవము

క. ఆ వేసవి పెనుతాకిడి
కా వన మేమియు వడలక, సపురివన, సభా
లావణ్యశోభ వెలయ, య
శో విభవా రూఢమయ్యెఁ జూలెత వోలెన్.

వ. అట్టియెడ.

ఆ రామంబున నున్న నీటిదొన గ్రీష్మార్కోష్ణ సంతప్తమై నీరంబెండ, దివాను నూతి నొక దానిన్ ద్రవ్వ నూహించి, తా త్కారంబున్ బిసరేని యొార్వని సమర్థ శ్రేష్ఠుండాతండు, కా ర్యారంభంబొనరించె, మున్ గనునికల్ ప్రాక్షోచితంబుల్ కదా!

నూటేడుల్ గలయుప్పరీడు చెలువుల్, నూతుల్ సహస్రమ్ములూ రూరన్ జొప్పడు తావులెన్నిన ఏదుండుద్యానపు బల్లమం దారం భింపంగ ద్రవ్వకమ్మి, వడి నత్యాశ్చర్య సంధాతమై పాఱల్ పల్గులకడ్డమై నిలిచె నంబాభ ర్త లింగాకృతిన్.

సీ. ఫణి ఫణాగ్రస్ఫుర న్మణిరత్నరుచి నభ
స్థలి సాంధ్యరాగంపుఁ జెలువు నింప,
మల్లికా, చందన, మరువక, కేతకీ
గంధమ్ము విరజిమ్మి గాత్రచయము
సిత, కృష్ణ, పింగళ, సింధూర, కపిశాది
బహుపుష్పమాలికా భ్రాంతిఁ గొలుప,
బుస, బుసోచ్ఛ్వాస సమూహ సంహతి గంధ
వహుఁ డభ్రగామియై పరుగువార,

నొకటి వెనువెంట నొక్కటి యార్వివెడలి,
శూలి లింగమ్ము చుట్టు ముచ్చుట్లు చుట్టి,
మోళరిలి, హారతు లొసంగి మూర్ధమణుల,
మంద మందల నాగముల్ మసలె నచట.

తనచూడాలయుఁడౌ హిమాంశునిభరత్నశ్రేష్ఠ
భాస్వత్స్ఫటల్
దినరత్నోగ్ర మరీచి కడ్డమిడి, పృథ్వీనిర్గతవ్యాళమాల్
తన చూడాలయుడైన దేవనది నృత్యవ్యంజకప్రౌఢిమన్
దనకున్ ఛత్రముపట్టి, నొప్పెశివుఁడంతన్ బన్నగేశుండునాన్.

క. వెఱఁగుపడి, వెనుక కడుగిడి,
కరములు జోడించి, భర్గ! గంగాధర! యీ
శ్వర! యని యుప్పరు లిల పయి
శరణమ్మిమ్మంచుఁ బడిరి సాష్టాంగముగన్.

ప్రగుణుఁడు బోడపాటి గురురాజిది కన్గొని, ప్రాయుకాగితా
లెగురనియట్లు కట్టి, యటకేగి, స్వయంభువు, వామదేవుఁ, బ
న్నగధరుఁగాంచి, యీశ్వర! పినాకి! మహేశ్వర! చంద్ర
శేఖరా!
నగతనయామనోహర! వినమ్రతమొక్కెద నుద్ధరింపవే.

క. నీరము చాలక యొండల
కారామము వాడు ననెడి యారాటముతో
నీరీతిగ గంగాధర!
ప్రేరేపణచేసి, కంటిఁబెన్నిధి నిన్నున్.

క. ఒప్పో, తప్పో యెఱుగను;
తప్పగుచో, గన్ క్షమింపు దాక్షిణ్యముచే;
నొప్పగుచో, సఁక నిచ్చలు
నిప్పూరి నాగేశ! పూజ లెలమిని గొనుమీ.

తే. గీ. అని ఫణుల కిట్టు లాతఁడు మనవి చేసె
నాగ దేవతలార! మీ రేగుఁ డింక,
వదలి నా కేశు రక్షణ బాధ్యతలను
నా కరమ్ములఁ; శ్రమయయ్యె మీకు కటకట.

క. ఉరగులు గిరగిరఁ దిరుగుచు
హరునకుఁ బ్రదక్షిణాదులు జరిపెన్;
జరజరఁ బ్రాకుచుఁ బఱుగిడి
ధరఁగల నెఱియలను దూరి తమపురిఁ జేరెన్.

తే. గీ. అంతట నతండు సుస్నాతుఁడై తనర్చి,
శుచిత భక్తియుఁ బెన గొన; షోడశోప
చార పూజావిధాన విస్ఫారితాంత
రంగునిగఁ జేయఁజొచ్చెను లింగమూర్తి.

ఆమధ్యాహ్నము వారి వాహములసంఖ్యాకమ్ములై పుట్టి, నా
నామార్గంబుల సంచరింపఁగ ననంతంబైన యాకాశమా
జీమూతమ్ములచేతఁ గప్పువడె; వర్షించెన్ గడున్ మేఘుఁడా
రామంబందలిపల్లముల్, దొనలుపూర్ణంబయ్యెఁబెన్నిటితోన్.

పర్ణశాల

క. వానకు నెండకు నడ్డము
గానతఁ డొక పర్ణశాలఁ గట్టించి, తదీ
శానుని పూజకుఁ దొడగెను
దా నిత్య స్మృతుల భక్తి తత్పరుఁడగుచున్.

ఆగురురాజు సోదరి మహాగుణశీల, సుభద్ర భర్తయెం
దేగెనో మూఁడునుంబదియు నేడుల నాఁడజలేదు; నాలుకల్
మూఁగలవోవ యాత్రిక సమూహములన్ విసిగింప జాడకై
వ్రేఁగయి కుందు డెందముల వేదన యిబ్బడియయ్యెవారికిన్.

ఆ. వె. బిడ్డలైన లేక పెను చికాకున నామె
కాలమెల్లఁ గాశిఁ గడుప నెంచ,
నెల్లచోటులందు నీశ్వరుఁడొక్కఁడే
కాశిలోనివాఁడె కాఁడు శివుఁడు.

వ. అని గురురాజామెకుం బలికి మఱియు నిట్లనియె.

ఆ. వె. ఎవనిఁగొలువఁ గాశికేగ నెంతువో వాఁడె
వచ్చె నిటకు భక్తవత్సలుండు;
తనకుఁదాన వెలసి తనరారు తోఁటలో
కలుగు ముక్తి వానిఁ గొలుతు మేని,

చొపది: అని తన సోదరుఁడాడిన మాటల్
మనమున నాటిన, మానిని సర్వ
జ్ఞుని, శివు, నిష్కుటజాతుని గొల్వం
గను నిట నిల్చెను; కాశిని మానెన్.

వ. ఇట్లామె నిత్యంబును విశేషకాలమా పర్ణశాలలో సోద
రునితోఁబాటు కడపుచు శివుని సపర్యలందు నిమగ్నయై
ప్రొద్దుపుచ్చుచుండ,

ఆ. వె. చేతనైనయట్లు చేయుచుఁ బూజలు
బోడపాటి వంశభూసురుండు

కొన్నినాళ్లు గడపి కోవెల నిర్మాణ
మగుట యెట్టులనుచు నాత్మఁగుంది.

కొఠీంద్రుని నిర్ణయము

ఇంద్రవజ్రము : ఈ పర్ణశాలాస్థల మీశు శుద్ధాం
తాపార విచ్ఛందక మాట కద్వాన్
బ్రాపిచ్చు శ్రీయుక్తః, భక్తిపూర్ణున్
నా పూర్వ పుణ్యాన గనంగనౌనే?

ఆ. వె. అనుచుఁ దలఁచుచుండ నా వననాథుఁడు
సౌమ్యమూర్తి రామచంద్రరావు
తన దివాను విధులు తగిన వేళలలోనఁ
జేయుచుంటఁ జూచి చిత్రమంది.

ఈ నడుమన్ దివాను మును పెప్పుడు వచ్చెడు వేళకున్, గచేరీని గనంగరాఁడు; విపరీతముతోఁచెను; పూలతోఁటలోఁ గానఁగ వచ్చునంట; చనఁగావలె నేనును దోఁటఁ జూడ; నుద్యానముజూచియొక్క నెలదాఁటినదప్పుడెయంచునాత్మలోన్,

తే. గీ. తలఁచి కాంభోజహయమెక్కి, ధరకు దిగిన
హరిహయుఁడో, పావకుఁడో, కాక హరియొ, నాగ
మెఱసి పూఁదోఁటఁ జేరె రాట్సరణి వెంట
ధాత్రిదేవుఁడు రామచంద్ర ప్రభుండు.

తే. గీ. అపుడె గురురాజు శివపూజ లాచరించి
లేచి, యజమాను రాకను జూచి, భక్తి

తత్పరత దండమిడి, బిల్వదళము, భూతి
శివుని మహిత ప్రసాదముల్ భవునకిచ్చె.

క. దళమును భస్మముఁ దాలిచి
లలిత వచనములఁ గొంత కులవరుండదుగన్
దెలిపెన్ గురు రాజంతయు
నెల నడుమ వెలసి మెఱసెడు నెలతాల్పుకథన్.

వివరముగాఁ గథాగతులు వీనుల విందొనరింపఁ దొల్లియే
భవముల పుణ్యసత్ఫలమొ, పర్వతరాజ వరేణ్యపుత్రికా
ధవుఁడు, వియన్నదీ సలిలధార శిరంబున గొన్నవాఁడు నా
శివుఁడు తనంత తావలచి చేరె మదీయ వనప్రదేశమున్.

నా వలనన్ నిజాలయము, నా వలనన్ నిజలింగసుప్రతి
ష్ఠా విభవాదులున్, శిఖరిజాత, వినాయక, షణ్ముఖ ప్రతి
ష్ఠా విభవంబులందుకొని, శాశ్వత మోక్షమునాకు గూరుపం
గా వలెనం చెదం దలఁచి కాక, స్వయంభవుఁడౌనె యిచ్చటన్.

త్రిపద. కాంచన యుతమయి కడుశివమయమయి
కించ జనింపగ మదికి, ఖేదము, గలిగించె మున్ను;
కాంచన మయమునుఁ, గాత్యాయనీసంయు
తాంచిత శివమయంబగుచు నలరుగాతమిక నీ స్థలము.

క. దేవాలయ నిర్మాణము,
కావలసిన యితర సర్వకార్యంబులు, నే
కావింతును; దైవజ్ఞుల
రావింతును; పనులు నేఁడె ప్రారంభింతున్.

విభూతి. ఈవిధంబుగా మహా
దేవునాల యాదినా
నావిధంపు బాధ్యతల్
నాశిసుమ్ము, లెమ్మనన్.

క. అందలమెక్కిన యట్టుల,
నిందూదయవేళ సరిదధీశుని భాతిన్,
డెందంబున గురురాజా
నందోత్సాహంబులంది, నతులొనరించెన్.

వ. అపిమ్మట దేవాలయనిర్మాణ కార్యవిధానంబుఁ జర్చించుచు కొండింద్రునింట సహభోజనం బాచరించి, యజమానుని యాజ్ఞానువర్తియై దైవజ్ఞులను రావింప, వారితోఁ గొండి రామచంద్రరాయఁడు దేవాలయ నిర్మాణమునకును, విగ్రహప్రతిష్ఠాదులకును సన్ముహూర్తమ్ము లేర్పఱుప వలయును.

చతుష్పద: అని, కొండింద్రుఁ డపు డతి సంతసమునఁ
దన యూహను డెందము విప్పి చెప్పి,
ఘనులార! నాకుఁ గరుణ సహకార
ము నొసంగ మిమ్మునిదె యర్థింతు.

వ. అని తెలుప నమ్మహనీయులు.

తే. గీ. కాలమును స్పష్టముగ లెక్కకట్టి, తేల్చి,
గ్రహ మహాగ్రహ, తారకాతతుల సూక్ష్మ
భ్రమణభేదము వీక్షించి, పరిశీలించి,
యన్ని పనులకు లగ్నంబు లమరఁజేసి.

తే. గీ. హాయినెదఁదలంచి, శాలివాహన శకంపు
పదియునాఱు వందల యెనుబదియు నాలు
గైన చిత్రభానను వత్సరాన, మాఘ
మాసమున మహాశివరాత్రి మంచిదనిరి.

తే. గీ. విఘ్ననాయక, షణ్ముఖ, వీరభద్ర
సారమేయుల సంప్రతిష్ఠలను పగటి
వేళయును, సర్వమంగళా విశ్వనాథ
సంప్రతిష్ఠల నారేయి జరుపునని.

తే. గీ. నడుమగల యైదు నెలలును గడచులోన
నాలయముఁగట్టి, పుణ్యజలాలతోడ
పుష్కరిణినింపి, విగ్రహమ్ములనుఁజెక్కు
పనిని సాగింపుమనిరి దైవజ్ఞు ; లంత.

## సూర్యాస్తమయము

ఆమాన్యోఘము సత్కరించు తఱిఁ బుణ్యాశేష సీమంతినీ
సీమంతాఁకిత కుంకుమారుణిమ భాసించెన్ నభస్సాంధ్య రే
ఖామాలా ప్రతిబింబితంబయి; గుడుల్ ఘంటాధ్వనుల్ చేసె; గ
వ్యామార్గంబులధూళి రేగెను; మహోత్కారావమొప్పెన్ దిశల్

సీ. అక్కకీ శుభవార్త లందించు తహ తహ
రయమునఁ జను గురురాజువోలె,
దినమెల్లఁ గష్టించి తనవిభు నిల్లాలి
కరుణకై యరుగును క్షంబు భాతి,

అస్త్రాద్రిఁ బండిన యపరంజిధాన్యమ్ముఁ
బదిలపఱుప నేగు ప్రభునిమాడ్కి
వారుణాశాహార్య పశ్చిమప్రాంతంపు
ధరఁజూడ నుఱుకు శోధకుని భంగి

నేగె సూర్యుఁడు; పాతాళభోగిశీర్ష
మణిమరీచుల పారాణి మలసె నింగి;
నిచటి నాగేశ్వరునివార్త లిలకు నవలి
వైపు చాటింప నరిగె దివాకరుండు.

తే. గీ. వరిపొలమ్ములఁ గంకుల బెఱికి యెగిరి
కీరములు రాల్చు బియ్యపు గింజ లట్లు,
సురలు శివపూజ చేసిన సుమము లట్లు
లలరె నక్షత్రచయము విహాయసమున.

## గ్రామదేవత అనుజ్ఞ

వ. అట్లు దైవజ్ఞ సత్కారమాచరించి, గురురాజునింటికిం బంపి విశ్రమింపుచు నాకోటి రామచంద్రరాయఁడు శ్రీనాగేశ్వరాలయ నిర్మాణమునుఁగూర్చి యాలోచింపుచు నిట్లు తలంచె.

క. ఒక్కొక గ్రామమునకు మును
నొక్కొక దేవతను నిల్పె నూరిజనం, బా
షక్తి, మహాలక్ష్మినిలిచె
నిక్కడ, రోగాగ్ని తక్క రేత్యరి హరిమై.

బందరు గ్రామదేవత, శుభప్రతిపాదక కార్యవేళలన్
ముందుగఁ గార్యకర్తలిడు మ్రొక్కులకున్ వికచస్మితాననా
నందకటాక్ష పూర్ణనయనంబుల మోదముఁ దెల్పు వేలుపుం
సుందరి, మాచమాంబకడ శూలికిఁ గోవెల కై సెలవందగావలెన్

వ. అని గొడుగుపేటలోని తన ప్రాసాదనివహంబునకుఁ దూరుపుగను, నుద్యానవనంబునకు నుత్తరంబుగను నొప్పు శ్రీమహాలక్ష్మియను మాచమ్మ నెలవునకామయనాఁడరిగి.

తే. గీ. కోక, రవికయుఁ, బసుపుఁ, గుంకుములు, నారి
కేళ, కదళీ, రసాల తాంబూలములును,
జాజి, మొగలి, మల్లె, గులాబి, సంపెఁగలు, ద
వన, మరువములు, హారతులును నొసంగి,

బందరుపట్టణంపు నడి పట్టున శ్రీమహాలక్ష్మి పేరుతో
నందము చిందు విగ్రహమునందుఁ దిరంబుగ సుప్రతిష్ఠవై
వందలు వేలుగాఁ గొలుచుభక్తులకున్ సురవల్లివై మనం
బందలి సర్వవాంఛలు రయంబునఁ దీర్చెదు నీకు మ్రొక్కెదన్.

క. అమృతమయంబగు రూపము;
నమృతకరకిసలయచయము; నమృతహృదయమున్
గమలాభామృతనయనము
లమృతదృగోఘములుఁ, దెలుఁగు నంబకు జే! జే!

మధ్యా: బంగారు సంపెంగపూల పసుపుపచ్చని మేనిచాయ;
భృంగోష్ఠ మధుకోశనిభము వేణీభరాసితచ్ఛాయ;

చెంగల్వ పూరేకు కరణిఁ జెన్నొందు నర చేతిచాయ,
మంగళ దేవి! నీ శుభద, మధుర, మార్దవలక్షణములు.

వ. అని శ్లాఘించి, యిట్లని విన్నవించె.

క్రా. ర. ఆ మంచుకొండలకు నవలివైపునఁ గలదు
కైలాసమను నగము కలధౌతమయము;
ఆ మేటిగిరిమీఁద నంబాభవానితో
శివుఁడు, సర్వజ్ఞుండు చేయుఁ గాపురము;
ధరణి గర్భము వెడలి తనకుఁదా నా శివుఁడు
పుట్టినాఁడమ్మ నా పువుతోఁటలోన;
చెరిగె నిప్పుల నినుఁడు శివలింగమూర్తిపైఁ
గురిసె వరుణుఁడు వేలకుండలుగ వాన.

క్రా. ర. గుడిని నేఁగట్టింపఁ గోరవచ్చితి సెలవు
గ్రామాధికారిణివి, రక్షకవుఁగాన;
వెడదమోమున మెఱయఁ బెదవి పగడపునగవు
విడిన తామరకనుల వీక్షించి, చూన!
కరుణ మెసఁగుము సెలవు; కంబుకంఠి! పుష్ప
సంశోభితోద్దీర్ణ షట్పదీ వేణి!
యరుణవర్ణ శరీర! హంససుందర గమన!
బందరు నగర రాణి! బహుళకల్యాణి!

క్రా. ర. అన, మహాలక్ష్మియా యవనీసురుని తోడ
ననియె భూదేవ! నా కాశ్చర్యమయ్యెఁ!
దనకంఠ విషమునకుఁ దనకంటి యుగ్రాగ్ని
కిను నెండ ముక్కంటి కెటులెక్కు డయ్యె?

సతత భాగీరథీ స్నానార్ద్రకేశునకు
వారుణాంభోవృష్టి భయదమెటులయ్యె!
సతుల భిక్షాటనాహ్లాది కేటికి నెలవు?
ప్రేతభూములు నేఁడు వెగటేటికయ్యె?

క్రౌ. ర. అనిన, నా రామచంద్రాఖ్యుఁడని నెలతాల్పు
చెడుభూతములఁ ద్రుంపఁజెలఁగు కీడులను
మనుజపాలనకూరి మధ్యలో నటరాజు
విడిచి పేరటికమును, భిక్షాటనమును;
గరళశేషత్రాగ్నులకుఁ గలుపనేటికి నెండ?
వినుమడింపఁగ నేల నేటి పెనుధార?
అరుదెంచె నివసింప; నతిథిగద మన కాతఁ
డిలు గట్టి యిత్తమాయీశ్వరున కీయూర.

తే. గీ. అనినఁ జెవికుండలములయ్యె, ననఘ! నాకు
నీదుపలుకులు, వాత్సల్యనిరతనైతి;
సెలవొసంగితి; నని బాహువులనుఁ జాచి
గరిమ నాశీర్వదించె నా గ్రామదేవి.

## నైజాముగారి కానుకలు

వ. ఇట్లు మాచమాంబ సెలవంది, విఘ్నవిచ్ఛేదకుండగు గణపతిపూజతోఁ గార్యక్రమారంభం బొనర్చి, యాలయ శంఖుస్థాపనకు నిర్ణీతంబైన సుముహూర్తంబునకు బందరు పురవాసులను నితర ప్రముఖులను శ్రీ రామచంద్రుఁ డాహ్వానింప,

తే. గీ. శంఖుసంస్థాపనోత్సవ సమయమునను
సకల కుల, మత, జాతుల జనులు, ఫ్రాన్సు,
బ్రిటను హాలండు వర్తకుల్ వేలు వేలు
చోట్లఁ గూర్చుండి చూచి ఉత్సుకత మెఱయ.

ప్రాంశు మహేభ వాహనుఁడు, పార్శ్వచరద్వికళత్ర కీర్తి, శీ
తాంశు కళాద్వయాకృతి కృతాంక పతాకుఁడు; వంశ కాదిగం
ధాంశుకుఁడేగుదెంచెను పురాధిపుడైన నవాబు; భూరివి
స్త్రీంశ మొసంగెఁ గాన్కఁ; బలుదీవెనలిచ్చె నభీష్టసిద్ధికిన్.

తే. గీ. ప్రేక్షకులలోన నైజాము ప్రియము మీఱ
నంపిఁట్టి నృసింహరావను నమాత్య
వరుఁడు తెచ్చెను తన నేత వ్రాసినట్టి
జాబొకటి యాకోఠీ రామచంద్రునకును.

ద్వి. రగడ: ఓ రామచంద్ర! యోయుత్తమోత్తమభావ!
నా రాజ్యవాణిజ్య నవ్యసుధ మీ సేవ;
పాలింప మొదలిడిన ప్రథమ వర్షములోన,
మీ లేఖ కలిగించె మేటి 'ఖుషి' మదిలోన.

'అల్లా' కంజలి సంఘటించి, భవదీయాహ్వాన పత్రంబు నా
కుల్లాసప్రదమౌటఁ, బట్టమహిషీ యుక్తంబుగా నేను మీ
యిల్లాలైన మదీయసోదరికి, మీకీ కాన్కలన్ బంపి నా
నుల్లంబారఁగొనుం,డవిఘ్నమగుమీయుద్దిష్ట కామ్యార్థముల్,
ఆసఫుజాహి వంశమున కన్నిమతంబుల ధర్మరక్షణో
ల్లాసము నైజమై తనరు లక్షణమంచు నిజాముచేతి వ్రా

ర్చేసిన లేఖ, నీలనది చెంగట నొప్పు నరబ్బి గుత్తమున్,
గాసులపేరు, భవ్య మణికాంచనహార మమాత్యుఁడిచ్చినన్.

తే. గీ. మురిపె మారంగఁగొని, తగు తిరుగుకాన్క
లొసఁగె, మంత్రికి, రాణికి, నుర్విపతికి
నాకొఁకీ రామచంద్రరా, వందు శివవి
భూతియును, బిల్వదళమునుఁ బొందుపఱచి.

వ. ఆ విధంబుగా నందఱకునుఁ దిరుగుకాన్కలిచ్చిపనిసాగించి

క. దేవాలయ నిర్మాణ క
ళావిదులును, శిల, హస్తలాఘవ, శ్రద్ధా
జీవనులగు మేస్త్రీలును,
సేవకులును బనులు వేగఁ జేయుచు నుండన్.

వర్షఋతువు

శ్రావణమేఘమాలికలరాతి గజాశ్వ శతఘ్నియోధ సై
న్యావళి వోలె జృంభితములయ్యెఁ, బ్రతీచి దిశాంతరాక్షస
గ్రావసమూహ మంబర దురధ్వమునన్ గకుబంత చిత్ర లీ
లా వివశంబులై తిమిరలాంఛన జాలములయ్యె నోయనన్.

సీ. కవచ, శీర్షక, ఖడ్గ కాంతిపుంజములట్లు
కంపా లతాచ్ఛటల్ చంచలింప,
శకట చక్రాది నిస్వన మర్మరములట్లు
లభ్రమ్ము లేకాంత మాడుకొనఁగ,

భీమ్మశతఘ్నికాభీల శబ్దములట్లు
ఘోరజీమూత నిర్ఘోషమెనయ,
ఆహావనిర్ముక్త లోహాపిండములట్లు
పిడుగులు, నుపలముల్ వృష్టిఁగురియ,

రామరావణ బాణవర్షమును మించి
కుండపోతగ వర్షమ్ము క్రుమ్మరింప,
ప్రావృడధిపతి తన ప్రభావమ్ముఁజూపి
క్షితిని సంగ్రామ సీమగాఁ జేసె నపుడు.

బాలిక, బాలుఁడు

తే. గీ. వాన వెలియంగ నాకాశవంశభవుఁడు
పని కవాంతరమేదైన వచ్చెనేమొ
యని దివానును, దానును జనఁగ, నచట
కుడ్యములమధ్య జలము లెక్కుడుగనుండె.

తే. గీ. పదియు రెండేండ్ల బాలిక, పదియునాలు
వత్సరంబుల బాలుఁడవ్వారి నిలిచి
పల్లెములఁబూని, నీటినావలకుఁద్రోసి
యాడుకొనుచుండి రుపయుక్తమైనయాట.

తే. గీ. సరకుచెడకుండ నుంచిన సరళిఁ జూచు
వేళ, షోడశాబ్దమ్ముల బాలుఁడనియె;
ప్రార్థనలొనర్ప, వానలురావు; శివుఁడు,
తన పనియె కాన, వరమిచ్చు తప్పకుండ.

తే. గీ. అనఁ, గౌరీనా[illegible]ఁడతనిఁ జేరఁ
దీసి, చిఱు [illegible] తెలిపెనపుడు;
మనము భగవంతు ముక్తి నిమ్మనియె కాని
యన్యమేదియుఁ బ్రార్థించుటనుచితమ్ము.

తే. గీ. శ్రావణంబున వానలు సాగ, వర్ష
మడ్డురాకుండ, బని చేయునట్లు మనకు
జ్ఞానమిచ్చెను దేవుఁడు; కాన, తగునె
తాను పెట్టిన నియమమ్ముఁ దప్పుమనుట?

తే. గీ. తనపనియె గాన, వరమిచ్చుననుట యొప్పె?
గరళము ధరించె లోకరక్షణకు నట్టి
నీలకంఠున కిది యపనింద కాదె?
సర్వమంగళకరుఁ డింత స్వార్థపరుఁడె?

తే. గీ. మఱియు, శివునకు మేలిచ్చుకొఱకుఁ గాక
మానవుల మేలుకొఱకె నిర్మాణమగును
నవనిలో నన్ని మతముల యాలయములు
కాన, నీ పని వానిది కాదు; మనది.

కందము ; నీ పల్కుల్ విన, నినుఁ జూడంగన్,
నీ ప్రజ్ఞన్ జిఱునెలతన్ జూడన్,
బాపం బారెను; పసివారిన్ మి
మ్మేపుణ్యుల్ గని; రెట నిల్లన్నన్.

తే. గీ. ప్రశ్నలకు నుత్తరమ్మును బాలుఁడిచ్చు
లోన బాలిక కరుణార్ద్ర లోచనముల

రామచంద్రుఁ దిలకించి, యో మహాత్మ !
తెలియనయ్యెను నీ మహాత్మ్యము మాకు.

తే. గీ. అట్టులయ్యును, నడిగిన నడుగకున్న
సజ్జనుల, దీనులను, నార్తజనులఁగాచి
భూమిపాలింతు రీశ్వరీ భూతికరులు
పగలు వానరాదిఁక గుడిపనులనాళ్ళ.

తే. గీ. అనుచుఁ గొంగేలఁ బళ్ళెముల్ మిసుకులాడ,
గవని నిద్దరు దాఁటిన "నెవరిపిల్ల"
లనుచు గురురాజు ప్రశ్నింప, జనులు బదులు
చెప్పఁజాలక నాశ్చర్య చిత్తులైరి,

వ. అంతటవారు పార్వతీశ్వరులే యీ రూపంబుల వచ్చి
రేమో యని కోటీవంశభవుండు తనలో నూహించి,
నిర్మాణ కార్యకలాపంబులఁ గొంత తడవు నిమగ్నుండై.

తే. గీ. ఆ చిఱుతజంట చూపులయందు మెలఁగ
సదనమున కేగఁ బులకిత హృదయుఁడగుచు,
భార్య, జానకి, హర్ష నిర్భరము మీఱ
ధవునకెదు రేగి పలికె పాద్యమ్మొసంగి.

తే. గీ. పొందితిని మిమ్ము తొంటి నా పూజ కతన;
మీకు సతి నోటబార్వతి మృదునితోడ
భోజనమొనర్చె మనయింటఁ; బోయి, తిరిగి
వత్తు శివరాత్రికని గట్టి బాసచేసె.

వ. అనిన, "నేమేమిా! పార్వతీమృడులు మనయింట భుజించి రా!" యని యతండు సంతసాశ్చర్యంబులం బ్రకటించుచుఁ బ్రశ్నింప, జానకీదేవి యిట్లనియె.

తే. గీ. నియమ సరణిని గావించి నిత్యపూజ
కనుల దేఱచిన నొక బాలికయును, బాలుఁ
డేము గుడిలోనఁ బనిచేయ, నిట్లుతడిసెఁ
జేలములు; వేఱుబట్టలిచ్చెదవె, తల్లి ?

తే. గీ. అనుచు నడిగినఁ గ్రొత్త, వసనములిచ్చి
భోజనంబిడి, విశ్రమింపుం డటంచుఁ
గోర, నాబాలికామణి కులుకులొలుకఁ,
బలుకు పలుకునఁ దేనెలు చిలుకఁ బలికె.

అమ్మనుమించి మాకుఁగడు నాదరణంబిడు నీదుకోర్కి హృద్యమ్ము, సుధానిభంబగు; మహాశివరాత్రికివచ్చి నీదు డెందమ్ము సుఖింపఁ, గూరిమిని దల్లివలెన్ మముసాకఁబెద్దకాలమ్మిటనుందుమఱ్ఱఁడు,కళానిధియున్ గగనంబునన్ బలెన్.

తే. గీ. చిదిమినను గారె బుగ్గల క్షీరధార,
పట్టుమని లేవు పన్నెండు వత్సరమ్ము
లెవ్వరీబాల? యేరీతి నిన్నిమాట
లాడ నేర్చెనో ముచ్చటయయ్యె; నాకు.

వ. తొల్లి పూదోఁటంగన్న కల మనోవీధినప్పుడు గోచరింప.

తే. గీ. బాలికామణి యంబాభవాని యనుచు
బాలుఁడా యీశ్వరుఁడె గావలయు ననుచుఁ
దోఁచి, నా నాథుఁడిదె వచ్చుఁ దోయజాక్షి!
దర్శనం బిత్తురేని యేధన్యనగుదు.

మధ్యా :సుదతి పుట్టింటికిన్ వచ్చు చోప్పు యిచ్చు నీ రాక నాకు;
ముదమూర మీ రిద్దరిప్పుడు మూఁడు నాళ్లైననుఁగ డపి
కదలు నాలోచనల్ విదపఁ గానింప నూహింపవచ్చు;
సదయులై యల్లుడును నీవు సంతోషము ననుంకుడిందు.

తే. గీ. అనిన నా బాలుఁడనియె నయ్యనఘుఁడీపుడె
మాటలాడెను గుడిలోన మమ్ముఁగాంచి,
ఎల్లజగములు పాలింప నేగు మాకు
నిలుకడగ నొక్కచో నిల్చు టలవి యగునె?

తే. గీ. నిలుకడగ క్రొత్తగుడిలోన నిలిచి మేము
భూమిపాలించు పని యథా పూర్వముగను
జరుప శివరాత్రినుండి సుసాధ్యమగును;
కాన, జనయిత్రి! సెలవిమ్ము, కదలిచనఁగ.

విజయ భద్రమురగడ ;

అని యుమా శివులుగా నిరువురును నంతలో నాకృతులు
మాఱి యర్ధాలింగుతు లగుచును
వనతరుల, మేడలను, మబ్బులను, వసుమతీధ్రమ్ములను
దాఁటి సురవర్త్మఖం బరయుచును

దరహాస వదనముల వెన్నెలలు, దయామృతవృష్టిపె
ల్లుబికిన సుధా శీకరాంబువులు
కురియుచును, సుజనులను, దీనులనుగూర్మిమెంప్రోచి, నిజ
శైలము నకుం జనిరుమేశ్వరులు

వ. అన. విని, కోటీ రామచంద్రుండు గుడిలో నొక బాలుం
డును, బాలికయు గానంబడిన తెఱంగూహించి.

క॥ అంబరచుంబత శాగు శ్రీ
రాంభోనిధి లసితమాన సాంభోరుహుండై
యంబయు, శంభుండు వారని
సంబరమునం బొంగె రామచంద్రుండు తనలోన్.

క. ఆ పిల్లవాండు శంభుం
డాపద్మ విలోలనేత్ర యంబిక; మాపై
నీ పగిదిం దమ కటాక్షముం
జూపన్ దయచేసి రాదిసుందరి శూరుండున్.

వ. అని, యాహ్లాదభరితుండయ్యె.

క. అంత, గుడిన్ జరిగిన వృ
త్తాంతంబు నవి స్తరముగం దన్వికిం దెలుపన్,
సంతుష్ట హృదయులయి వా
రెంతయు వినుతించి రీశ్వరీశుల భక్తిన్.

క. అంబ కటాక్షము చొప్పున
నంబుదములు వానగురిసె; నద్దంబే రూ

పంబునఁ బొరయక, నిర్వి
ఘ్నంబుగ నిర్మాణకార్య గమనము సాగెన్.

తే. గీ. అపుడు మొదలుగ బందరు నందు పగలు
వానతక్కువ కురియును; కాని, రాత్రి
సంభవమ్మగు చుండుచు కుంభవృష్టి,
ఎప్పుడో కాని తద్భిన్న మెఱుఁగ రాదు.

వ. ఇట్లు జరుగుచుండం గొన్ని దినంబులకు.

శరదృతువు - చంద్రోదయము

రాజమరాళమండల విరాజిత నిత్యసమీరవీచికా
భ్రాజిత తూలికోపమ శరజ్జలదౌఘ మనోహరాభ్ర; మం
భోజ,లతా, దళ, ప్రసనపూగ, సితోత్పల, హల్లకోరు నీ
రాజిత సస్యమంజుల ధరాతల మాశ్వయుజంబు పొల్చినన్.

సీ. పాలసంద్రములోని పగడాల, కెంపుల
చాయ బింబించు శైశవము గడచి,
కెరటాలకరముల క్షీరాబ్ధి యుయ్యాల
లూపిన పసితనం బుజ్జగించి,
దుగ్ధవార్నిధిపజ్జ దుప్పులతో నాడి
హరిణాంకమందు బాల్యమ్ము దాఁటి,
శివుసతి చెల్లెంద్రు చెట్టపట్టఁగ, నాఁడు
మూలలతో నుడువీథి మొనయురాజు

చల్లనగువాఁడు, తెల్లనిచాయవాఁడు,
కిరణకిరణాన నవసుధఁగురియువాఁడు
గగనమను గద్దె ఋషిసంఖ్య కళలతోడ
నవని నేలఁగ నాసీనుఁడయ్యె; నంత.

ఎనయయి తత్కోటీమిథున హృజ్జలజద్వయితోడ. మల్లికా
ర్జునమయి, శారదారజని శోభిలె; ఫుల్లసుమస్రవామృతాం
బునిధి వలెన్ సుధాంశురుచిపూరము భూస్థలిఁబొల్చె;శర్వరీ
వనితే దరస్మితానన గభస్తిచయంబులఁగూడి; జోడుగన్.

## నామకరణ సమాలోచనము

వ. అట్టి యాహ్లాదకరంబగు నాశ్వయుజ శుక్లపక్షమధ్యంబున
రామచంద్రుండు.

తే. గీ. ఇచటియపర్ణకు హరునకు నుచితమైన
నామకరణముచేయు యత్నమ్మెఁబూని,
విజయదశమికిఁ బెద్దలఁ బిలువనంపి,
దేవరకు దేవికినిఁ బేర్లు తెలుప వేడి.

జలజభవుండు తాళదళసంపుటకోటుల స్వర్ణలేఖినుల్
మలఁచిన వ్రాతలం, దిచటి మంగళదేవికి లింగమూర్తికిన్
జిలిబిలి ముత్తెపుంగసరులఁ జెల్వగు నక్షరపంక్తికూర్పులన్
బలికిన జాతకాఖ్యలు భవాదృశ వండితవాక్కులయ్యెడిన్.

వాక్కుల, వ్రేళ్ళక్రొంగొనల, భావములన్మని తమ్మి గద్దెపై
నెక్కి సమస్తలోకముల నేలెడు విద్దెలఁ గన్నతల్లి మీ

కెక్కుడు గారవంబు ఘటియించుచును, తేటులు తేనెలట్టులా
నిక్కపులోకపున్ రుచిరనిర్ణయ సంకలనం బొనర్పగన్,

అనవుఁడు వృద్ధభూసురమహాశయుఁడొక్కఁడు లేచి, యోకోటీ
వనధి శశాంక! యెట్లు హిమభానునకున్ గుముదవ్రజమ్ముని
ష్పనోహ్లాదయమ్ము లట్లు మిముబోటి మహాత్ములకా
రహస్యముల్
మనములఁదోఁచుఁగాన, గరిమన్ వచియింపుడు మీ
యభీష్టమున్,

తే. గీ. అనిన గిరిమందిరుఁ గొండ్రుడాత్మఁ దలఁచి
రాజులఁట తొల్లి నాగులీ ప్రాంతములకు,
భోగి పరివేష్టితుండయి పొడమెనంట
హరుఁడిచట, గాన, నాగేశ్వరాఖ్యుఁ డౌత

తే. గీ. పాలు బుగ్గలఁ గారెడు బాల లీల
పోతపోసిన లావణ్యపుంజ మనఁగ
వఱలు మా తల్లి, శివురాణి, పరఁగుఁగాత
యలరి బాలాత్రిపుర సుందరాంబయనఁగ.

ఆ. వె. తనకుఁదాన దేవి దయఁబూని తనపేరు
స్వప్నమందు నాదుసతికిఁ దెలిపె;
శిల్పి నేర్పుతోడ చెక్కిన చెలువమ్ము
నేఁడు పేరుతోడ జోడుకూడె.

తే. గీ. అనిన నచ్చటి పెద్దలాహ్లాదమంది
యాంధ్రభూమికి నాగుల కమ్మవారి

విగ్రహము మలంచిన శిల్పి ప్రతిభ
జరిగె న్యాయము పార్వతీశ్వరులు మెచ్చ.

తే. గీ. ఇంక మహాశివరాత్రినాం డిందుధరుండు,
నిందుబింబాస్య తను నాత్మమందిరమునం
గైకొని ప్రతిష్ఠ లోకవిఖ్యాతులగుదు
రిపుడు మీరిచ్చినట్టి పేర్లలమిం దాల్చి.

## ద్వాదశ జ్యోతిర్లింగములు

క. అని పలుక, నందఱు తథా
స్తని రంతటం దొంటి వృద్ధ ధాత్రీసురుం డి
ట్లనియె; కోశీ రత్నాకర
జనిత శరద్వాశద పూర్ణచంద్ర! మహాత్మా!

వ. దారువనవాసినగు నేను గౌరీమహేశ్వర ప్రేరితమాన
సుండనై మీకుంగొన్ని విశేషంబు లెఱింగింప నెంచితి.

తే. గీ. భరతభూమినిం జెలంగు నేబదియునాఱు
దేశములు; వానియందుం బదియును రెండు
సంఖ్యనెసంగు జ్యోతిర్లింగ సముదయంబు
పాపహారమునుం బరమపావనమునగుచు.

తే. గీ. వీనిలోన శ్రీగిరి శిరస్థానమందుం
జెలంగు; నలుకనుం గ్రౌంచాద్రిం జేర స్కందుం
డంబికేశ్వరు లట భ్రమరాంబికయును
మల్లికార్జునుండును నైరి మనుజ సింహ!

తే. గీ. దక్షశాపిత కుముదబాంధవుఁడు తపము
చేయుఁ, బ్రహ్మ తీర్థముగను రక్షించి యెచట
హరుఁడు వెలసెనో సోమనాథాఖ్యుఁడగుచుఁ
దనరు నాచోటు సోమనాథం బనంగ.

తే. గీ. సీప్రపదిచెంత సోమకరమ్య ప్రభావ
కలన, భీమశంకరేశుఁడై వెలసె నుజ్జ
యిని శివుఁడు; మహాకాళేశుఁడనియనందు
రతి భయంకర రూపుఁడౌ నతని జనులు.

మంజరి. విశ్వనాథుఁ డెసంగు విశ్వేశుఁడనఁగ
గంగాధునీ తటిన్, గాశీపురాన;
ధృష్ణేశుఁడును, ఘృశ్ణేశుండనంగ
ఘుశ్మేశుఁడొప్పారు ఘుశ్మేశ్వరమున.

మంజరి సేతువు వద్ద, దక్షిణవార్ధి దరిని
శ్రీరామసంప్రతిష్ఠితుఁడైన శివుఁడు
సీతమ్మ యిసుకతోఁ జేసిన శివుఁడు
రామలింగఁడెసంగు రామేశ్వరమున.

మంజరి: తనరు భీమేశుండు దక్షవాటికను
సప్తగోదావరీ సరసీ తటమున;
త్ర్యంబకేశ్వరుఁడు గౌతమి యుద్భవించి
నట్టి క్షేత్రమునందు గలఁడు భూదేవ!

మంజరి: అభవుఁడోంకారేశుఁడ మరేశ్వరుండు
నై యమరేశ్వరంబనుచోట నెసఁగు;

కేదారనాథుండు కేదారమందుఁ
జీకటి గుడిలోనఁ జెలఁగు త్ర్యంబకదేవ!

మంజరి: శివలింగమును లంకఁ జేర్చ రావణుఁడు
కొనిచను త్రోవలో గోపబాలునకు
పట్టుకో నిచ్చిన, బరువున కలసి
ధరనిడ వైద్యనాథం బయ్యె నెలవు.

మంజరి: భువిపీడి రాని యాభూతేశుఁ డెప్పు
డైహికాముష్మికాద్యఖిలార్తి హర్త,
యాశ్రితవన వసంతాయమానుండు,
వైద్యనాథేశుఁ డైవడలు; కొటీంద్ర!

## శ్రీ నాగేశ్వరుని కథ

వ. ఇఁక నాగేశ్వరాఖ్యఁ జనుజ్యోతిర్లింగము దారువనంబున
నెసంగె నెట్లన.

పార్వతి పెండ్లి పిమ్మట నపారముదంబునఁ రోజు కొన్నగా
శర్వుఁడు దుర్గ తోన్ గడప, సాగె దినంబులు శీఘ్రగాములై;
పూర్వపు దుఃఖభారములు భూతవిభున్ విడనాడెఁ; గాని, యె
ట్లోర్వఁగ నేర్చు సౌఖ్యముల నూరటఁ జూచి లలాటరేఖ కల్?

ఇల్లటమున్న యల్లునకు నేగతి పట్టునొ పట్టెనద్ది ధ
మ్మిల్ల శశాంకమూర్తికిని; మేనక దెప్పఁగ సాగె శాంభవీ
వల్లభు, "రూపహీనుఁడు, నివాసవిహీనుఁడు, ద్రవ్యహీనుఁడం"
చెల్లిదముల్ వచింప, భరియింపఁగఁ జాలక యీశ్వరీశివుల్,

ఆ. వె. చనిరి మందరాద్రి సామీప్యమందలి
దారువనమునకును, దానినుండి
కాశికేగి, పిదప కైలాసగిరి కేగి,
స్థిరనివాసముండి రిపురచట.

క. నినువిడువఁగఁ జాలమనెడు
జనులకు నాగేశ్వరాఖ్యఁ జను లింగంబా
వనమున, విశ్వేశ్వరు పే
రున లింగము కాశియందు రుద్రుఁడు నిలిపెన్.

మంజరి : సుప్రియుండనెడు వైశ్యుండు సద్గుణుఁడు
నౌకపై నేగ దానవు డొక్కరుండు
వర్తకున్ దత్పరివారమున్ బట్టి
యడవిలో కారాగృహమున బంధించె;
వైశ్యకుంజరుఁ డుమాపతిని ధ్యానింపఁ
బార్వతీశులు భూమిపాలింపవచ్చి
పాశుపతంబీయ వైశ్యులాహవము
నందు రాక్షసుఁ జంపి, హరలింగ మచటఁ
దనయంత జనియించి తనరుట కాంచి
పూజించిరాఫణిభూషణు భక్తి;
నాగేశ్వరుండను నామముం దాల్చి
దారువనిలో నిల్చి ధాత్రిపాలించు
మృత్యుంజయుఁడు వాఁడె; మేటిదేవుండు.

ఇక్కడ లింగరూపమున నెప్పటినుండియొయున్న శంకరుం డక్కడ దారుకాననమునందుఁ జెలంగెడు లింగఁడయ్యె; న

ట్లక్కడి లింగమూర్తి తనయంతట నిక్కడిలింగఁడయ్యె; పే
రొక్కటి యారెటొక మహిమోన్నతశక్తి నభేదమిర్వురన్.

క. ఈ నాగేశ్వర దేవుని
ధ్యానమ్మున, దర్శనమున, ద్వాదశలింగ
ధ్యానాలోకన ఫలితము
మానవులకుఁ గలుగఁగలదు మచిలీపురిలోన్.

తే. గీ. గౌతమీ కృష్ణలకు మధ్యగల ప్రదేశ
మందు మహిమోన్నతంబగు నభవులింగ
మేర్పడె నుదధితటమున నిన్నినాళ్ళ
కమరభూజమ్ము పెరటిలో నలరినట్లు.

తే. గీ. మునుపు దాక్షాయణీ దేవికిని శివుండు
తెలిపె నీ స్థలముఁ దానె వెలయు విషయ;
మిఁక మహాశివరాత్రినాఁ డేల యిచట
సంప్రతిష్ఠితుఁడగునో నే స్పష్టపఱతు.

## పార్వతి ఇల్లాలగుట

నభమందుత్తర దిక్తటాంచలమునన్ నక్షత్రరూపంబునన్
ప్రభలంజిల్కెడు సప్తమౌని నికరంబం బుద్ధృతస్థైర్యమై
యభిజిత్తార గృహంబునం దెసఁగు నాఁడారంభమైసృష్టి, సం
క్షుభితార్తంబగు జీవరాసుల తపస్సుల్ పంట పండించుచున్.

తే. గీ. ఆదిలో నూటతొంబదియైదుకోట్ల
యేఁబదియు నాలుగులక్షల యెనుబదియును

నాల్గువేల యెనిమిది వందల యఱువది
మూఁడు హాయనములనాఁడు మొనసె నార్య!

క. అంతకు ముందటఁ బ్రళయము
నతంబయి పద్మజాండ మంతయు నిండెన్;
ధ్వాంతము విశ్వముఁ గప్పి, ని
రంతరమగు కాళరాత్రి కాస్పదమయ్యెన్.

క. మొదలేడనొ, తుదయేడనొ
యెదకందని విశ్వమందు నీశ్వరుఁడొప్పెన్
మొదలేడనొ, శిరమేడనొ
యెదకందని లింగమట్లు లేర్పడి యచటన్.

క. పెనుమొనపు ముద్దను కాం
చన రేణువులట్లు కాలసాగరమందున్
మునిఁగి పరమాణురూపము
నను జీవులు వడలిరధికనై రాశ్యమునన్.

వేలై, లక్షలు, కోట్లు, లక్ష్యపదములై విశ్వాంతరాళంబులో
నీలధ్వాన్త సుదీర్ఘగాఢనిశ భగ్నీభూత చేతస్కులా
టాలోకించి పరాగకోమల హృదబ్జాలోచనాధీనయై
ప్రాలేయాచల బాల చేసె తపమున్ బ్రాణేశు నర్థింపగన్.

సీ చెలువ నడచువేళ చీలమండలఁ దాఁకు
కేశముల్ తలమీఁద గిఱులుచుట్టి,
జీవులగతిఁజూచి చెమ్మగిల్లు కనుల
యార్ద్రిత ఱెప్పలయందు దాఁచిఁ

ఎలబెండ వ్రేళ్ల పంక్తుల నీలభంగిమ
ములమీఁద పటుతపోముద్రఁ బూని,
గిరివనమ్ముల దూఁకు హరిణ శాబక జంఘ
గమనముల్ పద్మాసనమున నడఁచి,

కపిల గోమాతవలె విశ్వగర్భమందు
కాళరాత్రిని, కటిక చీకటులలోన
దాంతి, శౌచము, మౌనవ్రతంబు, నీర్య
లెసఁగ యతియై తపమొనర్చె నీశురాణి.

క. హరిబొడ్డుతమ్మి బొడ్డయి
చిరతపమొనరించు సాంబశివునై నపుడా
తరుణి తపఃభానూదయ
కిరణావళి సోకెఁ జెవులఁ గిన్నర పలికెఁ.

ఆ రామామణి మానసాబ్జమున నాత్మాధీశు సమ్మోహనా
కారంబున్ నిలుపన్, గపర్దికి మనఃకాసార హంసిక్రియన్
సారంగేక్షణ తోఁచె, నిష్ఠురతపశ్శైవాల బంధంబులం,
దారంబండిన, జీవరాసుల సుసౌఖ్యాంభోజనాళార్థియై,

జీవులనేల యిట్లు వెలిచేయుట కల్గెను ? కాలగర్భమం
దీవిధి నెన్నినాళ్లు తపియింపవలెన్ ? దగవౌను తక్షణం
బీవు విముక్తినీయ; నడిఁయుంపగు; నీ నిబిడాంధకారమం
దీవును, నేను జీవు లిటు లెవ్వరికెవ్వరుఁగారె ? వల్లభా !

అను తన లేమమాటలు శుకాంగన పల్కులువోలె ముచ్చటై,
వనమున సంచరించు పిక భామినిగీతికలట్లుహృద్యమై,

దినముఖ సత్వరాగమన దీక్షకుఁ జిత్తము మేలుకొల్పు సా
త్త్వనకృకవాకు కూజితము భంగి గిరీశు నెడందఁ దట్టినన్.

సీ. ఎలనాగ తనువల్లి కొలదిగా చలియింప
నింద్ర నీలద్యుతు లెసఁగెఁ గనుల,
వదనామృతాంశు బింబప్రశాంత జ్యోత్స్న
మల్లెపూవులమాల లల్లె మెడను,
ప్రత్యూష పవమానపాళియై యుచ్ఛ్వాస
నిశ్వాసముల యొప్పు నిండె నెడఁద;
కమనీయ మంజులోంకార సంగీతంబు
శ్రావ్యమై విహరించె శ్రవణవీధి;

నతివ హృదయమ్ము నిండి దయాద్రుమమ్ము
జల్లుకురిసిన నవపారిజాతకుసుమ
సముదయము వ్రాలె హరుని పాదముల వ్రోల;
చెలువ దైన్యము రాపాడె శివుని మనము.

క. ఇరువురి మనములు కలిసెను;
నిరువురి చూపులుమఁ గలిసె; నిందుధరుండా
కరుణామయి దరికిం జని,
మురిపెమ్మునఁ జేరఁదీసి ముగుదకు ననియెన్.

క. శిరమాది గోరు పఱ కతి
తరముగఁ జిక్కితివి, చక్కఁదనమునఁ దక్కన్;
హరుఁడీయ నీకు వరములు
తరళేక్షణ! యిట్టులేల తప మొనరింపన్?

ఈతఁడుస్థాణు వట్లెదుట నేర్పడె; నేటిమగండు? మాటకున్
జేతకురాఁడు; హృద్గతము చెప్పఁదమన్న నయోమయంబునన్
మేతలుమేసి, శూన్యమున మ్రింగు జలంబులు, కానికానరాఁ
డీ తపమొండె మార్గమని యెంచితి నా నతిలోకసుందరీ!

తే. గీ. లేక, నీ మంచితనములో నాకు సగము
కరుణ, నీయంగ నెంచితో? కాకయున్న,
నీవు తలకొన్న కార్యంబు నిర్వహింప
విశ్వశక్తులు నీదు గుప్పిటను లేవె?

అనినన్ బార్వతిపల్కె పెత్తనముచేయన్ భర్తకర్పించితిన్
దనువున్, బ్రాణము, విశ్వశక్తులును; నాతండేలుకొనుచున్నచోఁ
జనదే నేతపియింప? నప్పుడటె నా చక్కందనంబున్, గనుల్
తనకుంజిక్కుట? కుంభవృష్టి వరముల్ తానై సమర్పించుటల్!

క. ఇల్లాలనైతి నిట్టుల;
నిల్లున్ బిల్లలునుకూడ నేర్పడిరీశా!
యిల్లీ విశ్వము; జీవులు
పిల్లలు మన; కట్టులగుట ప్రియమే మదికిన్!

తే. గీ. అయిన, నైరాశ్య పంకంబు నందు, సగము
కూరుకొని లెట్టుమిట్టాడు గోవులట్లు
బెదరుచూపుల సాహాయ్య మెదురుచూచు
జీవులను మోక్షపదవికిఁ జేర్చు సుధిప.

తే. గీ. కాటుకలు మేన రుద్దిన గజములట్లు
క్రూరరాక్షస మానసకుహరమట్లు

లేటికీనిశ? పాపాలమూటవోలె,
బాపుమీ కాళరాత్రిని ప్రాణనాథ!

తే. గీ. అనిన, ధూర్జటి విశ్వశోభనకరమ్ము
లైన కైరవముకుళవితాన మనఁగ
నలరు నీ కోర్కు లుత్ఫుల్లమై తనర్చు
సఫలమై యొప్పు, లోలవిశాలనేత్ర!

అనుచు వరద్వయమ్ము శివుఁడామె కొసంగి, త్రిలోకసుందరీ!
నను శివరాత్రి రేయిని మనంబున నీవలె నిల్పి కొల్తు, రా
జనులకు సర్వసౌఖ్యములు, సంపదలున్ సమకూరు; యామినీ,
దిన, ఋతుచక్రముల్ దిరుగు దివ్య, మనుష్య, భుజంగ
భూములన్.

## శివరాత్రులు

అని హరుఁడానతిచ్చె వసుధామరవంశ సుధాబ్ధిచంద్ర! దే
విని నిశ, దేవరన్ బగటివేళ భజించుట యుక్తమయ్యె, రా
త్రిని గిరిజేశుపూజ లొనరించుట వాడుకయయ్యె, నిట్టి రే
లను శివరాత్రులంద్రు; శివలీలలసచింతనకున్ ప్రశస్తముల్.

తే. గీ. శిశిరమధ్యంపు నడిరేయి చెలఁగువేళ,
మాఘబహుళ చతుర్దశి మలయు రేయి
ధాత్రిఁ బరగు మహాశివరాత్రియనఁగ,
హరుఁడు జృంభించి సంభవుండగుటఁ జేసి.

సలిలంబైననుఁ గ్రోలకెవ్వ రుపవాసంబుందు రానాఁడు వా
రల కైశ్వర్యములన్నియుం గలుగు; సంప్రాప్తించు
భోగంబు;ము
క్తి లభించుం; బిదపం జతుర్దశిని భక్తిన్ బారణల్ చేయువా
రలకుం గల్గు సమస్త భూవలయ తీర్థస్నాన పుణ్యోన్నతుల్.

తే. గీ. అధిక ఫల పుణ్యదమ్మయి ఖ్యాతిఁదనరు
నా మహాశివరాత్రి పూజామహత్వ
మెన్ని యేనియు గ్రంథాలకెక్కె-నన్న,
వేఱుగాఁ జెప్పనేటికి? విబుధవర్య!

తే. గీ. మాసశివరాత్రి యండ్రన్ని మాసములను
బహుళపక్షచతుర్దశిఁ; బ్రతిచతుర్ద
శియుఁనగుఁ బక్షశివరాత్రి, శివుని నెల్ల
నిశలఁ బూజింప శివరాత్రి నిత్యమగును;

ఆ. వె. యోగియైనవాఁడు యోగమాహాత్మ్యమ్ము
చేత యోగనిద్రఁ జెందురాత్రి
చెలఁగు జగతి యోగశివరాత్రి యనుపేర;
నైదు రకము లిట్లు హరుని రేలు.

వ. అని యావృద్ధ భూసురుండిట్లనియె; నట్లు పార్వతీదేవికి
వరద్వయంబిచ్చి భాషించు పరమేశ్వరు నా తొయ్యలి
వినెడు వేళ.

తన విజ్ఞాన తపః ఫలద్వితయ సద్యఃప్రాప్తిఁ గాంక్షించు శీ
తనగేంద్రాత్మజ కంటి యెట్టెదుట స్ఫీతస్థాణు లింగప్రకం

పన కల్లోల సద్భృగ్వీలోలతలు దోఁపన్, భ ర్త్ర కర్మక్షమా
జనితానేకవిభ్రమభావ కలనా సంభ్రాంతి కై మోడ్చుచోన్.

దండితుఁడైన కారెనుమునైత్యుని గర్జన దోమపాట యే
చండ మృగేంద్రవాహనక, శాంభవి, కామహానీయ శక్తికిన్
గుండెలొకింత ఝల్లన, ప్రఘోషముపీనులగ్రుద్ది, కోటి మా
ర్తాండ సమప్రభల్ నిశివిదారకమై మిఱుమిట్లు గొల్పినన్.

క. తల పైకె త్తి కనుంగొనె
జలజాతవిలోల నయన, శంకరలింగో
త్పల కుట్మల గుచ్ఛోపను
చలితోపరితల విభిన్న శకల శ్రేణుల్.

వ ఆలింగో పరితలంబు నుండి

సీ. ద్వాదశాదిత్యు లుద్భవమంది పఱచిరి
విశ్వాంత వలయంబు వెదకుకొఱకు;
పదొకండుగురు రుద్రు లుదయించి పరుగె త్తి
రంత రిక్షాంతంబు నరయుకొఱకు;
పదునాల్గు లోకముల్ ప్రభవించి, గమియించె
తమస్థానముల యందుఁ దనరు కొఱకు;
శ్రవణ నక్షత్రంబు, స ప్తర్షి మండలం
బాకాశవీధుల నలరసాగె;

గంగధారవోలె, లింగనిశిరముపై
నున్న శకలచయము లుడు సహస్ర

మఱుచు కాంతిఁ జిమ్మ, నాదిదంపతులింటి
దీపకళికలట్లు తేజరిల్లె.

ఆ. వె. విష్ణునాభికమల బిస తపశ్శీలుఁడౌ
ధాత నపుడు సృష్టితత్పరాత్ముఁ
జేయ, నాత్మభవుఁడు సృష్టిని మొదలిడ
సకలజీవరాసి సంతసించె.

ఆ లింగంబుపయిన్ జెలంగెడు విపిక్త్వాకాశ సమ్మోద కే
ళీలోలాత్మక నాట్యతత్పరుఁడు పాల్చెన్ దారకాతోరణా
లోలోద్దీపిత భద్రపీఠమున సుశ్లోకుండు; శంభుండు గౌ
రీలోలాంబక పాణినందుకొని చేర్చెన్ భద్రపీఠంబుపై.

సీ. కలధౌతకణమిశ్ర ఘనసారకణిక, కృ
ష్ణాగురు ఫలకమ్ము నతికె ననఁగ,
క్షీరాబ్ధిమీలతో జీమూతమాలికా
చలిత శంపాలత గలిసె ననఁగ,
హిమదిగ్ధవేదికా సమతలంబొరసె, జాం
బూసరిత్తట కృష్ణపులిన మనఁగ,
వల్లీసహిత దేవపారిజాతము పొంత
కల్పావరోహమ్ము గ్రాలె ననఁగ,

ఫాలతల, నేత్ర, వక్షముల్, బాహులెసఁగ
మైథిలీ రాఘవులఁగొల్చు మారుతాత్మ
జాతమూర్తినిఁ బోలి విశ్వమ్ము వినతి
చేయ, గౌరీశు లొసఁగి రాశీశ్శతమ్ము.

దాఁగను దీర్ఘమైన తృణదాతిమిరంబు లెడంబుగాన లే
శా గిరిశాద్రిజాత కుటిలాలక వీధుల నాశ్రయించెనో
నాగ, వినీలకుంతల గణమ్ములు పొల్చె జటాటవీ నగం
బై, గిరిపాంత శంభుసతి శ్యామల పన్నగ వేణిబంధమై.

వ. ఇట్లు పరమ పవిత్రంబును మహాఫలసిద్ధి కరంబును నగు
టం జేసి నిజసంప్రతిష్ఠకు శ్రీ నాగేశ్వర దేవుండు మహాశివ
రాత్రిని నిర్ణయించుకొనియెం గావునఁ,

క. ఇప్పుడు నే నెఱిగించిన
చొప్పున శివరాత్రి సోమసుందరుఁ డుమతోఁ
దప్పక నీ గ్రామంగుడిలో
నొప్పును, కైకొని ప్రతిష్ఠ యుల్లాసమునన్.

క. ఈ రీతి హరుని రాత్రిని
ప్రారంభించెదు ప్రతిష్ఠ వైశాఖమునన్
గౌరీ కల్యాణముతోఁ
బూరింపగవలయు శుభము పుడమికిఁ గలుగన్.

వ అని వృద్ధభూసురుం డెఱింగించి నంత.

అశ్వాసాంతము

తరువోజ; ఆదిశక్త్యంశజయా త్రిపురాంబ
యతిశాంత యాచుఁబ్రత్యక్ష మహాకథయు;
ద్వాదశ లింగాల దారు వనంబు
నందు నాగేశ్వరుం డలరిన కథ; యు

మా దేవి కోరిక మన్నించి నీవు
సృష్టి నారంభింపఁ జేసిన కథయు ;
నో దేవ! లోకాల నుత్తమంబయ్యె;
వానిమూలం బీవె పార్వతీనాథ!

మచిలీ బందరు పట్టణంపు నడిసీమన్ దాఁగి భూగర్భము నుచితంబౌ సుముహూర్తవేళకును బ్రత్యుద్ధాన మ్మున్ బొందినీ విచటన్ నిల్చుటకై కోటీ ప్రవరుచే నిల్లొండు విచ్ఛిందక ప్రచురాకారమునన్ రచించుకొను దివ్యశ్రేష్ఠ! నాగేశ్వరా!

క. ఆలయ నిర్మాణములో
బాలాత్రిపురాంబఁ గూడి, పై యడ్డంకుల్
దోలి, కోటీంద్రుని నీ లీ
లా లాలితుఁ జేయు మంగళప్రద! దేవా!

గద్యము. ఇది శ్రీ శ్రీవత్సగోత్రాంతర్గత తేకుమళ్ల వంశోద్భవ రాజగోపాలరావు తనూభవ రామచంద్రరావు నామధేయ ప్రణీతంబైన శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత శ్రీ నాగేశ్వరమాహాత్మ్యంబు నందు ద్వితీయాశ్వాసము.

మంగళమ్ మహాత్. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత

# శ్రీ నా గే శ్వ ర మా హా త్మ్య ము

## తృ తీ యా శ్వా స ము

క. (శ్రీ), శివ, విరించి శక్తుల
శైశవదశనుండి వఱలు శాశ్వతమూర్తీ!
ఈశాన! గరళకంఠ! స
తీశా! నాగేశ్వరాఖ్య! హిమగిరిజేశా!

తే. గీ. అవధరింపుము, వృద్ధ ధరామరునకు
ననియె నా రామచంద్రరా వన్మవారి
కథ, శివుకథ, తత్పరిణయ కథయు, మాకు
దెలుపుదే? మహాశయ! యనఁబలికె నతఁడు.

### శ క్తి త్రి య ము

సీ. అల మహాలక్ష్మి, మహాకాళియు, మహాస
రస్వతి, సావిత్రి, రాధ, దుర్గ,
గౌరి, చండికయు, విఖ్యాతాష్టనామమ్ము
లాదిశక్తి 'త్రికళ' కాను విలను
భువనేశ్వరి యనియు, మూలశక్తి యని, మ
హామాయ యని జను లందురార్య!
అట్లు దేవీపురాణాదు లుద్ఘాటించు;
సతియని, రమయని, శ్రుతులు పలుకు;

నాదిశక్తి మహోద్ధృతమగుచుఁ రేఁగి
విశ్వమెల్లెడ విచ్చలవిడిఁ జరించి,
విసిగి, వేసారి, యటులుంట వెట్టియనుచు,
పీడకలఁగని మేల్కాంచన్నవిధము తోఁప,

తే. గీ. తన్ను శాసించి, నడిపించు తావిటలేక
శక్తి యేదియు సాధింపజాల దనుచు
నాత్మనెఱిఁగి, త్రిభాగమ్ములై తపమ్ము
చేసె సర్వేశ్వరుని నిల్పి చిత్తమందు.

తే. గీ. మూఁడుశక్తులు నీ రీతి మూఁడుచోట్లఁ
దపము చేయంగ శివ, విష్ణు, ధాత లపుడు
విశ్వమంతయు లింగమై వెలయ, సృష్టి,
రక్షణ, లయ, చక్రముల చర్చలకుఁ జేరి.

తే. గీ. విష్ణువాలింగమున కాది వెదకనరిగెఁ ;
దరలెఁ బరమేష్ఠి దానియంతంబు వెదక ;
నాది, తుదియును, దెలియంగ నలవికాక
తిరిగి వచ్చిన బ్రహ్మకు, హరికి శివుఁడు.

క. ఈవిశ్వపు టెల్లలు, నిది
యేవిధి పుట్టినది దెలియ దెంత తఱచినన్,
గావున, మనలో నెవరెవ
రేవిధి సాగింపనగునొ యేర్పఱత మనెన్.

తే. గీ. బ్రహ్మనపుడు వరించెను బ్రహ్మశక్తి ;
శంభువరియించె నీశ్వర శక్తి, యచ్యు

తుని వరించె 'నారాయణి' యనెడు విష్ణు
శక్తి; సృష్టి లయ స్థితుల్ సాగెనంత.

వ. అంతటఁ దమ తమ శక్తి సామర్థ్యముల యభివృద్ధికై.

తే. గీ క్షీరసాగర శయనుఁడై చేసె తపము
విష్టరశ్రవుఁడైన గోవిందుఁ డపుడు;
విష్ణుశక్తి 'నారాయణి' పేరు దాల్చి
తపము చేసె మలయ మహీధ్రమున నిలిచి.

క. అమ్మురహరు బొడ్డునఁగల
తమ్మి తగుప్రదేశమని పితామహుఁడు మృణా
ళమ్మున, శ్వేతక్షోణీ
ధ్రమ్మునఁ దచ్ఛక్తి చేయఁ దలకొనె దపమున్ ,

వ. మఱియు నేత దంభోరుహావరాటకమై శివుఁడును తత్పరి
సరంబునం దచ్ఛక్తియుఁ దపమాచరించిరి. ఆ పిమ్మట

తే గీ. ఈశ్వరీశక్తి రురుదైత్యు నెలమిఁ జంపి,
రెండుగాఁజీల్చె తచ్చర్మ ముండములను;
దాన, 'చాముండి' యయ్యె; యుద్ధమునఁ బిదప
దుర్గము వధించి, యాదేవి 'దుర్గ' యయ్యె.

తే. గీ. చండ, ముండుల వధియింప, శ్యామముఖయు,
ఖడ్గహస్తయు నగుటచేఁ గాళియయ్యె;
త్రిపురహర్తకుఁ దోడయి త్రిపురసుంద
రాంబయయ్యెను ద్వాదశప్రాయ యగుచు.

## మహిషాసురుడు

వ. పిమ్మట కశ్యప సముద్రప్రాంతమునఁ దపంబొనర్చుచున్న కశ్యపమహాముని భార్యయగు దితి సింధునదీ తీరంబున.

తే. గీ. సురపతిని గెల్చు నొక గొప్ప సుతునిఁ గోరి
తపము చేయంగ వేడికిఁ దాళలేక
ముని సుపార్శ్వుఁడు మహిషివౌదని శపింప,
బ్రహ్మ కరుణించి, మార్చి శాపము నొకింత.

క. తనయుఁడు పుట్టిః పిమ్మట
దనుజవుగా మాఱఁగలవు తరుణీ! మఱి. యా
యెనుబోతు మొగపు నీసుతుఁ
డనుపమ దోశ్శక్తి గెలుచు హరిహయు ననియెన్.

వ. అంతట.

తే. గీ. సింధునది ప్రాంత ద్వీపముల్ సింధురాజు
దానమీయంగఁ గశ్యపమహాని. కచటి
కాతఁడేగి, సింధుద్వీపుఁ డనెడు పేర
రాజ్యమేలుచు వనవిహారమున కేగి.

క. రంభుండను రాక్షసుఁడట
రంభావన నాశనమ్ముఁ బ్రారంభింపన్,
సభూంతోగ్రత నతఁడా
రంభుం దెగటార్చి, తోఁట రక్షించునెడన్.

తే. గీ. మహిష రూపంపు టామునిఁ మగువయపుడు
పరిసరప్రాంత కదళికావనము చెంతఁ

దిరుగుచుండఁగ విరహిణి కరణి, నామె
కథనడిగి, విని, మహిషుఁడై కలిసి మెలఁగ.

తే. గీ. పుట్టె మహిషాసురుఁడు, వాసవుని జయించె;
సమరపురిదోఁచె; నంతతో నాగలేక,
సమరమహిళలఁ జెఱపట్ట నరుగ, భర్మ
గర్భ, శివ, విష్ణుశక్తు లొక్కటిగఁ జేరె.

వ. అట్లేక మూర్తిత్వము నొందిన తత్క్షణంబ.

క. ఆ దున్నపోతు రక్కసు
నా దుష్టాత్ముని వధించె, నాశ్వయుజారం
భాదిగ నవదినమాత్రం
బా దేవి రణంబొనర్చి. యలరఁగ జగముల్.

## నందీశ్వరుడు

వ. అట్లు మహిషాసురు మర్దించిన యనంతరమున,

క. నారాయణి తపమునకై
క్షీరాబ్ధినిఁ గమలమందుఁ జేరి వసించెన్;
జేరెన్ యమునాతటినీ
వారిని నొక శంఖమందు, భవశక్తి వెసన్.

తే. గీ. ప్రళయముప్పుడు సర్వంసహా వలయమునను;
దాండవము చేయ మరల నా త్ర్యంబకుండు
తపము మొదలిడె హిమపర్వతమునఁ; బిదపఁ
దిరిగి మొదలిడె సృష్టివిధాత భువిని

తే. గీ. హరుతపస్థల నికటోర్వి నావుదూడ
పాలుత్రాఁగిన నురగ కపర్ది పైనఁ
బడినఫాలాక్షు, మించుక సడలఁజేయ,
గపిలవర్ణములయ్యె గోగణము లచట.

తే. గీ. బ్రహ్మకోర్కిని మన్నించి పరమశివుఁడు
శ్రేష్ఠతనొసంగెఁ గపిల గోక్షీరమునకు;
బహుమతిగ నంది నొసఁగెను బ్రహ్మ తనిసి;
శివుఁడు దానమ్ము ముదితుఁడై స్వీకరించె.

వ. ఇట్లు నందీశ్వరుని ద్రుహిణుండు నీలలోహితునకు దానం బిచ్చు టెట్లు తటస్థించెనన.

తే. గీ. నందియై ధర్ముఁడుదయించె నాకమందుఁ
గామధేనువు నిండారు గర్భముననుఁ,
శైశవమ్మునఁ గల్ప భూజములనీడ
నాడుకొనెఁ జెంగు చెంగున దాడుతీసి.

తే. గీ. పిమ్మటను నంది కొన్నాళ్లు పృథ్విమీదఁ
దపమొనర్చెను శంభునిఁ దలఁచి మదిని
శివుని శాశ్వతసాన్నిధ్య సిద్ధికొఱకు;
హరుఁడొసంగెను వరము ప్రత్యక్షమగుచు.

తే. గీ. ఆతపఃకాలమునఁ నంది కన్నిదెసల
మట్టిపెరిగెను, గుట్టలై పుట్టపోసె,
నంతట శిలాదుఁ డట దున్న, నాదివృషభుఁ
డుద్భవించి యయోనిజుం డుర్వి వెడలె.

తే. గీ. అట, సుయశనుఁ బెండ్లాడి గృహస్థుఁడయ్యె;
నంత ననుభవసముదాయ మర్థ భంగిఁ
బొంది, దర్శించి యతఁడ రవిదసూను,
నడిగె శంభువిసేవ కర్హుఁడనె? యనుచు.

తే. గీ. నలువ యొసఁగెను శివునకు నందికేశుఁ
బిదపఁ గైలాసమున కేగి వృషభ రాజు
భవుని వాహనమై, ద్వారపాలుఁడై మ
హేశు శాశ్వతసాన్నిధ్య మెలమి నందె.

తే. గీ. రావణుఁడు వచ్చె నొకరేయి రజతశైల
ధాముఁ జూచెడు కోరిక; ద్వారమందు
నంది యడ్డిన, నతని వానరముఖుండ
వని పరిహాసించి, పౌలస్త్య డదరిపడియె.

తే. గీ. వానరమ్ములె చేయు నీ వంశనాశ
న మని రావణు శపియించె నందికేశుఁ;
డాడఁజెల్లునె యొకసక్కె మధికు తోడ?
నార్తిఁగూర్పక మానునే యదరుపాటు?

తే. గీ. ఆ వృషభనాథుఁ డెఱుఁగని యార్యధర్మ
మొక్కటియు లేదు; శీలసంయుక్తుఁడతఁడు;
తన్ను మనసార నమ్మెడు ధన్యులకును
నండయై, కోటయై యెప్పుడుండు నంది.

క. ఆ నంది శివు నమాత్యుం
డానందియె ధర్మదేవుఁ డాతఁడె శివు నా

జ్ఞా నివహమ్ముల పాలకుఁ
డానంది యనుగ్రహమ్ము లమృతనిభముల్.

తే. గీ. తొల్లి సింహికా విప్రజిత్తులకుం బుట్టి
యంధకుఁడు, స్రష్టవరమంది, యంబ తపము
భగ్న మొనరింపఁ జూడగ, భైరవుఁడును
నందియును పోరి యోడ, గోవిందుఁడపుడు.

తే. గీ. శక్తినంపఁగ, నది రాత్రిచరుని దఱిమె;
త్ర్యంబకుం డేగుదెంచి యంధకునిఁ గూల్చె;
దానఁ నంధకారియన గృశానురేత
సుఁడగు పశుపతి, కపర్ది, మృడుఁడు, పరఁగు.

తే. గీ. హరునకు హితుండు నాశ్రితుఁడైన ధనదు
మోసగించిన శుక్రునిఁ గాసిపెట్టె;
గజదనుజుఁ జంపి చర్మముఁ గట్టుకొనుటఁ
గృత్తి వాసాఖ్యుఁడయ్యె నా చిత్తజారి.

## సతీదేవి

తే. గీ. యమునలో శంఖమును దక్షుఁడాత్మ గృహము
నకునుఁ గొనివచ్చి తీర్థపానమ్ము చేయ,
దక్ష దంపతులకు శక్తి తనయ యగుచు
జననమునుఁ గాంచి, పరఁగెను 'సతి' యనంగ.

తన తనుజాతకున్ రజతధాత్రి ధరేంద్ర నికేతన ప్రభుం
డనువగునంచుఁ, దత్పరిణయం బొనరించెను దక్షు,డంతటన్

దినమణి దీప్తియుంబలె, నదీపతి తద్గత సర్వతోముఖం
బునుఁబలె,పూవుతావియునుఁబోలె చెలంగసతీమహేశ్వరుల్.

క. దేవాసురులు పయః పా
రావారము చిలుకు నపుడు ప్రభవించిన శ్రీ
దేవిని విష్ణువు చేకొనె;
నా వెనుక నె పుట్టె నుగ్ర హాలాహలమున్.

తే. గీ. ఈ విషము త్రిలోకముల దహించు ననుచు
శివుఁడు, దాక్షాయణీభర్త, శ్రీకరుండు,
పరుగిడుచునేగి మ్రింగె నా గరళ మపుడు.
సరకుచేయనె తన బాధజనహితైషి.

క. నా మాంగల్యము సుస్థిర
మై మనుగావుత మటంచు నంబిక గరళం
బేమాత్రముఁ గ్రిందకు దిగ నీ
కా మృడు కంఠమునఁ గరము నడ్డము పెట్టెన్.

తే. గీ. ఇట్టులేటికి ప్రియతమా! పట్టుకొంటి;
వేమి చేయు హాలాహల మీ మహేశు!
ననగ, సతి పల్కె; నే బేలనైన నగుదుఁ
గంఠమున నిల్పఁ బ్రార్థింతు గరళ మనుచు.

తే. గీ. హరుఁడు నిందుల కొడఁబడి, గరళకంఠుఁ
డనఁగ, నీల, విష కంఠుఁ డనఁగఁ బరఁగె;

సతి నిలిపె దుగ్ధపాథోధి జనితచంద్రు
శివు జటాజూటమున విశోష్ణిమల నణంప.

## దక్షయజ్ఞము

తే. గీ. జగము లేలుచు నీ రీతి సతియు, శివుఁడు
వేల సంవత్సరమ్ములు వెడలఁబుచ్చఁ.
శని సహింపమి, దక్షుఁడు జన్న మొండు
సలుప నెంచి సతీశులఁ బిలువ వచ్చె.

తే. గీ. హరుఁడు జపమగ్నుఁడై మామ నరయకున్న
కుపితుఁడై యేగె పిలువకఁ గూఁతునైన;
పుట్టినిల్లను మమకారమున నెలంత,
యజ్ఞమున కేగుటకు శివునాజ్ఞ నడుగ.

క. తరుణీ! తఱి కాదియ్యది;
నిరుపమ భాగ్యములఁ దేలు నీ తల్లిదండ్రుల్
కరితోలు, నారచీరయుఁ
గలవగు మన బ్రతుకు నెంచి గర్వింతురటన్.

క. గరువమున కిపుడుతోడుగఁ
గొారకొార కోపమ్ము కూడఁ గూడెను, చెలువా!
చిఱుచూపు చూతురక్కడ,
మఱియొక పరి నేగవచ్చు; మానుట యొప్పున్.

క. అను మగనికి సతి యిట్లను;
ధన, ధాన్యములున్న గరువతన మేమిటికిన్?

మన కడుగను పూచికయును;
మన కలుములు మనకుఁ గోట్లు; మరియేండేలా?

క. సిరిలేదు తృప్తికంటెను;
సరి పతిమన్ననకు లేదు సాధ్వికినెందున్;
తిరమై యివి నాకుండఁగ
పురభంజను సతినిఁ జిన్నపుత్తురె యచటన్!

తే. గీ. అనిన, నీ యిష్టమును మహేశునకు నింతి
మ్రొక్కి, పయనించెఁ బుట్టింటి; కొక్కసారి
కట్టకడపటి కమ్మని కలికిచూపు
గములఁ దెలిపి కృతజ్ఞతల్ కాంతునకును.

క. జనకుఁడు చూచియుఁ జూడఁడు;
జననియు, భగినులును నెదురు చనరా సతికిన్;
జనకుని భయమునఁ జూచుచుఁ
గను చూపుల నిలకుఁ ద్రిప్పి, కనరెయ్యదియున్.

క. అతిథులు, బాంధవులు, పురో
హితులును, దేవతలు, నితరు, లిరుగున్ బొరుగు
సతిఁ గాననట్లు యజ్ఞని
యతి నుండుటఁ గాంచి, మిగుల వ్యాకులమతియై,

క. భవుఁ దలఁచి, యచటి తన యను
భవమును నాత్మఁ దలఁచి, నిజపాదాంగుష్ఠో
ద్భవ హుతభుక్కీలల నా
భవు సుందరి యప్పుడపుడె భస్మంబయ్యెన్.

వ. శంభుని మనంబునఁ దత్క్షణమున నజ్ఞాతదుఃఖదావాగ్ని
చెలఁరేగినఁ, బసికట్టి.

శివుఁడీ ఘోరము నాత్మలోనరసి యత్యుగ్ర రౌద్రమ్మునన్
శివమున్ బూని, పెకల్చెయొక్కజట, త్ర్యక్షుఁ, శేఖర క్తచ్ఛటల్
స్రవియింపన్, బటుశక్తిఁ గొట్టె ధరణీచక్రంబు కంపింప; సం
భవుఁడై నిల్చెనువీరభద్రుఁ డెదుటన్ ప్రాసన్స్మృగోద్బాహుఁడై.

తే. గీ. భవుని యాజ్ఞనుఁ గొని వీరభద్రుఁడపుడు
దక్షవాటికిఁ జొచ్చి, యధ్వరమునెల్ల
ధ్వంస మొనరించి, దేవతాతతులఁ దఱిమి,
రవికిఁ బండ్లూడఁగొట్టి విక్రమము నెఱపె.

శివుని దుఃఖ భారము

దక్షునిజన్న మీ పగిది ధ్వంసమొనర్చి, సతీశుఁడా విరూ
పాక్షుఁడు గుండెలం దెరియు నగ్నికణోష్ణిమ కాలకూటము
ద్వక్షముఁ దట్టిరేచు పెనుజ్వాలక తీవ్రముగా నిజోగ్ర ఫా
లాక్షదవాగ్ని మించదహనాంతరమూర్తిని, భార్యఁజూచుచున్

తే. గీ. ఆత్మసంక్షోభమును వక్షమందు దాఁచి,
దుఃఖమును కంటిఱెప్పల యందడంచి,
తన హతాశలు తెలియఁ బిత్తరిగఁజూచి
కష్టభారమపుడు మహాకాలుఁడోర్చె.

తే. గీ. వెఱ్ఱివాఁడయి నిలయమ్ము వీడి తిరిగె
నడవులనుఁ, బుట్టమెట్టల, నడియెడార్ల,

బంకిల, ఘోర, రుద్ర, మృద్వసుధలందు,
విపథములఁ, గంటకమ్ముల, విరతవృత్తి.

క. హరుఁడతి వ్యథఁగుంది. దిగం
బరుఁడై చరియింప, గురుఁడు వాసవుఁడీశున్
గరిసింపవచ్చు దారికి
హరుఁడడ్డము నిలువ, నెఱుఁగకా ఖండలుఁడున్.

తే. గీ. కులిశమెత్తిన, హస్తమ్ము కూలఁబడియె;
చూపుతో బుగ్గియయ్యె వాస్తోష్పతియును;
నా దిగంబరు శివునిగా నప్పుడెఱిఁగి,
గురుఁడు ప్రార్థించి, బ్రతికించుకొనియె నింద్రు.

జలజజు పంచశీర్షముల శంభునినొక్కటి తూలనాడగన్
గలిగిన కోపమా తలను ఖండన చేసెను గాలభైరవ
ప్రళయ మహోగ్రరూపమున; భైరవుహస్తము వీడిరాని యా
తలఁగొని,విష్ణువేడిన,నతండసిఁ గ్రుచ్చుమనెన్ నొసంటిలోన్.

తే. గీ. కత్తితో విష్ణునొసఁటిని గాయపఱిచి
కమలజు కపాలమున రక్తమునుఁ బట్టి
యొక్క సంవత్సరమ్మును నొక్కరోజు
చెల్ల, నది వీడె భైరవుచేతి, నంత.

తే. గీ. బ్రహ్మపుత్రెను గాశిలోఁ బాతిపెట్ట
నది కపాలమోచన తీర్థమయ్యెఁ; గాల
భైరవ ప్రతిష్ఠనుఁ సేయువారి కతఁడు
సాయముండును యము సభాస్థలముదాఁక.

తే. గీ. నందికేశు ప్రతిష్ఠింప, న్యాయ ధర్మ
ములు చెలంగు నిల; నాలుమందలుగ వృద్ధి
యగు; సుభిక్ష మగును దేశ; మటును నిటును
తరము లేదును ముక్తిని బొందు, ధర్మ దయను.

తే. గీ. వీరభద్ర ప్రతిష్ఠ నెవ్వా రొనర్తు
రట్టి మాన్యుల కిహాపరవ్యాప్తమైన
రక్షణము కల్గు పాపభరమ్ము తగ్గు;
జానకమ్మయు నీవును జరుపు డివ్వి.

తే. గీ. దరి యెఱుంగని దుఃఖమై దారువనము
నందు దెసమొలం దిరుగాడు హరుని స్త్రీలు
పురుషులు నొనర్చు మందలింపులనుం జెవిని
బెట్ట కున్నంత మునులు శపించి రతని.

తే. గీ. శాపగీపమ్ము లంటని శంభు నవ్వు
డెటేంగి, పండిలి లెస్స మహేశున కని
మునులు, నమరులు యత్నముల్ మొదలు పెట్టి;
రంత వఱకు శ్మశానమం దతని నుంప.

తే. గీ. బ్రహ్మహరుం జేరి, యో శివ! ప్రజలం గూర
భూతములు హింస పెట్టె, నీవు దయనెంచు
మన, శ్మశాన నివాసము శివుడు కోరె;
ధాత యొడం బడె; శివుం డటం దనరె, నంత.

పార్వతి పరిచర్య

తే. గీ. హిమనగాధిపు నరయించి నేగుదెంచి
నాకలోకమ్మునుండి మేనక యనంగఁ
జెలఁగు నప్సరోకాంత; యా చెలువ గర్భ
మందు దాక్షాయణీదేవి యవతరించె.

తే. గీ. జాతకము వ్రాసె హిమగోత్ర జాత కింపు
మౌళియగు భర్త యని సురమౌని యపుడు;
శైశవం బాది నీశ్వరీశక్తి యైన
యద్రిసంజాత సకల విద్యలను నేర్చె.

మిసమిసలాడి, వెల్లుబుకు మేనక పుత్రిక మేని సోయగం
బెసఁగె వసంత చంద్రికల నింపుఁ దలిర్చుచు పుష్పవాటికా
లసిత మనోరమోద్భిద విలాస విభంబయి; యౌవనప్రభల్
కుసుమశరాంబక ద్యుతులకుం దమ విశ్వజయంబుఁజాటుచున్.

ఆ తఱిఁ గ్రూర భూతముల నన్నిటిఁ బూర్తిగ లొంగదీసి, యా
ప్రేతవసుంధరాస్థలిని వీడి, తుషారమహీధ్ర పంక్తిపై
నూతనమౌ నివాసము గనుంగొని, తాపసియై వసింపఁగా
భూతవిభుండు, పన్నగవిభూషణుఁ, డీశ్వరుఁ డేగుదెంచినన్.

హిమవత్పర్వతచక్రవర్తి నిజశృంగేంద్రంబులన్ వంచి. సం
యమియైదుఃఖముమ్రింగి దక్షతనయావ్యామోహదందహ్యచి
త్తము వైరాగ్య తపఃక్రియాకలన శాంతంబందు నంచెంచునా
గమికర్మీకృతకుంభినీతలునకున్ గావించె సాష్టాంగముల్.

తే. గీ. ధవళగిరి కటక తట సానువుల నొక్క
రమ్య సమతలమందు నిర్ఝరము పొంత

పర్ణశాలలు నిర్మించి, భవుసపర్య
కాత్మజాతను నియమించి యామె కనియె.

తే. గీ. కాలకూటమ్ము గళమున, ఫాలనేత్ర
మున మహానలజ్వాలలు, మనమునందు
వ్యాకులాగ్నికీలలు, గల బ్రహ్మచర్య
దీక్షితుండు, రుద్రుఁడు, డుగ్రుఁ డీ త్ర్యక్షుఁ డతివ !

తే. గీ. అతిథి మర్యాద మన ధర్మ; మితని హృదయ
మెఱిఁగి, యేమరుపా టొకయింత లేక,
జరుపుము సపర్య ; మన ఘన శైలరాజ
వంశ గౌరవ, కీర్తులు పదిలమమ్మ !

తే. గీ. అనిన, మేనక యామె నక్కునఁ జేర్చి
తల్లి! వ్రేలెత్తి నీదు సద్వర్తనమున
నూదిమొన యంత లోసుగైనఁ జూప నగునె !
వారు నిపుడు సాఁకగల సిద్ధహస్త వీవు.

తే. గీ. అని, తమ కుమార్తె నటదించి, వారిని సెలవు
గొని, యరిగి; రంత. నద్రిరాట్తనయ నిత్య
మతని యెదకగు పరిచర్య లాచరించి
నియమ నిష్ఠాగరిష్ఠత నెగడఁదొడఁగె.

సీ. చుక్కతో సమముగా సుందరీమణి లేచి
బర్హిపింఛములఁ జత్వరముఁ జిమ్మ ;
కపిల గోమయమువారి కస్తూరిపొడి చేర్చి
సాంద్రంపుఁ గలయంపిఁ జల్లు నచట;

సుమరజమ్మునఁ జేర్చి హిమవాలుకాచూర్ణ
మున మనోహరముగా ముగ్గుపెట్టు;
మలయజమ్మునఁ గమండలు కపాలాదులఁ
బరిశుభ్రముగఁ దోమి భద్రపఱచు;

స్నాన మొసరించి, కుంజర చర్మచయము
లుదికి, భూతిగంధములిచ్చు; పిదపఁ గంద
మూల ఫలముల, మధు, దుగ్ధములనుఁ దెచ్చి
యొసఁగు భోజనవేళ కా యువతి, శ్రద్ధ.

తే. గీ. తుహినశైలంపు వనలతాద్రుమములందుఁ
జెలఁగు పరిమళ సుమములఁ గలికి హరుని
చరణపూజ లొనర్చును శిరము వాంచి;
చూడ దొకసారి తలయెత్తి శూలివంక.

వ. అంత శంభునకుఁ బెండ్లి యత్యవసరమనియు నట్లు
కానిచో విశ్వసంక్షోభము తప్పదనియు నూహించిన
బ్రహ్మామరాదులు సమావేశమై యోచించి,

## మన్మథుని గెలుపు

మదనుని, మీనకేతను, రమాతనయున్ శరణార్థులై సురల్
కదిసి, రతీశ! శంభునెదఁ గామమయంబుగఁ జేయకున్న మా
బ్రదుకులుబండలౌ, మముఁ గృపామతిఁజూడుమటంచు
నంతయున్
విదితమొనర్ప, మన్మథుఁ డభీష్టముఁదీర్పఁగ నిశ్చయించినన్

తే. గీ. అమరు లానందమున నేగఁ; రంత రతికి
మనసిజుఁ డనెఁ; ద్రిపురారి మానసమ్ము
గెలిచి నా కేతనమ్మునఁ నిల్పఁగలను;
కాని, యేమానొ నీకు మాంగల్య మబల!

తే. గీ. అనిన, రతియును; సమర కార్యమున కనుపు
భార్యకు సుమంగళీత్వము భంగపడునె?
సుమ శరమ్ముల నిక్షుచాపమునఁ బూన్చి,
హరుని నిబ్బర మదలించి యరుగుదెండు.

తే. గీ. అని, యుచితభంగి చిత్తజు ననిపి, పిదప
చిక్కఁబట్టిన దుఃఖ మక్షిద్వయాశ్రు
ధారలై పాఱఁ ధైర్యముఁ దాల్చి కడకు,
ధర్మకలశమ్ము చేయించి భద్రపఱిచె.

తే. గీ. కార్యములఁ దీర్చి మరిగెడు కాలకంతు
దారి గిరిబాలికాప్లావ వారి ధార
పొంత నుండుట గమనించి పుష్పశరుఁడు
వాడితూపుల హరు బెట్టు ప్రక్కలింప.

క. గిరికన్నియ తడి చీరకు
నర చాటయి మెఱుగు వడని యందము లెల్లన్
హరుఁ డంతటఁ గన్నార్పక
యరయుచు, తృటిలోన దుఃఖ మాత్మ రగుల్పన్.

తే. గీ. చూపులు మరల్చి, శూన్యమ్ము చూచి, చూచి,
దక్షపుత్రిక మనమునఁ దలఁచి తలఁచి,

రాగ లేశమ్ము లేని విరాగి కిచటి
యనుభవము సిగ్గు చేటయ్యె ననుచుఁ గూడి,

తే. గీ. పాదములు వేగ నడిపింపఁ బర్ణశాల
కరిగి, మఱచెను జరిగిన యంశమెల్ల ;
కాని, వ్యాఘ్రమ్మునకు వేఁటకాఁడు వోలె
మంచి సమయమ్మునకు వేచె మన్మథుండు.

తే. గీ. అనుదినము వోలెఁ బార్వతి హరుని పాద
పూజ యొనరింప; రెండవ పూవుటమ్ము
కలఁప శివు, నంత మూఁడుమూర్తులనుఁ జెలువ
దక్షసుత వోలె గనుపట్టెఁ దాఁకెఁ బోయి.

తే. గీ. తక్షణము తగ్గి, యీ ప్రమాదమ్ము తప్పి,
ననుకొనఁగ నొక్క సుమ మామె కనుల వద్ది,
తలను ధరియింప నఖశిఖాంతముగఁ జూచి,
సతి యనియు, కాదు హిమనగజాత యనియు.

తే. గీ. తలఁచి, చెలి దెసఁ బరుగెత్తు చూలఁపు గముల
శీలమను కళ్లెమునఁ బట్టి శివుడు నడిపె ;
మహిత యవనాశ్వములను సన్మార్గమందు
రౌతు నడిపించు విధమున; భ్రాంతి మాని.

తే. గీ. ఆ పగలు రేయి నణఁచిన నణఁగకుండ
నగ్నితప్తాంబుభవమైన యావిరియును,
మూఁత పెట్టిన మధువులు మూఁతఁ ద్రోయు
భంగి నాదేవు మదిఁ జేసె సంగరంబు.

క. వేకువ మూఁడవ జాముఁ
చీకాకొనరింప, లేచి, చెలువనుఁ గని, యో
రాకాశశిముఖసుందరి!
వాకిట ముగ్గిడగ వేగపడ నేమిటికిన్ ?

క. ఈ చీకటిలోఁ, జలిలో,
మేచకతపనీయలతిక మెఱసిన భంగిన్
లోచన చంచల దృగ్వా
రాచములకు ధరణి వెడల భ్రమజీవనముల్.

తే. గీ. ఈ తపసి కీ వొనర్చెడు నిట్టి సేవ
లకు విరిసె హృదయ మహోత్పలంబు తరుణి!
యని పలుకరించి, యంతలో నౌడుగఱచి
దరిని నిలువక సాగె ముందరకు శివుఁడు

క. ఆ మంజుల మృదుమధుర వ
చోమృతవృష్ట్యంతరార్థ మూహింపక, యా
కోమలి యుత్సాహమ్మున
నా మృదు సేవల నిమగ్న యయ్యెను గుటితోన్.

తే. గీ. నిత్యమును మించి యెక్కుడు నియతితోడ
హరు కుటీరమ్ము పరిశుభ్రపఱచె నింతి;
పుడికి తెచ్చెను క్రొంగ్రొత్త పుష్పచయము;
భవుఁడు సంతుష్టుఁడయ్యె సపర్య కనుచు.

తే. గీ. శంభుఁ డేతెంచి, దర్భకు శరము తగిలి,
చేష్టలను దక్కి నిలిచెను చిత్రమట్టు;

లట్టి చూచుచు సుమరాశి నట్టనడిమి
భర్మపాంచాలికయుఁ బోలె పరఁగు లేమ.

తే. గీ. తన యభీష్టముఁ దెలుపు నుద్యమము నాఁడుఁ
గరములనుఁ జాచి, యడుగు ముందరకు వేయు
నష్టమూర్తికిఁ బార్వతి యంజలింప,
జపతపమ్ములు శివునకు జ్ఞప్తివచ్చి.

తే. గీ. తన తపోవేదికను జేరి, కనులు మూయ,
నొక్క గిరికన్య కాక వేఱొండు గనక.
తపము సాగక, చాలించి, తలిరుఁబోఁడి
యెదుట లేకున్న నాగక హృదయ మదర.

తే. గీ. స్తబ్ధుఁడై చూడ, నీహార శైలజాత
మృదు చరణపూజ కనువైన మేలి పూల
తలిరుతీవెల సజ్జ హస్తమునఁ దాల్చి,
వచ్చెఁ బూజింప శివు పాదపద్మ యుగళి.

శీతాహార్యతనూజ పూజలొనరించెన్ భర్గు శ్రీపాదకం
జాతద్వంద్వము పుష్పశైలముల, నిశానుండు డోలాగతిన్
జేతోజాత శరప్రసూనహతిచే, స్వీయోగ్రవాచంయమో
ద్భూతోపజ్ఞత చే విలోలమతియై, పూజల్ గొనన్ మానియై,

తే. గీ. శంబరారాతి యైదవ శరము నపుడు
చాపమునఁ బూన్చి గుఱిఁజూచు సమయ మందు
దృష్టిఁబడుఁడు గాంచె మదనునౌద్ధత్య; మెఱిఁగెఁ
దన తపోనియతి కితఁడె శాత్రవుఁ డటంచు.

క. హరు చొప్పును, తన ముప్పును,
మఱఁదుకు గ్రహియించి, గెలిచె మన్మథుఁడనుచున్
విరిశరమును నాటెను వా రు
నురమున, నడికన్ను తెఱువ నుండెడు వేళన్.

క. మనమున నంతయుఁ గనుఁగొని
తన మూఁడవకన్నుఁ దెఱచి, దర్పకు భస్మం
బొనరించెను త్ర్యంబకుఁ; డా
యనలజ్వాలలు జ్వలింప నాభీలములై.

వ. తురగము చోరగ్రస్తమైన పిమ్మట కొట్టమునకుఁ దాళము బిగించిన చందమై.

తన పాదమ్ముల మీఁద పూ వొకటి కందర్పారి శైలాత్మజా
త నవాంకూరసమాన హస్తముల నొత్తన్, లేమ మో
మెత్తి యా
ననముం గాంచి, చలించెఁ, జిత్తమున నానాభావముల్
రేఁగఁగా,
ననలజ్వాలలు పర్ణశాల కవలన్ వ్యాపింప నూర్ధ్వమ్ముగన్.

తే. గీ. ఇంక నిట నుంట పాడిగాదీశుకైన
ననుచు, భృంగిని తత్క్షణమందుఁ దలఁచి,
హిమగిరీశుని సెలవొంది. యుమనుఁ గనులు
తమఁకుదాముగఁ జూడఁ నా స్థలము వాసి.

తే. గీ. చనెఁ గపాలేశ్వరుఁడు నిజశైలమునకు;
చంద్రుఁ బాసిన శారదశర్వరీర

మణి వలెఁ జరంటి విరహిణి మాడ్కి, శిశిర
తరువు వలె నిల్చె దక్షజాధవునిఁ దలఁచి.

ఎచటకు నేగినన్ శివు డోకించుక యేనియు శాంతిఁ గాన, క
య్చ్చలకుమారి స్వీయహృదయమ్మున నిండి మెలంగ వార్ధి రా
ణ్ణిచయమహోర్మిమధ్యమున నిర్జనమౌ చిఱులంక జీవితం
బచల సిభంబుగాఁ గడపు నార్తుని పోల్కి జరించె నెల్లెడన్.

క. రతి యంతట దుఃఖమ్మునఁ,
బతి భస్మము నింపి భర్మపాత్రము నందున్,
జితమన్మథు కడకుం జని
సతి చేసి యనియెనుఁ బ్రమథనాథుని తోడన్.

తే. గీ. వెన్న నకు పాలమున్నిటి కన్నియకునుఁ
గోడలను నేను; నా విభుఁ గోలుపోతి
కర్మదుర్విపాకమునను; కష్టసుఖము
లెఱుఁగఁ గల ప్రోడవని వచ్చి తిటకు, సీశ!

తే. గీ. సతి వియోగార్తి కంటెనుఁ బతివియోగ
దుఃఖ మధికమ్ము దేవ! యందును, నమాయ
కుఁడు, నా మగఁ; డమరుల బాధ దీర్ప
నలరి, నీ కోపవహ్నికి శలభమయ్యె.

మేలే చేసెనో? కీడె చేసెనో? మహామేధావివౌ నీవుగా
కాలోచింపఁగ దక్షులెవ్వరు? హిమాహార్యాత్మజాసుందరీ
లోలంబైన భవన్మనంబును, భవల్లోలాత్మయై ప్రుక్కు నా
శైలేంద్రాత్మజ డెందమున్ గలుప, నీశ త్రుత్వముల్ కాన్కలే!

తే. గీ. అనిన, నివ్వెరపడి తేటి, హరుఁడు పల్కె;
ధరణి ధరజాతపై నెద దవిలె నాకు;
కాని, నాపైన నామెకు గలిగె మనస
టంచు నీవన్న మాట కవ్వించె నన్ను.

భ్రమరయో! నిక్క మొ! తెల్పునాకుసుదతీ! ప్రాలేయగోత్రోద్భవ
ప్రమదాచిత్త మనంగభావయుతమై వర్తించె నన్గూర్చి య
న్నమధూక్తి వ్రజమున్న; నీవచని, కానన్ వచ్చు; నిక్కంబుగా
ని, మృషాలాపము కాదటన్న సుమధ్వని ప్రేయసీ వాక్కులన్

సంతసమంది; నీ విభు నొసంగెదఁ గాని యనన్యజేశ్వరీ!
పంతము పట్టి, తండ్రిసరివాఁడని చూడక, వేట యాడుటా
వంతయు నొప్పు కాదు ననుఁ బంచశరుం; డటుగాన నీకు న
శ్రాంతము గోచరించియుఁ బ్రజల్గన లేని యనంగుఁడై మనున్.

తే. గీ. అని శివుడు పల్క నిందిరాతనయుఁ డచటెఁ
పసిడి కలశమ్ము వెలువడి, ప్రణుతి చేసి;
ధూర్జటికి మ్రొక్కలిడి, రతి తోడ నరిగె;
శివుఁడు చనె, భృంగితో నుమ చిత్త మెఱుఁగ.

పార్వతి తపస్సు

తే. గీ. సోదె చెప్పెడు నెఱుకుల సుదతు లట్లు
పార్వతినిఁ జేరి, శివుఁడు నీభర్త యగుట
తథ్యమన, వివాహమ్ము సాధ్యమ్మొనర్ప
వేఱు కట్టించి కొనియె హిమ్మభృత్సుజాత.

తే. గీ. వేలుపులను, మంత్రతంత్రముల్, పెద్దవారి
పలుకులును, దైవబలమును గలిసిరావు
యత్నమొనరింప కెవ్వరికైన ననుచు
తపమొనర్పఁగ, శివుఁడు ప్రత్యక్షమయ్యె.

తే. గీ. పర్ణశాలను, చేతఁ బుష్పమ్ము నిడిన
శుక్లసోమార్ధ ఘనజటాజూటమూర్తి
యటులఁగాకొక్క బ్రాహ్మణ వటువు వోలె
నెదుటఁ గల శివు నెఱుఁగక యింతి పలికె.

తే. గీ. హరునిఁ బెండ్లాడ నేఁ దప మాచరింతు;
నతఁడు తన యిచ్చఁ దెలుప నిన్నంపినాఁడొ!
కాక యీ దారి నేగు నాగంతకుఁడవొ?
సజ్జనుఁడవొట నంజలి సంఘటింతు.

తే. గీ. అనిన వటువనె: నో మేనకాత్మజాత!
దేవతలకు, నసురులకుఁ దేవదేవుఁ
డైన శివుఁడేడ? భోగినియందుఁ బుట్టి
నట్టి నీవేడ? వెట్టియూహలకుఁ బోకు.

ఆ. వె. శివుఁడు వచ్చి నిన్నుఁ జెట్టఁ బట్టున యేని
యేమి బ్రావు కొందు, వింతి! నీవు?
తిండి కొఱకు ముష్టి; యుండ శ్మశానంబు;
పేరు గొప్ప కాని, యూరు దిబ్బ.

క. చేతనగునె కాపురములు
భూతేశుని తోడఁ జేయ? భూధరపుత్రీ!

చేతులు కాలిన పిమ్మట
చూతురె యాకులనుఁ బట్ట సుందర యువతుల్!

తే. గీ. వేద శాస్త్రమ్ము, లిమ్మహా విశ్వమ్మునను
నెసఁగు విజ్ఞాన సర్వస్వ మెఱిఁగి నట్టి
సత్కులీనుఁడ, వీరుఁడ జక్కనైన
వాఁడ, చేపట్టు టుచితంబు, భామ! నన్ను.

తే. గీ. అనిన; పార్వతి పల్కె నా మనము శివుని
యందుఁ జిక్కెను; లే దీశునందు లోసుఁగు;
విశ్వ విజ్ఞాన సర్వస్వ వేది వేని
దబ్బరయు, డంబ, మప్రస్తుతమ్ము నేల?

క. భోగిని కూఁతుర ననుచును
సాగించిన ప్రల్లదము లసత్యము కావే?
నాగేశుఁ డెఱుఁగ మేనక
భోగిని కాదనుట, వ్యర్థపుంబలు కేలా?

తే. గీ. సంస్కృతి, వివేకమును, జ్ఞానసరణి లేని
ఛాందసుఁడవీవు; చదువొండె చాలదుర్వి;
వెడలు మధిక ప్రసంగముల్ వీడి; సజ్జ
నుఁడవని పొరపడితి నింత తడవు, వటువ!

క. అనుచుండఁగ, వటుఁడు త్రిలో
చనుఁడు, జటాజూటమనుట శశిఖండ ధరుం,
డనిలాశన భూషణుఁడు, న
తను కుసుమాంబక చలిత హృదయుఁడై నిలువన్.

తే. గీ. చొప్పరసి, నివ్వెరపడుచు జెప్ప పాటు,
తత్‌క్షణమ సిగ్గునను శీర్ష తలము వంచి;
యెఱుఁగకన్నవి మన్నింపు మీశ! యనుచు
శైలసంజాత పలికె నస్పష్ట సరణి.

తే. గీ. క్రొవ్విరుల జారు తేనియల్ గ్రోలి నట్లు
నీ ప్రవాళాధరద్వయ నిర్గతోక్తు
లెదను పరవశ మొనరించె; చేలుకోనుము;
చాలు, దేవేరి! నీ తపశ్చర్య లింక.

తే. గీ. క్షీరపాథోధి మీఁగడ చీర కట్టి,
చలిమలను మంచు తెర వోలె నలది భూతి,
అంగుళీలతఁ గఱకు రుద్రాక్ష లెనయ,
చిగురుటంఘ్రిలఁ గంటక శిలలు పొడువ.

తే. గీ. కొదమ తుమ్మెద జడఁ గప్పఁ గుసుమధూళి,
నిండునెలమోము పటు తపోనియతి వాడ,
గ్రీష్మధుని వోలె మేను శుష్కించి యూఁగఁ,
గప్పురము వోలె గాలిలోఁ గాను కలియ.

ఓరిమి నీ వొనర్చిన మహోగ్రతపోష్ణిమఁ గ్రాగి గుండియల్ నీరయి పాఱ, నీ యెదుట నిల్చితిఁ; దొల్లిటినాఁడె రాని నా క్రూరత సైచి, నీ వలపుఁ గోరిక సూటిగఁ దెల్పు; తంగజా తారిమె నీ విలోల నయనాంబుచరాంకున కోడె సుందరీ!

తే. గీ. అనిన శివునకు నగరాజ తనయ యనియె:
తల్లి దండ్రుల చాటున నున్న దాన;

కులధరాధరరాజేంద్రు సెలవు పొంది
చేకొనుము నన్ను కైలాసశిఖరవాస!

తే. గీ. అనుచు విశ్వేశు పీఁట గూర్చి; వ్యాఘ్రచర్మ
మునఁ దపోవస్తుతతిఁ జుట్టి, మోదసంభ్ర
మములఁ దలిదండ్రులకు దెల్పి, మందిరమున
వేచెను మహేశు రాక కా పేరటాలు.

పెండ్లి మాటలు

తే. గీ. అంత నాఁకలిగొన్న బ్రాహ్మణునిఁ బోలె
హరుఁడు పార్వతి నడిగె నాహార; మతివ
స్నానమొనరించి చనుదెమ్ము జమున ననుచు
వంట చేయుచు నుండంగ బ్రాహ్మణుండు.

తే. గీ. అఱచెఁ దన్ను మొసలి పట్టె ననుచు; నంబ
పరపురుషుఁ దాక నోర్వమిఁ, బర్వతేంద్రుఁ
డతని రక్షింప, శివుడు ప్రత్యక్ష మగుచు
ననియె వినయమ్ము గదుర నయ్యద్రిపతికి.

తే. గీ. పుడమిఁ దిరుగుచు వ్యోమకేశుఁడను, నిన్ను
గాన కాడిన యీ నాటకంబు నకును
నన్ను మన్నించి నీతోడ నాల్గు మాట
లాడు నవకాశ మిత్తువే! యద్రిరాజ!

తే. గీ. అనిన, నాకొండదొర నవ్వి, యట్ల యగుత
యనిన, వచ్చిన పనిఁ దెల్పె హరుఁడు; నంత
పెండ్లి చేయంగ గుబ్బలి విభుఁడు మేన
కయునుఁ జేసిరి నిందు నిర్ణయము లార్య!

హాయగతిరగడ: చాటు నుండి శంభు నొక్క
మాటు చూచి, మరులఁ జిక్కి,
వంచె శిరము వరున క్రోడి
పొంచి కనిన పూవుఁబోడి.

తురగగతిరగడ:

కలువకన్నె హృదయ మెట్లు కౌముదీ ప్రవాహమందుఁ
కులుకు మీఱ విచ్చి వలపు కోర్కెలెల్లఁ దెలుపు ముందు,
బయలుపఱిచె నట్టిభంగి పార్వతీ ముఖోత్పలమ్ము
ప్రియుని యెడలఁ దనకుఁ గలుగు ప్రేమభావ సముదయమ్ము.

ఆ. వె. పెండ్లి మాటలకునుఁ బెద్దల సంపుట
లౌకికంబు గాన నా కపర్ది
యుల వసిష్ఠు సతిని యర్ధాంగి నంపెను
మంచి రోజు చూచి, మంచుమలకు.

సింహగతిరగడ:

సీ. కమలభవుఁడు పెండ్లికి సుముహూర్తము
కాంచన ఘంటమున లిఖించి యొసఁగె;
నమర మహాశిల్పాచార్యుఁడు క
ల్యాణపుమంటపమునుఁ దెచ్చి యొసఁగె;
శయనాగారమును మయుఁడు కట్టఁగఁ
చక్కఁదనము గాంచి మురిసెను మరుడు
రయమునఁ బెండ్లి జరుగు సుముహూర్తపు
రాకకు వేచి రుమయు శివుఁడు నపుడు.

వసంత ఋతువు

హారిణగతిరగడ : ఇంతటిలోన నేగుదెంచెను
సంతత నవ వసంతం బిలను;
భావములు తలపడ హృత్స్థలిని
జీవకళ హెచ్చెను భూస్థలిని.

భూసః పర్ణవర్ణమణి పోల్కి వసంత సమాగంబునన్
భాసిత యయ్యె; గుల్మ, తరు, పల్లవ, శాద్వల, పర్ణ చేల కూ
ర్పాసకముల్ ధరించి, వనబ్రాహ్మిచయమ్ము ప్రభాత నృత్య వి
న్యాసములన్ సముజ్జ్వల దయాద్భుతహాస్యరసమ్ములాడగన్.

సీ. హారిణ శాబక, రాజహంసీ సమంచిత
గమనముల్ హృత్పాదగతులఁ బోల;
కీర, పికాలాప గీతికా నివహమ్ము
భూషణ శింజినీ స్ఫూర్తి గలియ;
బహువర్ణ భాసుర పరిమళ పుష్పముల్
మంజులాలంకార మణులఁ బోల;
వనపుష్ప మకరంద వాహినీ నిచయమ్ము
మృదువచోమృతధార మెలఁగఁ జూడ;

వసుమతీదేవి తన పెండ్లివాసరంపు
నవ వసంతప్రఫుల్ల వైభవము దాల్చె,
రాగ, లజ్జా, విలాస, సంభ్రమ విలోల
భర్మితమలత యగు నూత్న వధువు వోలె.

## పార్వతీ పరిణయము

సీ. అవని దేవతలును నమరులు జత గూడి
శ్రవణ పేయమ్ముగా శ్రుతులు చదువ,
గంధర్వ కిన్నర గాయక నర్తకుల్
నృత్య గానమ్ముల నేర్పు చూప,
దిక్పాలకులు, నేడుదీవుల రాజులు
కులగిరీశులునుఁ గానుకల నొసంగ,
శ్రీ, భారతీ, శచీ, క్షితిదేవి నలువురు
మంగళ హారతుల్ మలయఁ జేయ
సకల జగములు, తారకా సముదయములు
సప్త ఋషులు, గ్రహములు. సేసలనుఁ జల్ల,
నగ్ని సాక్షిగఁ బరిణయ మయ్యె శివుఁడు
గౌరి, నంబను, సర్వమంగళను, నుమను.

పూ విలుకాని చాపమునఁబూచిన యాఱవపూవు లమ్ముగా
నా వియదప్సరోవనిత లందఱు గౌరి నలంకరింప, నె
త్తావులు చిమ్ము వేళ ప్రమదావనసీమ వసంత యామినీ
దేవత లీలఁ గ్రొమ్మెఱుఁగు దీర్చిన పుత్తడి బొమ్మకైవడిన్.

తనరెడు మేనకాతనయ తల్లియుఁ బద్మజముద్దుకోడలున్
దన కిరువైపులన్ జెలఁగఁ; దత్తరపాటనవద్య రీతులున్,
వెనుకకుముందుకున్ నడుప,భీతియు,ప్రీతియు,సిగ్గు, కోర్కెయున్
మనమునమూయలల్ దిరుగ; మంజులతల్పగృహంబు చేరఁగన్.

తే. గీ. తరుణి నట దించి, రతియును; దల్లి యేగ
వామలోచన నేలపైఁ బఱపి చూపు

లపుడపుడు వాలుగన్నుల నాత్మవిభుని
పాదముల దాక దృష్టిని బఱపి నిలిచె.

తే. గీ. మాటలకు మెల్లగా దింపి, మందిరమ్ము
వెనుకఁ గల కేళికారామమునకుఁ జనఁగ
నోడఁబఱచి, డగ్గరిలు టామె యొప్ప దేమొ?
తొందరిలఁ గందునో యేమొ? డెంద మనుచు.

తే. గీ. తరులతల పూలనీడల, సరసి పొంత,
వెన్నెల, నిసుక తిన్నెల నిడిగ మెలఁగి,
యబల కాడీమె. శక్త్యంశ నవతరించె
నోర్పుమై నీమె సాధించు టుచిత మనుచు.

క. కోలఁదిగ నలసితి వేమో?
చలిమల, వెలిగాలి, సాంద్రచంద్రాతపమున్
గలిగించు జలుబు, తరుణీ!
తలిమ తలంబునకుఁ దరలు తరుణ, మ్మాలోన్.

తే. గీ. తమ్మి దొన్నెల మంచు నీరమ్ము వలతొ?
ద్రాక్షరస మిక్షురసమునుఁ ద్రాఁగఁ దలఁతొ?
పుష్పమధుధారఁ గ్రోలుదో పూవుఁబోఁడి?
యిదిగో, దొన్నెల నింపితి నిందువదన!

తే. గీ. అని యొసంగిన మధురస మామె క్రోలి
తిరుగ దొన్నెల నింపి తా హరున కీయ,
నంగుళీస్పర్శఁ బులకిత యైనఁ దెలిసి,
లలితసుమగాత్రి! కొను కరాలంబనమ్ము.

తే. గీ. అనుచు, బాహ్యార్ధవలయిత యైన యద్రి
జాత నుపచార మృదువచ స్స్ఫీతచిత్తఁ
జేయు, విశ్వాసమునుఁ గూర్మి, చిన్న నగవు
నందుఁ గని చేర్చె శివుఁడు పర్యంకమువకు.

తే. గీ. అచట నానంద పారవశ్యమునఁ దేలు
పార్వతీశ్వరు లెపుడు శుభంబు లొసఁగి
నిన్ను రక్షింతురో కొరీ నీరజాక్షు!
యీ గుడిని నిల్చి పాలింతు రెల్ల జనుల.

వ. అని వాక్రుచ్చిన కథాక్రమంబును విని సభాసదులెల్ల
ను మిక్కుటముగ సంతసించినఁ గొరీ రామచంద్ర
రావా వృద్ధబ్రాహ్మణుని పార్వతీశ్వరుల నిజమైన కథను
మాకు ప్రసంగుచ్చిన తెలియజేసి ధన్యులనొనర్చితివి.
వారి కుమారుల నిక్కమగు కథయు నిట్లే మాకందఱ
కెఱింగింపమని వేఁడిన నా వృద్ధబ్రాహ్మణుఁ డిట్లనియె.

వి నా య కు ని క థ

అమరుల నెల్ల కష్టముల కాహుతి చేయఁగ రాక్షసౌఘముల్
సుమనసు లందఱున్ త్రిపురసూదనుసన్నిధినొంది, యేయుపా
యమునఁదొలంగునీచెడుగు? త్ర్యంబక! నిన్నె వరంబు గోరుచున్
నమ్మినటు చేయు దుర్మదుల నట్టొనరించుట తప్ప దీపయిన్.

తే. గీ. అనిన, నిర్ణయ మొనరించి హరుడు గడువు
దైత్యు లప్పటిలో సురధాత్రి వీడి
తొలఁగి పోవంగ శాసించి, తొలఁగకున్న
పారఁద్రోలుదుఁ దానని పలికి, మఱియు.

తే. గీ. ఆ వ్యవధిలోన నే యుపాయాంతరంబు
మనమునకుఁ దట్టునో చూతు ననుచు బంచి,
యోచనామగ్న మానసోద్యోగుఁడైన
హిమ శిలోచ్చయ తనయ యిట్లనియెఁ బలికె.

ఏటికి చూతు, రాగగన మేమియుపాయముఁ జెప్పుమీకు? మీ బోఁటుల చిత్తసీమలను పుట్టెడుపుట్టెడు బుద్ధులుండ, నే పాటి సమస్య యిద్ది? యన, వస్తువులన్నిటి సంశ రూప మి ట్లేటికి నాకసంబునకు నేర్పడ దాకృతి యంచుఁ జూచితిన్.

అని శివు, డో విలాసవతి! యాకస మాకృతిఁ దాల్చి పుట్టు నీ తనయుఁడుగా; నతం డెదిగి దర్పముఁ జూపఁగ, నేఁటియట్టు లే దనుజుఁడునొక్కఁడై సురలఁదాఁకవడంకునటంచు పల్కి తాఁ జనియెను కొన్ని రోజులకు సంగర సీమలఁ గ్రుంప దైత్యులన్.

క. శైలజ గర్భము నందున
బాలుం డొకఁ డెదిగెఁ జిత్తభవుని. జయుంతున్,
బోలిన మోహన సుందరుఁ
డా లావణ్యము లంబ వదన మందునఁ జెలఁగన్.

అంతట యుక్తకాలమున నంబకుఁ బుట్టె వినాయకుండు; శు ద్ధాంతమునం దలంటుకొను ధాత్రిధరాత్మజ కాపు పెట్టె ద్వా రాంతరమందు సూను; నపుడాసురవీరుల నాజిఁ జెండి దై త్యాంతకుఁడై శివుండు విజయం బెఱిఁగింపఁగవచ్చె నింతికిన్.

తే. గీ. అతఁడు శివుఁడని తెలియక యర్భకుండు
"అమ్మ తలయంటుకొనుచున్న దరుగ రాదు,

నిలువు" మన, "నాగృహంబున కీవు దొరవె?
యనుచు, నెత్తిఁ జఱచి, శూలమునను గ్రుచ్చె.

ఆ. వె. వేయి చెక్కలయ్యె పిల్లవాని శిరంబు;
లోని కేసఁ, దెలిసె వాని గుట్టు;
ఉత్తరదిశ శిరము నుంచి నిద్రించెడు
ప్రాణి శిరముఁ దెఱ బంపె శివుఁడు.

తే. గీ. భటులు, దేవతలునుఁ బుష్పభద్ర తీర
మందటుల నిద్ర పోయెడు హస్తి శిరము
తెచ్చి యతికింప, బాలుఁడు తిరిగి బ్రదికె,
మురిపెమున నెత్తుకొని తల్లి ముద్దులాడ.

తే. గీ. దేవతాతతి పూజలం దీవు మున్ను
పూజితుఁడ వౌదు; విఘ్నముల్ పోవఁ ద్రోలు
దీవు; చండి, మహాకాళి, భృంగి, నంది
ప్రభృతులగు ప్రమథ గణాధిపతి వగుదువు.

వ. అని శివుఁడు వర మొసఁగె.

తే. గీ. గణపతికి సప్తవర్షముల్ గడచు లోన
బాఁప జన్నిదమును గూర్చి వడుగు చేయ,
నిమ్మగా నన్ని విద్యలు నేర్చి యాతఁ
డెలుకపై నెక్కి విశ్వము నెల్లఁ దిరిగె.

పుట్టినరోజు పండుగను బొజ్జను బూర్తిగ నింపి, దేహ మె
ట్టెట్టులొ యీడ్చుచున్ నడచు నీతని లంబపిచండమున్ గనన్

బొట్టలు చెక్కలై శశవిభూషణుఁడున్, శశముల్ హసించె న
ప్పట్టునఁబల్కెఁమిమ్ముఁగనువాఁడపవాదము నొందుదప్పక౯,

తే. గీ. చంద్రుఁ జూడక యుండుట సాధ్యమగునె?
శాప మించుక సడలింపు శంభు పుత్త్రి!
యనెడు నమరుల దయజూఁచి యతఁడు తెలిపె
తన చవితిమాత్ర మబ్బంగి జరుగుననుచు.

తే. గీ. ఈ కథను విని యక్షత లెవఱు తలనుఁ
దాల్తురో వారి కెట్టి నిందయును రాదు,
శాపకలన, వినాయకచవితి నైన;
కావిచో, తప్పదిక్కట్టు ఘనున కేని

తే. గీ. ఇందుచేతనె శైశవ మందు కృష్ణు
డావుపాలు పిదుకు యశోదమ్మ బుజము
మీఁదకును వంగి కుండలో మెఱయు నిందు
బింబమునుఁ జూఁడ, శాపఫలంబు కలిగె.

వ. పిదప గొన్ని వత్సరంబులకు,

తే. గీ. కనక మెనిమిది బారువు లనుదిన మ్మొ
సఁగు శ్యమంతక ధారియై సత్రజిత్తు
ద్వారకకు నేగఁ గృష్ణుఁ డద్దాని నడిగె,
ప్రజల కుపయుక్త మగునని ప్రభునకున్న.

తే. గీ. ఈయ కేగెను సత్రాజిత్తా యనంత
ర మడవి కతని తమ్ముఁడేగె మణి ధరించి;

సింహ మపహరించె మణిని, జీల్చి యతని;
జాంబవంతుఁ డదికొనె కేసరినిఁ జంపి.

తే. గీ. తమ్ముని వధించి కృష్ణుడే తస్కరించె
ననుచు ఘోషించె సత్రజిత్తపుడు ; శౌరి
పాలలో మును శశిఁగన్న ఫలిత మనుచు
విఘ్ననాయకుఁ బూజించి వినియె కథను.

తే. గీ. అక్షతలఁ దాల్చి శిరమున నడవికేగి
యడుగు జాడల శోధించి యరసె, నిజము ;
జాంబవంతుని నోడించి, సత్రజిత్తు
డలర, మణినిచ్చి పాసె నీలాపనింద.

తే. గీ. జాంబవంతుఁడు తనసుత, జాంబవతిని
సత్రజిత్తు నిజాత్మజ, సత్యభామఁ
గృష్ణునకుఁ బెండ్లి చేసి, యా యుష్ణరశ్మి
మణిని కట్నమ్మొసంగి రా మహిత మతికి.

వ. ఆ పిమ్మట కొన్నాళ్ళకు

తే. గీ. స్కందు కల్యాణ లగ్న నిశ్చయము జరుఁగ,
పార్వతీ గంగ లిద్దఱు పట్టు పట్టి
యగ్రజుండు వినాయకుఁ డగుటఁ జేసి
పెండ్లికూఁతుంద్రఁ దెచ్చిరి వెదకి, వెదకి.

తే. గీ. పెండ్లి లగ్నము లోపలఁ బెండ్లికొడుకు
లు వసుధా ప్రదక్షిణము చేయవలెననుచు

నప్పుడు హారుఁ డానతీయ, షడాననుండు
నెమలిపై నెక్కి పరుగెత్తె, నింగి కెగసి.

క. ఎలుక తురంగము పై నీ
కలభపు తొండంబు వాఁడు కాశ్యపికెల్లన్
వలయము తిరుగునె? తటిలో
పల వచ్చునె? యనుచు గంగ భయపడుచుండెన్.

తే. గీ. స్నాన మొనరించి వచ్చి, గజాననుండు
పార్వతీశివు లొకరికి పజ్జ నొకరు
కూరుచుండఁగ నటకేగి, వారి చుట్టు
నేడు సార్లు ప్రదక్షిణ మెలమిఁ జేసి.

తే. గీ. తల్లిదండ్రుల కేడు ప్రదక్షిణములు
చేసితిని గాన భూప్రదక్షిణము పూర్తి
యయ్యె నని విన్నవింప, విశ్వాత్మ శివంతి
పొంగె ద్వైమాతురు నుదగ్ర బుద్ధి కపుడు.

తే గీ. సిద్ధియును, బుద్ధి యనియెడు చెలువ లతనిఁ
జెట్టపట్టిరి; సిద్ధికి క్షేముఁ డుద్భ
వించె; లాభుఁడుఁ గనె బుద్ధి; పిదప బ్రహ్మ
చర్యమును బూనెఁ బజ్జనే భార్యలుండ.

తే. గీ. నంది వెలుపలి గవని, వినాయకుండు
రజతశైలాంతరాంతఃపురంబు చెంత
పొల్చి, రక్షింతు రేడు భువనములను;
విఘ్నముల దూరముగఁ ద్రోలు విఘ్నరాజు.

ఒక హేమంతనిశాంతయామమునఁ బ్రత్యూషమ్ము కాకుండ, రే
ణుక సూనుండగు రాముఁడుం గరణవిన్యుం డాజిలోఁ గూల్చి దు
ర్వ్యాకలీభూతసహస్రబాహునిగ నుర్విన్ గార్తవీర్యార్జునున్, :
బ్రకటాహంకృతి నేగుదెంచె గ్రతుసిధ్వంసిన్ బినాకిన్ గనన్.

క. సవ్వడి విని హేరంబుం
డెవ్వారు మీ రిట్టి వేళ నేగకస్ దటి గా
దివ్వాల నుండుం డన, విన
క న్విప్రుం డచల కందరాంతరమునకున్.

పోవఁగఁ బూనినన్, గలఁగి, భూసురుఁ డొండము తోఁప నెత్తి నీ
వా వియదంతరంగమును, నచ్చటి లోకములాఱుఁ జూడు; మా
దేవుని వేళ కిచ్చటకు దెచ్చెద లెమ్ము, భయంబు లేదనన్,
గావి ముఖంబునం దెఱుపుకన్నులు కెంపులు రాల్ప నుగ్రుఁడై.

తే. గీ. పరశురాముఁడు గొడ్డలి పాణి యుగళిఁ
బట్టి ప్రేటులు వేయ, దెబ్బలకు విఘ్న
రాజు దంతము లందొండు రాలె భువిని;
పుట్టె రవి చప్పరించుచు బోసి నోరు.

తే. గీ. వేళ యయ్యెను, దిగి రమ్ము, విప్రవీర!
దంత మొక్కటి యుంచితి వంతె చాలు;
తృప్తికినిఁ దుల్యమైనది తృప్తి యొకటె;
చాలవే నీవు చేసిన సంగరములు!

తే. గీ. అను గణపతి సహనమున కబ్బురమ్మొ
సంగ, భార్గవరాముఁ డాలింగనమ్ము

చేసి; శివ దర్శన మొనర్చి; చేతి పరశు
వవల నిడి, యేగెఁ బెను తప మాచరింప.

తే. గీ. రుద్రురౌద్రమ్ము, మఱియునారుద్రు రాణి
యాదిశక్త్యంశ జన్యయు నైనదేవి
యుగ్రతయు నెట్టి పట్టున నుబుక కుండఁ
జేయఁగల దేవుఁ; డొక్క- వినాయకుండె.

కుమారస్వామి కథ

వ. ఇఁక పార్వతీ గర్భసంజనితుఁ డైన షణ్ముఖుని కథను వాక్రుచ్చెద :

క. పన్నగ భూషణునకు హిమ
వన్నగజాతకు జనించు వాంఛన్, శివు క
ర్ణోన్నత భుజ, గళ, మస్తక
పన్నగములు పుట్టె నాఱు వదనమ్ములతోఁ.

తే. గీ. క్రొత్తగా ఱెల్లు పఱచిన మొత్తపై నఁ
బురుడు పోసిరి మేనక పుత్రి కతివ;
లాయుధముగ శక్తియును వాహనముగ శిఖిఁ
బడసె బాలుడుఁ శాక్క-గ బారసాల.

పాతాళప్రభు శీర్ష శోణమణి దీప్తంబైన దేహచ్ఛవి
వ్రాతంబుల్ ప్రతిసాంధ్యవేళను నభఃప్రాక్పశ్చిమాశాద్వయిఁ
ద్యోతంబై చెలఁగఁ బ్రజాహృదయతోషోత్పాదకుండై నయా
భూతేశాత్మజుఁ జూచి యింద్రుఁడు భయంబుఁ జెందె
డెందంబునన్.

వ. అంత సంక్రందనుం డా పసివాని చెయిదములను భీతితో
గమనించుచుండ.

ఆ. వె. మూఁడు పట్టణముల ముప్పూరు ద్వారలను
మడియఁజేసి యూళ్ళ మట్టుపెట్టి
నట్టి వింటివారి నతఁడు లాగఁగఁ జప్పు
డయ్యె, దద్దఱిల్ల నన్నిదిశలు.

ఆ. వె. బెదరి రెండు దిశల మదగజమ్ములు దూక
బాలు మీఁద, నతఁడు వానిఁ బట్టి
యాట బొమ్మలట్టు లటునిటు త్రిప్పిన
నరసి, తల్లడిల్లె హరిహయుండు.

ఆ. వె. ఎసరు పెట్టు నేమొ యీపసి కందువు
పెద్ద పెరిగి నాదు గద్దె కనుచు
పీచు మనఁగ గుండె, వేయి కన్నుల వాఁడు
పాముపగను బూనె పాప నడుప.

తే. గీ. తపమునకు నేగు నుమయు నంధకరిపుండు
బాలు స్వాహాగ్నులకు నిచ్చి వనికిఁ జనిరి
బిడ్డకు బిడౌజుచేఁ గీడు బెరయ కుండ;
కృత్తికలు పెంచి రార్గురు క్షీర మిచ్చి.

తే. గీ. పిదప సాకిరి ప్రేమతోఁ బిల్లవాని
గంగయును నా భరద్వాజ కశ్య పాత్రి
గాధిరాట్పుత, జమదగ్ని, గౌతమర్షి
వరుల పత్నులు వరుసగా పవలు రేలు.

తే. గీ. సప్త మాతృకలనుఁ బాకశాసనుండు
బాలుఁ జంపఁ బంపఁగఁ దత్ప్రభావ
మునకు దిగ్భ్రాంతలై శరణనిన, మార్చె
వారినొక బాలగ్రహముగ బాలకుండు.

తే. గీ. అపుడు తత్క్రోధమున లోహితాస్య పుట్టి
బాదిలై బాలు నొక సుతాముఁ డింకఁ
జేయునది లేక ధైర్యము చిక్కఁ బట్టెఁ;
నవల నొకనాఁడు స్కందు బిట్టార్వ నెంచి.

ద్విపద : గంప నిండెను నీర్ష్య కంపింపఁ దనువు,
చంపెద నెటులైన శిగజన్ము ననుచు
శేఖర్వ భుండు కులిశమునఁ గొట్ట,
నాఖండలుడె పడి యవనిపై దొరలె.

తరుణ వయస్కుఁడై నతఁడింద్ర్యంబక సూనుఁడుశూరపద్మునిన్
బోరిగొని, వజ్రి పట్టణము పొంతగఁ,మార్గముతీయు, నాపురం
దరుఁడు కలంగి, నా యమరధామము నీవిఁక నేలుకొమ్మనన్,
హారతనయుండు వృత్రహ భయంబును బాపి,నిరాకరించినన్.

తే. గీ. నిజ తనయ దేవసేనను నిర్జరేశుఁ
డగ్నిభవున కొసఁగి వివాహమొనర్చె,
యా మహాసేను దేవసేనాధిపతిగఁ
జేసెఁ బురుహూతుఁ, డసురులు చింతమునుఁగ.

వ. పిమ్మటఁ గొన్నాళ్ళకు తారకాసురుఁ డను మహా
రాక్షసుఁడు దురాత్ముండై ప్రవర్తించుచు.

వరములు బ్రహ్మచేఁబడసి, వారిదవాహానుఁ బారఁద్రోలి, తాఁ
జెలఁగొన దానవారులను, స్త్రీనివహాముల్గల, వచ్చెఁ దారకా
సురుఁ; డపుడంబ చెప్పె పరసుందరి నెవ్వఁడు తోడఁబుట్టువ
ట్లరయఁడో వానిఁ జంపవలె నంచును గార్తికేయుతోన్.

హారతనయుండు స్వీయవిధి నంబిక యానతి యిబ్బడింప, భీ
కరమగు పోర, నెత్తురులు కాల్వలు కట్టఁగ, దైత్యబృందమున్
దఱిఁగిన ఖండ, పంకములు తారల నంటఁగ, క్రౌంచమేదినీ
ధరమును బ్రక్కలించి, యట దాఁగిన తారకదైత్యముఖ్యు సం
హారణ మొనర్చి, కూర్చె నమరావళికిన్ స్థిర శాంతిసౌఖ్యముల్.

వ. అనిన వృద్ధబ్రాహ్మణునకు ధన్యవాదము లర్పించి ఆయ
నను, ఇతరులను నుచితరీతిని సత్కరించి శివరాత్రికి
పునర్దర్శనప్రాప్తి నర్థించి కోటీశ్వరుఁడంపె,

## ఆ శ్వా సాం త ము

● యగ్రాహి:

ఇందుధర! ధాత్రితల కందర భుజంగ సహ మందిర!
వృదారు చయ సుందర! మహేశా!
కందరవిముక్త సుమబృంద సహవాస! సుకబంధనిక
టేశ! యరవిందదళ నేత్రా!
నందిత కోటీ జలనిధీందు హృదయోత్పల సు
గంధ మధుసక్త! శివమందిర నివాసా!
బందరు పురీ నిలయ! వందిత సమస్త జన!
నంది ఘన జత్రు చర! యందు మివె మొక్కుల్.

ద్రుతవిలంబితము: సతిని చేకొని సంతసమంది, య
య్యతివ లేని మనోవ్యథ మాన్పి, పా
ర్వతి వివాహము స్వాస్థ్యము గూర్పు, మా
కతుల సౌఖ్యచయ మ్మిడు, నీశ్వరా!

భుజంగప్రయాతము: భవానీ! తపంబుల్, వివాహాది గాథల్
భయత్స్వీయ వాక్య ప్రవాహోర్మ్ములందున్
ధ్రువస్థేయమై, స్వాంత తోషంబుఁ గూర్చెన్ ;
నవోద్యత్ గృహావాస! నాగేశ! యీశా!

గద్యము: ఇది శ్రీ శ్రీవత్సస గోత్రాంతర్గత తేకుమళ్లా న్వయ సంజనిత రాజగోపాలరావు తనూభవ రామచంద్ర రావు నామధేయ ప్రణీతంబైన శ్రీ శాలా త్రిపుర సుందరీ సహిత శ్రీ నాగేశ్వర మాహాత్మ్యమ్ము నందుఁ దృతీయాశ్వాసము.

మంగళమ్ మహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత

# శ్రీ నా గే శ్వ ర మా హా త్మ్య ము

చ తు ర్థా శ్వా స ము

క. శ్రీ వాణీ గిరికన్యా
వైవాహ స్నానజలము భారతభూమిన్
జీవనదులట్లు దిద్దిన
దేవా! నాగేశ్వరాఖ్య! దివ్యాంబుధరా!

తే. గీ. అవధరింపుము పృథ్విలో నఖల పుణ్య
వాహినీతతి నీ యింటిపట్టునందు
నలరు హ్రదమున కాహూతమయ్యె నట్లు;
లమరతటినీ శిరోజ! చూడాగ్రరాజ!

శరదంతము, హేమంతము

తే. గీ. అశ్వనీ కృత్తికల పూర్ణిమామృతాంశు
కౌముదీరోచి విరిసెను, కార్తికమున
మింటి చుక్కలపేరు లింటింట వెలసి
నట్లు కార్తిక దీపమ్ము లలరెఁ బుడమి.

ఉ. అంతట నేగుదేర శరదంతము, దైర్ఘ్యముతగ్గెఘస్రముల్
సంతసమెల్లెడం జెలఁగె శాలిక గోధుమ వప్రవాటి; చే
మంతుల, బంతిపూవుల నమందసుగంధము లుప్పతిల్లె హే
మంతము ప్రాణశక్తు లిడి మానవకోటి బలంబు పెంపగన్

క. శారద జలధర శకలము
లాడుబయటి చలికి తాళ కాకసమందున్,
ధారుణికిఁ దిగునటులుండెను
పారముసాగె, కలిపి జగతిన్ నభమున్.

క. ఇందరు 'మస్లిను' చాటున
సుందరి నగుమోము కరణి, జ్యోత్స్నాకరుఁడుఁ
బ్రుం దారకపథ తారా
సందోహము మంచు రేకు చాటున మెఱసెన్.

క. వాకిట ముగ్గులు పెట్టుచు
చేకొని గొబ్బెలనుఁ బెట్టి చెలువారఁగఁ బై
పోకెడు నుదయానిలముల
తాకిడి కావంతయును బెదర కదరకయున్.

మత్తకోకిల: బాలికామణిసంహతుల్ దమవాకిటన్ గలగొబ్బెలన్
జాలపూవుల గ్రుచ్చి, వానిని చాలుగా నిడి, నాల్గు కం
బాల యాటయు, చెమ్మచెక్కయు, పట్టెలాటయుఁ, గోలలున్
లీలనాడుచు, డోలలం దవలీల నూఁగుచు నుండగన్.

తే. గీ. రేగు, దాడిమ, దోస, నారింజ లెసఁగె,
పిల్లలకుఁ బండ్లు పోసిరి పెద్ద లెల్ల;
బాలికలు బొమ్మలిడి రిండ్ల; బలియు విడిచె
సందడినిఁ జూడ, బాతాళ మందిరమును.

మ. సురలోకంబు జయించి దానగుణసుశ్లోకుండు, వైరోచనా
సురుఁ డీలోకము నేలఁ మాధవుండు రాజేంద్రోల గర్వాంధునిన్

నర రూపంబున వామనుండగుచుభూనాథేంద్రుయాచించి యి
ద్ధర ద్రొక్కెన్; నెలవిచ్చె జూడభువినుద్యద్గా త్రిహాసంక్రాంతులన్

## పుణ్యాపగాహ్వానము

వ. అట్లు మకర సంక్రాంతికి

తే. గీ. ఉత్తరాయణ మేతేర నొక్కనాఁటి
ప్రత్యూషంబున గుడి సరోవరము చెంత
నా శ్రీ రామచంద్రరాయుండు పట్టు
దలయు, నాత్మవిశ్వాసము వఱవ, నిలిచి.

ఉ. భూసురు లన్నయట్లు చెలువున్ భువినున్న పవిత్రజీవన
శ్రీసముదాయపూర్ణ మొనరించుమహార్తముడగ్గరంగ, ము
న్నా సలిలప్రవాహముల నచ్చటఁ జేర్చనఁ గాని సర్వరా
ట్ప్రాభసురు సంప్రతిష్ఠ జడుపం దగదంచు నెఱింగి యాత్మలోన్.

## కృష్ణవేణి

తే. గీ. అన్ని నదుల కంటె నతి సమీపమ్మున
నున్న కృష్ణవేణి మున్ను కోరఁ
దలఁచి రామచంద్ర ధరణీసురుం డంత
ప్రార్థన మ్మొనర్చె భక్తి నిట్లు.

ఆదిన్ బ్రహ్మకమండలూదకమవై, యభ్రప్రతీచీదిశా
కాదంబోజ్వల నిర్గతాంబు లహరీ కల్యాణిత క్షోణిభృ
న్మేదిన్యర్ణవరాశి నైతివి నమస్తే కృష్ణవేణీ నదీ!
నీ దివ్యామృత మీఁగదే హరునకున్ నిత్యాభిషేకార్థమై.

తే. గీ. గంగలో స్నాతులగువారు కడిగికొన్న
యఘము లంటుటచేఁ గాకియైన గంగ
హంస యగుఁ దోఁగి నీవారి ననుదినంబు,
నట్టి పావని రావమ్మ! యజుని కొమ్మ!

తే. గీ. అని నిరీక్షించి యోచించి యనియె నిట్లు;
తల్లి! కృష్ణమ్మ! సంశయముల్ల మందుఁ
బొందె నేటికి! నా మనః పూర్వకముగఁ
బిలుచు పిలుపున నేలోటు కలిగె నమ్మ!

సీ. భాగీరథీ దేవి ప్రభవించె నేయంఘ్రి
నా విష్ణు దేహమ్ము నందుఁ బుట్టి,
త్రిదశాలయమ్ములో దేవతా తరుచయ
మ్మొరసి, తత్ఫల భుక్తి నుబ్బటించి,
భువికి మునుపు కృష్ణముని కొని తేర, స
హ్యాద్రిఁ బిప్పల వృక్షమందుఁ జనికి,
సకల పాపహారణ శక్తియు; కలిభవ
కలుష భేదన శక్తి కలిగి, జనుల

స్నానమునఁ గాని, తాఁకుటనైనఁ గాని,
పాపరహితులఁ జేయు స్రవంతి వమ్మ;
చాక్షుస మనువు పాలింప జనన మంది
నెమ్మిఁ బ్రవహింతు విష్ణుతీర్థమ్ము నుండి.

తే. గీ. సహ్యగిరి, మహాబలేశ్వరము పొందె
నీ ప్రవాహాగమమ్మున నిండుఁదనము,

కొంకణముఁ, గన్నడముఁ దాఁటఁ, గుత్తిలోనఁ
దాఁగె పరతెంచి తుంగభద్రయును, భీమ.

వ. అంతట నేఁటి శ్రీశైలమహాక్షేత్రమును సమీపించి.

ధర, గాంధారముపొంతక్రౌంచగిరిమధ్యన్ బొల్చుశ్రీశైల శై
ఖర వాసుల్ భ్రమరాంబమల్లనలువిఖ్యాతాంధ్రకుద్యంపుశా
పరులై పిమ్మటఁ జేరి నీతటమునన్ బన్నెండు నూఱేండ్ల నాఁ
డిరవందన్, గొలు తీవ్ర కంకణ సహస్రేందీవర శ్రేణులన్.

వ. ఈనూతన శ్రీశైల ప్రాంతంబు నధిగమించిప్రవహించుచు
మయు, విశ్వకర్మ కుల సంభవులగు మహా శిల్పవరేణ్యులు
తొల్లి శ్రీ పర్వతప్రాంతం బనం బరఁగిన నేఁటి నందికొండ
యను ప్రదేశంబున.

శిలలక్ జీవము పోసి బౌద్ధకథలన్ జిత్రించి పల్నాటిలో
నిలుపక్, మెచ్చిన నీ రసజ్ఞత కళానిక్షేపముల్ క్రూర క
ర్ముల వాతక్ బడకుండఁ బెన్ వరదలోఁ బూడ్పించెనేనాఁటికై
న లభించున్ బ్రజకంచు; ధీమతికిలోనన్ దోఁచుమేల్మార్గముల్.

క. అత్తయ మిత్తొ్వకుల పురిఁ
గుత్తున్ నీ విట్లు దాఁచు కొంటివి; మఱలన్
జత్తుఃపర్వ మొనర్పఁగ;
సాక్షివి, తల్లీ! త్రికాల సంఘటనలకున్.

నిలిచెన్ నామది నాదిశేషుఁడును వర్ణింపం బదప్రౌఢిమల్
మలుపంజాలని యాంధ్రరాజ్యరమణీమాంగల్య మంజిష్ఠమీా
యిలకున్ మేరు నిభంబు ధన్యకటకం; బే పుణ్యకూలంకషా
సలిలం బాకర మా యశస్థితికిఁ గృష్ణా! యట్టి నిన్నెంచెదన్.

వ. అని పలుకుచుండ నాంధ్ర శాతవాహన చక్రవర్తులకు రాజధానీ నగరంబై యొప్పిన ధరణికోట యను శ్రీ ధన్యకటకంబును, సకల విద్యాబోధనకు నాకరంబై విశ్వవిద్యాలయ స్థానంబైన యమరావతియుఁ గలిసిన యేతద్వ్యాపిసీతట మహాపురవరంబు మనంబున సవివరంబుగా దోఁపఁ గౌశికకులార్ణవ చంద్రుండగు నా మహీసురుం డిట్లనియె

సీ. అదె చూడు, పాండ్య లంకాది సామంత భూ
పాల వేష్టిత సార్వభౌమ పీఠ,
మదె వణిక్సార్థమ్ము, లవె మహా విపణు, ల
ల్లవె యబ్ధివాణిజ్యభవ ధనాప్తు,
లదె సంఘ, మదె స్తూప, మటనె గ్రావము శిల్ప
వేలోన్నకి లలిత కవిత్వమయ్యె;
నదె విశ్వవిద్యాలయం బేడు దీవుల
కవధి చుంబిత శశాంకోదయమ్ము;

న్యాయ సభ, రాచ నగరు, గజాశ్వరథ భ
టాశ్రయము లవె; యదె నిరతాన్న శాల;
యైదు నూటేండ్లు శాతవాహనుల కిదియె
ప్రజలఁ జల్లగ నేలిన రాజధాని.

శకకర్తల్, శకవీర శాసనులు, భాషాపోషకుల్, సుప్రసిద్ధ కథా గర్భిత కావ్యకర్తలు నృప స్థానంబునన్ నిల్చి రాక్షినసీలోత్కల, గౌతమీ, యవన, వాసిష్ఠ్యాది, హైరావతీశక కన్యాధవ శాతకర్ణు, లది విస్పష్టంబుగాఁ దోఁచెడిన్.

తే. గీ. వంగ మగ ధాంగ, కామరూపములఁ గెల్చె
శ్రీముఖుఁడు; హాలుఁడు జయించె సింధు నజ్జ
యిని; సముద్రమున కవలి యెల్ల సీమ
లు నోసఁగె నివాళి శాతవాహనుల కపుడు.

వ. అని, కృష్ణానది నుద్దేశించి;

త్రిసముద్రమ్ముల నిండి, యర్ణవ హరి త్తీరావనీ వాటులన్
బ్రసుఖైశ్వర్య,సుహృ,ద్వివేక,సుమ శుంభద్వృష్టిఁదీపించి, మే
రుసమానమ్ములు తెల్గునాక లోగిపేరున్, బెంపు, శ్రీలున్ జయం
బెసఁగన్ జేరవె నీదుకౌగిటను? సింహిన్ శాబకౌఘ క్రియన్.

మేరు గిరీంద్రసానువుల మేసి హయంబులు. చాక్షుసాపగా
నీరముఁ గ్రోలి, శీతగిరి నిర్ఝరులన్ జలకంబులాడి, దు
ర్వార యశోన్వితన్ గపిలవస్తుచు దాఁటి, నిజాశ్వికాళితోఁ
జేరఁగ నిన్, బ్రమోదమునఁ జిల్కవె శీకరపుష్పవృష్టులన్.

కలశైలాళి వడంకి, యొత్తిగిలి, చేకూర్పంగ రాష్ట్రేధి, ది
క్కులభానేకప ధేనుకల్ మురిసి మ్రొక్కన్, వాలదిగ్ధమ్ములై
జలదశ్రేణులు సంచలింప, నుడుగుచ్ఛ వ్రాత హాస్తంబులై
యిలు చేరన్ గజతాగణంబు గగనం బీడాడె నీ వీచికల్.

నేపాళమ్ము జయించి, మానస సరస్సీరేజసంపూజ మా
యాపుత్త్రోద్భవ లుంబినీ వన పవిత్రావాసమున్ భక్తితో
నా పూతావుల తోడ నింపిన మహాంధ్రాధీశ వీరానుజున్
జూపుల్ పండఁగఁ జూచి పొంగగద, మంజశ్రీని,నీయూర్మికల్.

బౌద్ధమతమ్ము కింపురుష వర్షమునన్, హరివర్షమందు సు
శ్రద్ధగఁ బాదుకొల్పి యల రాజసహోదరుఁడెల్ల విద్యలన్
వృద్ధి యొనర్ప, 'నేల'పురి విశ్వకళాపరిషత్తు—నుర్వికీ
ర్త్యుద్ధతిఁ గన్న ధన్యకటకోపమ—నిల్పె 'టిబెట్టు' సీమలోన్.

క. ఆ సందర్భాదులలో
నీ సలిలము లందుఁ దోఁగి నిరతము విజయ
శ్రీ సాధించిరి వారా
నే సలిలము లీయఁగదె త్రినేత్రున కిచటన్.

మహాక్కర: ఆ రోజు లేగినపిదప నాంధ్ర పల్లవు లేలునాఁడు
మారాకు తొడిగిన గున్నమామిడిచెట్టట్టు లెసఁగి
యారామపంచకంబందు నమరేశ్వరంబయ్యె పురము
భూరి దీర్ఘమగు లింగంబు పొలుపొంద నమరేశు పేర.

ఆయమరావతిన్ గడచి, యాదిమశక్తి వసించు క్షేత్రముల్
వేయియు నెన్నిదింట జన విశ్రుతమౌ బెజవాడ యందుఁ జే
దోయిని నర్ఘ్యమున్ గనకదుర్గ కొసంగెదు, స్వర్ణరాశితో
నేయమ మాపుమేర వఱకీ యిల నింపునొ తత్సునేత్రకున్.

తే. గీ. అగ్నిపర్వత మింద్రకీలాద్రి మున్ను;
మల యుడుకు తగ్గె నీ రాక చలువ కతన,
పానకము బిందెలుగఁ దెచ్చి పట్టుకుండ;
నట్టి కృష్ణమ్మ! జలము లీ హరునకిమ్మ

ఆటాక్కర: మున్ను పార్థుఁడు తపంబు నిటఁ జేయ
బన్నగధరుఁ డిచ్చెఁ బాశుపతం;

బన్న గసీమ మధ్యాక్క-రలం
దున్న శాసనమొక్క-డొప్పు మీఁఱు.

తే. గీ. అచటి కబ్ధికి నడుమను నాంధ్రవిష్ణు
వనెడు 'శా' కులేశుఁడు నిశుంభుని జయించి
యనిలు దిశ శ్రీగిరి, శివుదిశను సుపర్ణి
వఱకు నేలిన శాకుళవాటిఁ జేరి.

సీ. శిర మాంధ్రవిష్ణ్వంఘ్రిసీమ మోపి నిశుంభు
తనువు ప్రాణము నిల్పుకొనిననాఁడు.
బ్రాహువై మొగిని శ్రీ భ్రమరేశ్వరుని, నుజ్జ
యిని భీమకాళేశు, నెల్లలకడ
ద్వారపాలురఁ జేసి, భవదంబువులు వారి
యభ్యంగనంబున కనుపునాఁడు,
బ్రాహువై సైంధవ, వావంతి, కరూశ, మ
హాకోస, లోత్క-లాద్యాంధ్ర రాజ్య
ముల శివ, ధన దానిల దిశాతలములందు
వింధ్యగిరి పంక్తి మాహేంద్ర వితతిఁగలిపి
గోడ కట్టఁగఁ జను శిల్పకోవిదులకుఁ
బ్రజలు రాట్పృథ హారతుల్ పట్టునాఁడు.

సీ. సకలాంధ్ర రాట్శిరోమకుట రత్నజ్యోత్స్న
పేరోలగమ్ముల విరియునాఁడు,
సకలాంధ్ర చతురంగ సైన్యవిన్యాస వా
ర్తలకు వైరులు తల్లడిలిన నాఁడు,

పవనచలితములై పర్ణ, భృంగ, శకుంత
వాహినుల్ జయగీతి పాడునాఁడు,
ఆంధ్రనాయకుని వామాంఘ్ర్యంగుళీరుహా
మఖిల విశ్వమున కీర్తినానాఁడు
సమ్ముదమ్మున శ్రీకాకుళమ్ము దరిసి,
యెగసి, కప్పించి, వంగికుస్వాత్తు పొంగి
దీవెనలు జల్లితీవు ముత్తెంపుసరుల;
తల్లి! కృష్ణమ్మ! నేఁడట్లు తనలిరమ్మ.

క. అనుచుండఁగఁ గాసాకం
బున 'గుళుగుళు' శబ్దములును బుడగలు పొడమెన్;
మనుజుని విలువ జలము లే
చెను కంబము మాడ్కి విభవి చిత్తంబలరన్.

వ. అంతఁ గృష్ణానది పుష్కరిణిఁ జొచ్చెనని యెఱింగి,

కా వే రి

తే. గీ. పిదపఁ దక్షిణ నదులను బిలువ నెంచి
కేలు గీలించి కావేరికిన్ బ్రభుండు
క్షత్రకన్యా! కవేర రాజర్షి పుత్రి!
సహ్యగిరి జూచి పొంగిన శంబరాంగి!

తే. గీ. వింధ్య శిఖరంపు పొడవును వీట బుచ్చి
సాగరమ్ములఁ గుక్కలోఁ ద్రాఁగి విడిచి
తమిళ భాషాబ్ధిమధురిమల్ తఱచి చూచి
నట్టి మౌని యగస్త్యు నిల్లాలవమ్మ.

తే. గీ. నీ జలమ్ముల శంభుని నిత్య పూజ
జరిపి యభిషిక్తుఁ జేయఁ గాసారమందు
నిలువ నర్థించు చున్నాఁడ నిన్ను, గాన,
సాగి రావమ్మ, కావేరి! సహ్యపుత్త్రి.

తే. గీ. కొడగు, మైసూరు, శ్రీరంగ, కుంభకోణ,
తంజపురములు నీ తటస్థమ్ము లగుచు
వాసి గనె నీ కతమ్మున; వాహినీమ!
తల్లి! కావేరి! దయఁ జూచి తరలి రమ్మ.

తే. గీ. తొల్లి మెప్పించి శంభుచేఁ దోయజాత
సూతిచేఁ బొంది వరములు, ఖ్యాతి గంటి
వట్టి కావేరితల్లి! రావమ్మ యనుచు
నా తరంగణి సంతుష్ట యౌా వెలింగె.

## తుంగభద్ర

తే. గీ. అపరగిరి కొమ్మ తుంగభద్రమ్మఁ దలఁచి
శివుని యభిషేకమునకు నను వగు జలమ్మ
లీయు రమ్మని దండంబు లిడియె, కేలు
దోయి జోడించి రామచంద్రుండు భక్తి.

విశుద్ధవిరాటి: గంగాస్నాన మఘంబు లెట్లు పాపున్
తుంగాపానము తోలు దాహ మారీ
తిం, గాసన్ భవదీయ జీవనం బీ
లింగస్వామి తలిర్చ నిచ్చు టొప్పున్.

తే. గీ. కృష్ణరాయాదు లేలి సత్కీర్తి గన్న
విజయనగరమ్ము నీ తుంగవీచికలను
స్నానమాడిన నాఁటి యుత్సాహగరిమ
తో నెగసి రమ్ము కృష్ణమ్మ తోడఁ గలిసి.

## భీమనది

క. అని, తుంగభద్ర యొడఁబడ
నని మది గ్రహియించి, భీమ యను నదిఁ బ్రార్థిం
చెను విభుఁ డంజలి ఘటియిం
చిన హస్తద్వయము మోపి శిరస్స్థలిపై;

తే. గీ. అల మహారాష్ట్ర కర్ణాటములఁ జెలంగి
తెలుఁగుభువిఁ జేరి, కృష్ణతోఁ గలిసిమెలసి
యొక్కయై యొప్పు భీమమ్మ! యరుగుదెమ్ము,
శివుని సేవకుఁ గాసారసీమ కనుచు.

## తపతి

తే. గీ. భీమ యొడఁబడఁ, దపతిని బిలిచె విభుఁడు
హస్తపద్మమ్ముల నమస్సు లాచరించి.
భాస్కరుని పట్టి! మేటి సంవరణుఁ జెట్ట
పట్టిన తరంగిణీ! రమ్ము భవునిఁ గొలువ.

ఆ. వె. వింధ్యకందరముల విహారక్రమఁ బాసి
సాత్పురాద్రి పొంత సాగి నడచి
సూరతుపురి జేరి సౌరాష్ట్ర మేలిన
సూర్యపుత్త్రి! కొలనిఁ జొరఁ గదమ్మ.

## నర్మద

తే. గీ. అనుచు నొప్పించి; నర్మద నాత్మఁ దలఁచి,
వింధ్య, సాత్పుర, పర్వత వీధులందు
సాగి, భరుకచ్ఛపురి జేరు సాధ్వి వమ్మ
శివున కభిషేకజల మీఁయఁ జెలఁగి రమ్మ.

తే. గీ. రాము నిర్జింప జన్నంబు రావణుండు
నీ తటంబున నొనరింప నీవు భగ్న
పఱచితివి కాదె కల్లోల పంక్తి నంపి?
యట్టి రేవాసరస్వతీ! యమర మిత్ర.

సీ. శశిమౌళి తలనున్న శశధరుపట్టివై
వసుధఁ బుట్టిన చంద్రవంక వీవు;
శౌరి యంశను బుట్టు షట్చక్రవర్తులఁ
బురుకుత్సు పట్టపు తరుణి వీవు;
గంధర్వబాధిత కాకోదరావళి
కభయమిచ్చు నమృతహస్త వీవు;
నాగలోకమునుండి నాథుచే గంధర్వ
లనుఁ దోలఁజేసిన వనితవీవు;

నిన్నుదలఁచిన దొలఁగును పన్నగముల
వలని బాధలు నర్మదా! వారి ధార
లన్ని వేళల నీ తటాంతరమునఁ
గలుపరావమ్మ! నాగలోకము గమించి.

## సరస్వతీ నది

తే. గీ. అనిన, మేఖలకన్యక యాలకించి
సుప్రసన్నతఁ బ్రకటించె విప్రుఁడలర;
నంతట సరస్వతీనది నతఁడు తలఁచి
యంజలించుచు నర్థించె నా స్రవంతి.

క. శివలింగాంతముఁ గంటిన
ను విధాత యనృత వచనమును శపింప శివుం
డు విరించి వాక్కు వీవై
ప్రవహించితివని సరోవరము విడికడకన్.

క. పిదపను విశ్వామిత్రుఁడు
పదిలముగ వశిష్ఠుఁ దెచ్చి వంచింపంగా
నదినునఁ దప్పించితివి, శా
ప దళితవై స్రుక్కితివి, కబంధము లెండన్.

తే. గీ. నాటి నుండి భూమికి నిలోన నదివైతివి
వట్లు సాగి ప్రయాగలో నలరుచుంటి
వఘములను బాపుచుంటి; వీ వరుగు దెంచి
హరుని సేవాపరత ముక్తి నందు మమ్మ!

## సింధు నది

తే. గీ. అని, త్రివేణిని గంగతో యమున తోడ
కలియు నా సరస్వతి మెప్పుదలను బడసి,
యన్ని భారత నదులలో నధికమైన
పొడవు గల సింధునది నతఁ డెడఁదలంచి.

తే. గీ. హిమ శిఖరి పట్టి! కారకోరమును, హిందు
కుశములనుఁ దట్టి, కైలాసకూట మరసి
లడఖ, కాశ్మీర, పాంచాల, లాట, సింధు
దేశములఁ బొల్చు సింధునదీ! నమస్సు.

మధ్యా: భ్రమరాంబ మల్లనల్ క్రౌంచపర్వతస్థలిని శ్రీశైల
సమతలంబునను గాంధార సామీప్యవాసులై యుండ
సుమరజోమిశ్రితంబైన శుభ్రోదకాభిషేకముల
విమల హృద్భావ బిల్వదళవిసర పూజలఁ దన్పితీవు.

వ. భారత చారిత్రక సాంప్రదాయాది విశేషములచే విఖ్యాత
ప్రాంతవై హైందవమత, సంస్కృతీ, విజ్ఞాన శ్రేణి నీ
పావన నామధారణచే ధన్యమై మించ నుద్వేగంబునం
బ్రవహించు శంబర భవానీ!

తే. గీ. భరత భూభాగమున వెల్లివిరిసినట్టి
తొంటి నాగరకత లెన్నొ దోఁగు విస్మృ
తమ్ములై నీయొడి; వెలికిఁ దరలు నెపుడొ?
అట్టి యెఱుకకు నాందిగా నాంధ్రభువికి.

సీ. కాశ్మీర చందన, కస్తూరి, కాగురుల్,
బహువిధ తరు లతా పరిమళములు
తక్షశిలాది విద్యాకేంద్ర విజ్ఞాన
మును, హర్షుఁడాదియా ఘనుల విద్య,

పురుషపురాదులౌ పురవరానేక వి
భ్రాజిత బాహ్యవిక్రమ విరూఢి
రంగరించిన పుష్కర ప్రవాహములతో,
శైలప్రపాత నిర్ఝరుల తోడ,

నిత్యము శివాభిషేకమ్ము నెఱప, జలము
లొసఁగ రారమ్మ, నీవు నీ యుపనదులును;
భరత ఖండంపు పశ్చిమ ప్రాంత రాజ్ఞి!
కలితహిమకణ సుశ్రేణి! కంబువేణి!

## యమునా నది

ఆ. వె. అనిన సింధునదియు నంగీకరించిన;
యమునఁ దలఁచె నిజకరముఁ జేర్చి
హలధరుండు, కరుణ హలముతో దివియుట
నెండకుఁడ నెప్పుడెసఁగు నదిని

ఉ. అంబుజ మిత్రుపుత్రిని, కృతాంతుని చెల్లెలి, నంద దేవిశృం
గంబున కుత్తరంపు హిమకా గిరులందుఁ గళింద గోత్ర జా
తంబయి ఢిల్లి,యాగ్రపురి, తాజమహల్, పలు శిల్పరాజి, తీ
రంబునఁ గల్గు వాహినిఁ గరంబు ముదంబున నెంచియిట్లనెన్.

ఆ. వె. ఆదిశక్తి, 'త్రికళ' యమ్మలు మువురుగాఁ
జెలఁగ, వారి లోన 'శివుని శక్తి'
నియతి దప మొనర్చె నీ గర్భగత శంఖ
మందుఁ; దరమె నీ మహత్త్వ మెన్న ?

తే. గీ. వనజనయనుఁడు రాధికా వల్లభుఁడు.
గోప, గో, గోపికల మధ్య, గోకులమున
నందగృహసీమ, బృందావనంబు నందు,
నాడుకొన్నట్టి యాటల నరసి మురిసి.

తే. గీ. మధురలోఁ గంసదైత్యుని వధను గాంచి,
హస్తిపురి వీరసమర విహార మరసి,
బిందుమాధవక్షేత్రము నందుఁ జెలఁగు
పావనీ! యిమ్మె శివునకు జీవనములు.

గంగానది

క. అంగీకృత కాంతుండై
గంగాకూలంకష మది గాంచి, విభుండా
గంగమ్మ నిట్టు లడిగెను
లింగమునకు నిత్యమును సలిలము లొసంగన్.

బలివిధ్వంసకుఁడైన వామనుఁడు విశ్వంబంతటన్ నిండుచో
జలజాతాసనుఁ డయ్యుపేంద్రపదకంజాతంబులన్ నీరధా
రలఁ బ్రక్షాళనఁ జేయఁ బుట్టితివి గీర్వాణాపగా సుందరీ!
విలసత్పుష్కర నిర్ఝరాలయ యశోవిస్తారితోద్యోగవై.

తే. గీ. అంబుజాసను రాయంచ హరుని నంది,
హరిహయుని వారణాశ్వమ్ము లప్సరసలు,
నీ ప్రవాహోదకమ్ముల, నిర్ఝరముల,
స్నాతులగుచుండు చక్కదనాలు నిలుప.

ఆ. వె. రజతశైల మందు రాజిల్లు శ్రీకంఠు
తాప మభ్రగంగ, పాపునదుచు
తుహినగిరికుమారి, తుహినాంశు లోసఁగిరి
సగరు ముమ్మనుమడు సాయ మడుగ.

తే. గీ. అట్టు లందఱ ప్రార్థన లాలకించి
శివుఁడు కైలాస పర్వత శిఖరమందు
నిలువఁ దజ్జటాజూట కేంతల తలమ్ముఁ
జొచ్చి పోయియుఁ జలువయు నిచ్చితీవు.

సీ. సర్వజ్ఞుఁడించుక సడలింపఁ దన జటల్
కైలాస భృగువులఁ గిరులు తిరిగి,
కమనీయ మానస కాసారతటమునఁ
బసిడి హంసలతోడఁ బకుగు లెత్తి,
జహ్నుజన్నపు వీటి సామగానమ్ముతో
కూలంకషధ్వనుల్ మేళవించి,
ప్రాలేయగిరి మేన ప్రతిబింబితంబైన
మేచకాలోచితో మేలమాడి,

సగర తనయుల పాపసంచయముఁ బాప,
పాటలీ, కాశికా, హరిద్వార, వంగ,
మణి, ప్రయాగలఁ జెలఁగు భీష్మజనయిత్రి!
త్రిపథగా! గంగ! భాగీరథీ! నమస్సు.

ఉ. భారతభూమి నీ వలనఁ బావనభాగ్య సమృద్ధిఁగాంచె; నీ
వారిని దోఁగిసన్ రుజలు, పాతకముల్ నశియించె; వేదశా

స్తోరు సమస్తవిద్యలు మహోన్నతినందెను నీతటంబునన్;
జారు శశాంకమౌళి సహచర్యమునన్ వసియింపరమ్మనన్

## సరయూనది

తే. గీ. గంగ యంగీకరించి యాహ్వానంగం గాంచి,
విభుడు సరయూనదిన్ మానోవీధి నిలిపి,
కొండగుహలను దాటుచుం గోనవెడలు
మాయ లేడిని బోలు నిమ్నగకు ననియె.

ఉ. రవివంశేశుల రాజధానియయి యుత్ఫాంశేక్షుభూజాత ప
ల్లవమధ్యంబునం జేనెపట్టలరు లీలన్ నీ తటంబం దయో
ధ్య వయాళింపంగ, రామలక్ష్మణులు నీయందున్ దనుల్
వీడి య
య్యవతారంబులు మాన, భవ్యవగు నిన్నర్థించెదన్
దోయముల్.

## గండకి

తే. గీ. అని, తదంగీకృతి నెఱింగి మనమునందు
బ్రహ్మకాసార మధువు, నేపాళబాల,
ధవళగిరి దండ, 'యేతి' కందర విజృంభి
తాంగి, గంగమ్మ జడపాయ కతండు మొక్కె.

తే. గీ. హరుని వరమున గండకివై జనించి
మాధవు దయ సాలగ్రామమండలంబు
గర్భమునం బుట్టు, హిమశైల కన్యవైన
తులసి తల్లీ! హరునకు నీ సలిలమీవె.

## బ్రహ్మపుత్ర

తే. గీ. అనుచు నర్థించి, గండకి మనసుఁ దెలిసి;
బ్రహ్మపుత్ర నిజాత్మజోఁ బరఁగి విలువఁ
ఉత్తమున నగ్రసుతను నమస్కృతు లొనర్చి
యా కోరి రామచంద్రరావనియె నిట్లు.

తరువోజ : హరి వర్షమునఁ బుట్టి యంబుజసూతి
శాంతనవు డను సద్బ్రాహ్మణుఁ డగ;
సరసిజాసను రాణి శాంతనవుని
భార్య, 'యమోఘ'యై ప్రభవించె నచట;
యిరువుర పట్టివై యెసఁగు శ్రీమంతి!
లామ దేశము, వంగ, కామరూపములు
భరతఖండపు తూర్పుప్రాంతముల్ తడుపు
బ్రహ్మపుత్రానదీ! పావనీ! తల్లి!,

తోదకము : పరశువు చేకొని భార్గవ రాముం
డిరువది యొక్క మహీరణ యాత్రల్
జరిపిన పాపము క్షాళిత మయ్యెన్
సరిదుదకమ్ముల స్నాన మొనర్చెన్.

క. ఒక పాయ గంగలోనను,
నొకటి పయోరాశి లోన, నొగిఁ గలిపిన నీ
వొక పాయ నిచటి పుష్కరి
ణికి దయచేయంగదమ్మ, నిత్యోత్సుకతన్.

## మ హా న ది

తే. గీ. బ్రహ్మపుత్త్రి యొప్పాదలను బడసి యాతఁ
డంజలించి మహానది నడిగె జలము
తూర్పు కనుమలతో నాడు తోయజాక్షి
నుత్కళక్షోణి కుల్లాస మొసఁగు నదిని.

## గో దా వ రి

తే. గీ. అమ్మహానది యంగీకృతమ్ముఁ గొనుచు
గౌతమికి కరద్వయము సంఘటిత పఱచి
యభ్రగంగాతరంగిణి, వాంధ్రభూమి
కమ్మ; విలకెల్ల నన్నపూర్ణాంబ వీవు.

క. మేదిని కౌర్వానల కీ
లా దహన ప్రమాదముజ్వలం బయ్యె ననన్
ద్వాదశ వర్ష క్షామము
పాదుకొనె నొకప్పు డెల్ల ప్రాణులు వణకన్.

ఎక్కడపైరు లక్కడనె యెండి నశించెను; క్షుత్పిపాసలన్
జిక్కి జనంబులేవి త మచేతులకందిన, వానిమ్రింగుచున్,
మెక్కుచు మట్టిముద్దలను, మేయుచునాకుల నెట్టులెట్టులో
ముక్కున బ్రాణముంచుకొని, మూల్గుచుఁ, గుందికృశించు
చుండగన్.

క. గౌతమముని భాగ్యము చే
నాతని యాశ్రమ సమీప మతి సుక్షేత్రం
బై తనరఁగ, మును లెల్లరు
గౌతము నతిథులుగఁ గడు సుఖమున నుండన్.

ఆ. వె. చూచి యోర్వలేని చుప్పనాతి యొకండు
పంపె మాయ గోవు పైరు మేయ;
ధేనువు నదలింప దానిపై గౌతముం
డంబువులకుం జల్ల నావు మడిసె.

తే. గీ. తుంటి దెబ్బకుం బండ్లూడి దొరలినట్టు
లైన, విభ్రాంతుండై, యతండభ్రదీర్ఘ
కాధరుని గూర్చి ప్రార్థింపం, గరుణ నిచ్చె
వెఱికి యొక జట గోవుపైం బిండు మనుచు.

తే. గీ. ఆ కపర్ది జటాజనితాంబుధారం
దడిసి, బ్రదికెను గోవు; గోదావరి యనం
బరంగి యా ధార యొక మహావాహినిను
తల్లియై భూమి బ్రవహించి, ధరణిం దనిపె.

తే. గీ. త్ర్యంబక క్షేత్ర సంగతిం దనివి చెంది,
యేక పత్నీవ్రతమ్మున కెగ్గుదలంచు
శూర్పణఖ ముక్కుం గోసినచోటు దాంటి,
యాంధ్ర భూమికిం జనుదెంచి యా స్రవంతి.

తే. గీ. భద్రగిరిరాము పాదముల్ భక్తిం గొలిచి,
పాపి కొండల మధ్య రాపాడి యెగసి,
గోవు పాదాల క్షేత్రము, కోటిపల్లి,
నడుమ రాజమహేంద్రమునను వెలంగె.

తే. గీ. కాటకముపోయె; సస్యముల్ నీడు కతన
కొల్లలై పండె భూజను లుల్లసిలంగ ;

నట్టి సుశ్లోక వన్నపూర్ణాంబవైన
గౌతమీ! నీకు నా నమస్కార శతము.

తే. గీ. ఆంధ్ర చిత్రకళాప్రౌఢి కాలవాల
మగు నజంత యెల్లోరలు నాంధ్రయాద
రాజ్య గృహము ప్రతిష్ఠాన రమ్యపురము
ఖ్యాతి గాంచెను నీపజ్జ నవతరించి.

మధ్యా: రాజరాజనరేంద్రుడు డెద్ది రాజధానిగ రాజ్యమేలె,
రాజహంసము నలునికడ వ్రాలినటుల భారతమును
రాజిలఁజేసెఁదెలుఁగున ప్రౌఢితో నన్నయ్యయెచట,
రాజమహేంద్రవరమది; ప్రాభవమందె నీకతన.

వ. మఱియుఁ దొల్లి నీ తీరసమీపమున దక్షుం డొనర్చిన జన్నమున నిరాదరణక్లేశమానయై దాక్షాయణి యాత్మాహుతయైన, శంభుం డయ్యధ్వరధ్వంసంబొనర్చి విరాగియై చరించె.

తే. గీ. అపుడు దాక్షాయణీభస్మ మస్తికలును
నీ జలస్పర్శ శైలజయై జనింప,
హరుఁడు వైరాగ్య మేది గృహస్థుఁడయ్యె
తరమె పొగడగ నిన్ను? గోదావరమ్మ!

శా. అమ్మా! గౌతమి!నప్రమాన లోకమైయుద్ధరింప,నుత్సాహివై
సమ్మోదాయతమానసోత్పలమునన్ జంద్రార్ధచూడామణీ
ధమ్మిల్లమ్మునఁబూజలందనిపి, యుద్యద్వారి ధారాభిషే
కమ్మాశాసునకీవొనర్పఁ జనుటల్ గాన్పించెనానెమ్మదిన్.

శా. ఆమాసేంద్రుల వెంట నేగి యుల దక్షారామ భీమేశ్వర
స్వామిన్ స్నానమ్ముజాభిషేక పరితుష్టస్వాంతుఁగావింప, నా
వ్యోమతమ్నాతలపర్తి తామలపయః పూర్ణప్రహాదాస్తోకవా
వీ మర్యాదనొసంగు మాశివుకకేన్ సీరప్రవాహోద్ధతిన్.

తే. గీ. సప్త గోదావరమున శాశ్వత నివాస
మేర్పఱచుకొన్న రీతి నీ విచటి దేవ
ఖాతమందున నెలకొమ్ము గౌతమాంబ!
సకల పావన ప్రోదినీ సహిత వగుచు.

తే. గీ. అనిన, గోదావరమ్మ ధరామరేంద్రు
హృదయ కాసార పద్మమై యిచటి యంబు
జాకరమ్మున నెలకొని హరుని సేవ
లెలమి చేయఁగ నుప్పొంగి యెగసి వచ్చె.

ఇతరపవిత్ర నదులు

తే. గీ. చంద్రభాగ, వేత్రవతి, కుశను, హరిద్ర,
శోణ, పెన్న, శరావతి, ప్రాణహితల,
బాహుదా, శతద్రు, తామ్రపర్ణి, నీల,
పాలవేణు, నైరావతిఁ, జంప నదిని.

తే. గీ. ఏబదియు నాఱు దేశాల నెసఁగు నదుల,
నేడు దీవుల నలరారు నితర పావ
నాపగా, హ్రద, ప్రస్రవణాబ్ధి వితతిఁ
దలఁచి కోనేటవసియింపఁ బిలిచె నతఁడు.

తే. గీ. అనియె నప్పుడు కృష్ణః యో, యాప్తవర్య!
భర్తయైన సముద్రుని పజ్జఁ గూర్చి

తక్క చెల్లెండ్రతోఁ గూడి యాట పాట
లాడి పాడుచు శివుఁ గొల్చు నట్టి చోటు.

తే. గీ. అక్క గోకము యను దెంచె; నన్ని యితర
జలము లిట మాఘబహుళ దశమికిఁ జేరఁ
దత్పవిత్రోదకములు వాగ్దానమిచ్చె
ననెను కృష్ణను వినిరి కథా స్తనియె నతఁడు.

చ. అను వసుధామరాలయ ముఖాంగణకోచిత దీపమాలికా
జనితవిశుద్ధకర్బుర విశంకట కాంతిమయూఖ పుంజమో
యనఁగఁ బృథగ్విధప్రవహితాపగలన్నియునాత్మదోచిమే
మనిశమునిల్తు మీహ్రదమునందని బాసయొనర్చెనొక్కపై

## సర్వకూలంకషాగమనము

వ. పిమ్మట మాఘ బహుళ దశమినాఁటి ప్రభాతసమయమున
గోటి రామచంద్రుండునాగేశ్వరకుండంబున సుస్నాతుఁడై

ఉ. చేసి పునర్నమస్కృతు లశేషపవిత్రతరంగిణీమణీ
భాసురమూర్తిమండలి కవశ్యముగా శివరాత్రిముందటన్
వాసర కల్యమందిటకు వచ్చుట తప్పవు నేఁడటంచు వి
చ్చేసిన నిమ్నగాద్వయము చెంగటనిల్చెనుయుక్తవేళకున్

క. మొలలోఁతు జలమునందున
నిలువంబడి యాండు న్న నిముసంబున నీ
యిలఁ గల సర్వసరిజ్జల
ముల సవ్వడు లెగసి శ్రవణపుటముల సోకన్.

వ. తత్క్షణంబ తఁడు తటాకాంచలంబునకుం జని యాలో
కించు నెడ,

తరలము :

గగనవాహిని యంబరంబున గాంచి యీ మహితోద్ధతిన్
భగిములార ! శివాభిషేచనభాగ్య మా వసుధామరుం
డగు కొఠీకుల రామచంద్రు సహాయ్య సంపదఁ గల్గె; నా
నగుణు స్నానము నడ్డఁబోకుఁడు; చయ్యనంజనుఁ డొప్పఁగన్.

మణిమాల :

అని, యింపుగాఁ బలికి, యున్న యాపగలు వెంటనంటి నడువం
గ నభస్రవంతి యిట దేవఖాతమునుఁ జొచ్చె నిమ్నగలతో,
వనముల్ సరోవరమునందు వాయుహతినూఁగ, వీచికలు తే
ల, నిలాసురాప్లవబృహత్కలాపములు సాగుగాతయనుచున్

మత్తకోకిల:

ఇందుమౌళి ప్రతిష్ఠఁ గైకొను నిందటంచు నెఱింగి సం
క్రందనుండు సహస్రలోచన కంజపుష్ప వరాటకా
నంద భావ్యసుధల్ స్రవించెనొనాఁగనొప్పె సరోవరం;
బందు పుణ్య తరంగిణీ సలిలౌఘముల్ ప్రవహింపగన్.

పాల్కుడలి రాక

వ. అట్టి సమయంబున

జ్వాలదర్క ప్రతిమాన తేజుఁడు నభస్వద్వేగుఁ డుర్వీసురుం,
డలఘుంబోధి గభీరుఁ డొక్కఁడనెఁ బ్రత్యక్షమ్ముగానిల్చి, యీ
యిల రత్నాకర ముఖ్యసప్తకమునన్ నే షష్ఠమాపోనిధిన్,
గలశాంభోనిధియందు రాధ్యులుననున్, గౌరీశ్వరాంఘ్రిప్రియా

క. పిలువని పేరంటమునకుఁ
దలఁపని విందులకు నరుగఁ దలఁతురె బుధుల్!
జలధుల గమి యొడయుండీ
కొలఁదియు నెఱుఁగఁడె యటంచుఁ గోపింపకుమీ.

అంతరాక్కర: అడవి నుపమన్యుఁడను బ్రాహ్మణ కుమారుఁడొ
కఁడు క్షుధార్తి పాలకు క్రుక్క, ఏడ్వఁ బిండి
పిడికెడు కలిపి జనని పిల్లని కిచ్చె; నా
లడవి నెటులఁ దెత్తు నని, యంతల నత్తెడు.

హయగతిరగడ: శివుని గూర్చి చేసె తపము
భువనచయము పొంద భయము;
అష్టమూర్తి యలరి మదిని
సృష్టి చేసె క్షీరనిధిని.

మధురాక్కర: అమృతము నెదలఁ గాంక్షించి, యాహవమును విడిచి
యమరులును; రాక్షసులు మందరాద్రితోఁ జిలుక, నా దే
హము పులకరించె; నింతలో హాలహాల మహోగ్ర వి
షము జనింప, మ్రింగి శివుఁడాక్షణమునఁ గాచెనన్ను.

అల్పాక్కర: కలకాల మీయుమా కాంతు క్షీర
మ్ముల నిత్య మభిషేకము లొసర్ప నీ
కొలనున నిలువఁగఁ గోరెదను;
కలుగునె శాంతి, రాకకుఁదలఁగక్.

తే. గీ. కాన, నాగేశు కుండంపు గర్భసీమ
యందిరవుఁ గూర్పు; మడుగుట యొందు కనిన,

దెఱచి యున్నంత మాత్రాన తెరువు తలుపు
చెల్లునే సెలవొందక నిల్లు చొరుట?

అన,విని,యాశోకీంద్రుడు సుధాంబుధిమూర్తికినంజలించి, పావనమగు నీ యనుగ్రహముభాగ్యవిశేషము నాకు;శంభుడున్ ఘనమునదృష్టి మోదములమాటికిమాటికి నుబ్బిపొంగఁ గన్గొని చనవుల్ మఱందికగుమన్ననలున్ గురియింతురాపగల్

క. ఇటు నిను బిలువని లోపము,
నటు శివు నెదనుండు లోటు, నభిషేకములం
గటుపై పాడచూపు వెలితి
చిటుకలలో నీ విశాలచిత్తము తీర్చెన్.

సీ. తెరవెఱుంగక దేలు చిఱుతెప్ప కైవడి,
బెదరు చూపుల చేపపిల్ల మాడ్కి,
సర్వోత్తముఁడు హరి శయనించె వటపత్ర
శాయియై యే యురఃస్థలము నందు;
ఫుల్ల హల్లక, కైరవోల్లసన్మంజుల
మ్ములు, మీఁగడల్, కల్పఫలములట్లు,
జనియించె సిరి దేవి, చందమామయు, నమృ
తము, రత్నరాసు లే తనువు నుండి;

పెను తిమింగిలముల వోలె జనన మందె
తెల్ల కరియు, నశ్వము, కామధేను వెందు;
వెడలె శైవాలమయి కల్పవృక్ష మేడ;
నా సుధాబ్ధికి సాష్టాంగ మాచరింతు.

తే. గీ. అల్లుఁ డయ్యెను శ్రీవిష్ణువంత వాఁడు;
తారకావళి కోడండ్ర వార మయ్యె;
ఘనముగా గాక నిను గూర్చి దినము కొఱఁత;
యిట్టి సదదృష్ట మెసఁగునే యేరికైన?

వ. అని స్వాగతము పల్కుతఱి సకల తటినీవ్రజ మేక గ్రీవంబై పాల్కడలి నుద్దేశించి; నిను పిలువని లోప మీ మహానీయుని యందు లేదు; నీహోరున పిలుపు నీ చెవి సోకదయ్యె నని.

క. శ్వేత ద్వీపపు టొడ్డునఁ
జేతో మోదంబునందు చెలువగు మఱఁదీ!
మాతోడఁ గొంత కాలం
బీ తోయములందు నిలువు మింపొలికింపన్.

క. కడపటఁ బుట్టిన చినత
మ్ముఁడవుగ, మా యన్నగన్న మురిపెపు మేన
ల్లుఁడవుగఁ, గడుపునఁ బుట్టిన
కొడుకవుగా ముచ్చటలను గూర్తుము నీకున్.

తే. గీ. ఎడ తెఱపి లేక యొక చోట నెప్పుడుంట,
మార్పు చోరనీక, యొక ఫక్కి మసలుచుంట,
యాటవిడుపుల కవకాశ మమరకుంట,
మందగిలఁ జేయు మధురిమల్ మనుగడలను,

వ. కాన, యిటనుండుమని తోడ్కొని చనినంత,

## పంచామృతము

తే. గీ. హరి కలంక్రియ, శక్తి కాహారపుష్టి,
హరున కభిషేకమును ప్రీతికరము లనుచు
జల, దధి, ఘృతే, క్షురస చతుస్సాగరములు
వదినలకు నంజలించుచు ప్రహ్లాదముఁ జేరె.

తే. గీ. తేనె గురిసెను మడుగున దేవతరులు,
పంచబాణుఁడు ప్రజ నమ్మవారి దలఁచి
ముందుజాగ్రత్త పూని పూ మొనలఁ జిలికె
పుష్కరిణి నెల్ల ద్రుమలతా పుష్పరసము.

## పుష్కరిణీ ప్రాశస్త్యము

అంతట నాపగాంబుధి విహార చలజ్జలభంగ రంజితో
పాంత సరోవరాభిముఖ పాణి యుగాంబుజకుట్మలోత్కృతా
సంతపథప్రసారిత మహాఘవిదారణ విశ్రుతాపగా
స్వాంతభవప్రణాద వికచత్స్ఫురణ ద్వితయాంతరంగుఁడై.

వినుచుండన్ నభమందు మంగళసుకృద్వీణాకణస్తోమముల్
మొనయన్, దద్గత మైయుశఃపటహసంభూత ద్విరుక్త ధ్వనుల్,
వెనువెంటన్ మహితానురాగజములై, విస్పష్టకల్యాత్మలై
యనులాపామృత వాక్యముల్ మొఱసెధాత్ర్యాదిత్య
కర్ణమ్ములన్.

నవ సంపూర్ణ వినిర్మితం బిచటి శ్రీనాగేశ్వరావాస, మిా
శివు గేహావరణంబునం జెలఁగు రాజీవాకర ప్రౌఢిమల్

శ్రవణప్రీతి వినంగ రండు జనముల్, శంభుండు వాక్రువ్వ, నీ
దివిషద్వర్తక వాగ్విధూపుఖమునన్, దిక్స్వార్థ సంకేశముల్.

సీ. ఎప్పుడు పుట్టెనో యిచట నాగేశ్వరుం
డీ దేవఖాతమ్ము నెలమి పుట్టె,
నే నాగకన్యలీ కోనేట జలకమ్ము
లాడిరి, రాణులై రందమునను;
తత్క్షణ వైవాహ, దాంపత్య సౌఖ్యమ్ము
లరచేతి మధుర పాయసము లయ్యె;
నే భక్తసమవాయ మీ పుష్కరిణిఁ దోఁగ
నలరెను రజతాద్రి హరుని చెంత,

గాటపుగు కోర్కె మనమున నాటుకొన్న
మెవ్వరే స్నాన మొనరింతు రీ సరోవ
రమున, నా కోర్కె సఫలమౌ రయము మీరఁ
బడయుదురు భక్తి కెనయగు ప్రతిఫలమ్ము.

పావన వాహినీవ్రజ మపాంపతి గేహము నందు వోలె, నీ
దేవసరోవరస్థలి విధేయములై యొసఁగున్ గపర్దికిన్
గావున, పూర్వపున్ హ్రదముగాంచెశతాధికమైనశక్తి, పు
ణ్యావహమై తటాకము మహా మహిమాన్వితమై విరాజిలున్.

క. నాగేశ్వరు పేరున నిది
నాగేశ్వర కుండ మనెడు నామము దాల్చెన్;
భూగోళ సర్వ తటినీ
పూగోదక మెపుడు తరుగఁ బోవదు దీనన్.

తే. గీ. అతి రోమాదకమైన యీ హ్రదము నిండి
యుండునప్పుడు నాగేశ్వరుండు వెలయు
గర్భ గృహమందు నీరమ్ము కానఁబడును;
గుడిని తడి యారు, నీరు కుండమునఁ దఱుఁగ.

క. లోనికిఁ దీర్థముఁ గ్రోలిన,
స్నాన మొనర్చినను, బ్రోక్షణంబున నైనన్,
గానంబడు పుష్కరిణీ
పానీయ మహాత్మ్య మతులభాగ్యప్రదమై.

క. అను శివు ద్వారు క్త డమరుక
నినదమ్ములు దూర మేగ, నిర్మలహృదయం
బున నీశు నిల్పి స్తోత్రము
లొనరించెఁ గొఱిందుఁడంత నుత్సాహమునన్.

వ. అట్లు పంచామృత సహితంబును,సకల పుణ్యనదీనద పంచ సాగర సారప్రపూర్ణంబును ప్రోక్షణ, స్నాన, తీర్థసేవన మాత్రంబున నిఖిల భాగ్యప్రదంబును, సర్వాభీష్ట ఫల దాయకంబును, మనోవాంఛిత మోక్షసిద్ధి కరంబును నగు శ్రీ నాగేశ్వర కుండంబును చిత్తముప్పొంగం గొఱిందుండు తిలకించి యందు సుస్నాతుండై, తీర్థంబుం గొని,

తే. గీ. సంతతానంద మంతరిక్షమ్ము నంట
ధన్యవాదము లొనరించి ధరణీ సురుఁడు;
రయమగుత మహాశివరాత్రి రాక యనుచు
లెక్క పెట్టంగఁ దొడఁగె నొక్కొక్కదినము.

## ఆశ్వాసాంతము

మధురాక్కర : మృడుని లింగమ్ముతో నబ్ధి మేఖలాస్థలినిబుట్టి
పుడమి నఖల సరిత్తోయ పూర్ణమా చెఱువు పొంత
విడిసి, నంది, శివా, స్కంద, విఘ్నేశ యుతుండవౌచు
నడరు బందరు నాగేశ్వరాఖ్య ! కోటీంద్ర నాథ !

క. ఏ గోడు లేక, పుడమిని
దాఁగిన లింగఁడవు నేఁడు ధరపై గుడిలో
నాగేశ్వరకుండము కడ
భూగోళము నెల్ల బ్రోవఁ బొలుపరు దేవా !

మాలిని : అమల వసుమతీ ధన్యంబు నిత్యాభిషిక్తా !
అమరసమ కోటీ వంశాబ్ధి జైవాతృక స్వాం
త మణిగణ మహాద్రీ ! ద్వాదశాదిత్య తేజా !
హిమశిఖరి సుతేశా ! యీశ ! నాగేశ్వరాఖ్యా !

గద్యము : ఇది శ్రీ శ్రీవత్సగోత్రాంతర్గత తేకుమళ్లాన్వయ సంజ
నిత రాజగోపాలరావుతనూభవ రామచంద్రరావునామ
ధేయ ప్రణీతంబైన శ్రీ బాలా త్రిపురసుందరీ సహిత
శ్రీ నాగేశ్వరమాహాత్మ్యంబునందు చతుర్థాశ్వాసము.

మంగళమ్ మహత్. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత
# శ్రీ నాగేశ్వర మాహాత్మ్యము

---

## పంచమాశ్వాసము

క. శ్రీరామ సంప్రతిష్ఠితుఁ
డౌ రామేశ్వరుని భాతి నలరుచుఁ, దెలుగుం
ధారుణి నొప్పెసలారెడు
గౌరీనాగేశ్వరాఖ్య! కరుణాభరణా!

క. దేవా! త్రిపురాంబాదులు
నీవును గైకొని ప్రతిష్ఠ నిలిచితిరెటు లే
కోవెలఁ దత్కథను మనవి
గావింతును: దయను వినుము గౌరీరమణా!

తే. గీ. నేఁటికిని రెండునూఱేండ్లనాఁటి మునుప్రు
చిత్రభానువు వర్షమ్ము చెలఁగునపుడు
మాఘ బహుళ త్రయోదశి మలయు రేయి
నా కొరీ రామచంద్రరావాత్మలోన.

ప్రీతిగ నిందుశేఖరుఁడు తేపటి మాపటి వేళ నీ స్వయం
భూత మహేశు లింగమునఁ బొల్చు సమాహితసుప్రతిష్ఠుఁడై;
నూతన దేవహర్మ్యము మనోహరమై సకుటుంబ భృత్యమా
రీతిఁ దలిర్తు ముందుగను తేపకడన్ దొలిపెట్టి కార్యముల్.

క. అని మనమునఁ గార్యక్రమ
మును నూహించుచుఁ గౌరీ ప్రముఖుఁ డా రేయిన్

మునిగెను కొలఁదిగ నిదురను;
గనియెను కలలెన్నో, యంతఁ గన్నులు తెఱవన్

శి శి ర ఋ తు వు

తే. గీ. కొంతకొంతగ యవని కాభ్యంతరముఁ
కడుగు లిడుచున్న నర్తకి జడను ముకుచు
కొనిన పూచెండు పోలికఁ గులికె శిశిర
యామినీ కాంత జడను శీతాంశు రేఖ.

తే. గీ. పడక, నిదురయుఁ గార్య తత్పరుల కగునె?
యని కొరీ రామచంద్రరా వపుడు లేచి,
దిన విధుల్ దీర్చి యాలయంబునకుఁ జేరె;
వెలయు నిచ్చట శంభుఁ డీ వేళ ననుచు.

సీ. ప్రాలేయ సుమధూళి పలుచగాఁ దెర కట్టె
నాలయ ప్రాంతంపు టన్ని దెసల;
నవని రాలిన పండుటాకు మొత్తము లొప్పె
వడలిన గొజ్జఁగ పాన్పు లట్లు;
సరసి నీరములపై జారి, నిశ్చలములై
శతపత్ర పత్రముల్ జాలు వాఱె;
బాల భానుని లేఁత పసిఁడి నీరెండ లోఁ
జలి కాచుకొనె నగ్న శాఖ చయము;

నిదుర మేల్కొ-నియుఁ గదల మెదల నోప
కున్న గర్భిణి పోలిక నొప్పె బ్రికృతి

భామినీమణి, యించుక బద్ధకముగ;
శంభు జననమ్ము సూచించు సరణి తోఁప.

తే. గీ. మూత పృథ్వీరుహమ్ములు పూఁతఁ దొడిగె;
నుసిరికలు కాచెఁ; గుదురుబ్బెఁ గిసలయములు;
పండ్లు పండెను తింత్రిణీ పాదపములు;
భవుఁడు రానున్న నాఁటి ప్రభాత వేళ.

తే. గీ. అప్పుడా భూమి సురవర్యుఁ డాలయోప
వనమునను దేవపూజకై కోనలు విచ్చి
వేగిరంపడు పూవుల వీధులందు
స్తబక శోభలఁ గాంచుచు సాగి నడచి.

ఆలయవాటికన్ నిజ పదాంబుజ లాంఛన భూషితంబు దృ
గ్జాల సుధాంశు చంద్రికలఁజారు మనోజ్ఞ తరంబొనర్చుచున్
వేలుపు సంప్రతిష్ఠలకు విక్రయమందిన ద్రవ్య మున్నెడన్
శాలిక రాశులన్గని లసద్వికచాననుఁడయ్యెఁ దృప్తితోన్.

విఘ్నేశ్వర ప్రతిష్ఠ

తే. గీ. అంత, హేరంబు, ఘను, వినాయకుఁ, గణేశు,
మొదటఁ బూజింపఁ దగు దేవు మొట్ట మొదట
నా కోశీ రామచంద్రరాయఁడు ప్రతిష్ఠ
చేసె నాగేశ్వరాలయ సీమ వెలుగ.

తెల్లనివాని, విఘ్నములఁ ద్రెంచెడువాని, ప్రసన్న వాక్కురం
జిల్లెడువానిఁ, దెల్లనగు చేలమువానిఁ, జతుర్ధశోర్వ్యలం
దెల్లెడ నొప్పువానిఁ, దెలియేనిక తొండమువాని, సత్కృపల్
జల్లెడువాని, మూషకపు సైంధవ మెక్కెడువాని శంభుజున్.

తే. గీ. విఘ్నకోటుల నీతండు విరచి విసరు
కానసాంతర సలిల జాకరము నందు
మొలచు శతపత్ర సుమ నాళముల మదోత్క
ట మ్మొడిసి, త్రెంచి, కడు దవ్వ చిమ్మునట్లు,

తే. గీ. ఎట్టి విఘ్నము రాకుండ నెల్ల కాల
మిచట పూజాభిషేకమ్ము లెసఁగుగాక
యనుచు బ్రార్థించిఁ చేదోయి నంజలించె;
జనహితమె కాదె తలఁపు సజ్జనుల కెపుడు.

## స్కంద, నందీశ్వరాదుల ప్రతిష్ఠ

అంత బ్రతిష్ఠఁ జేసెను షడాననుఁ భూసురుఁ డర్కకోటి భా
స్వంతుని, శాంతమూర్తి, శిఖివాహను, స్కందుని, గార్తికేయున
త్యంత ముదంబుమీఱఁగఁ; దదాలయమప్పుడు పద్మరాగపుం
గాంతులు చిల్కె, కుడ్యములు ఘుస్రముఖ ప్రతిమానరోచులై.

వ. పిమ్మట యథావిధిగ వీరభద్రుని ప్రతిష్ఠించి, కాలభైరవ
ప్రతిష్ఠగావించి, నందీశ్వర సంప్రతిష్ఠ కుపక్రమించి,

భుజంగప్రయాతము:

ప్రతిష్ఠించె భూదేవ వర్యుండు నందిన్
గృతాంత స్వరూపుఁ గిరీశ ధ్వజస్థున్
గ్రతుధ్వంస్యమాత్యున్ హరప్రౌఢవాజిన్
చతుష్పాద ధర్మ ప్రసాద ప్రభావున్.

శాలిని: నందీశున్ గానంగ వచ్చెన్ బ్రదోషం
బందానందం బంది, గోధూళి రేఁగన్

సౌందర్యోద్యత్సాంద్రోర్మి వర్జితంబై
మందానిలోన్నత మార్గ మందంబు చిందగ.

జానకీదేవి ఆగమనము

తే. గీ. పగటి కార్యక్రమంబున భర్తతోడ
పాలుగొని యింటికేగిన ప్రభుని భార్య
జానకీబాయి నాయాహ్ని స్నాన మాచ
రించి 'యంబామునా' నధిష్ఠించి వచ్చె.

తే. గీ. మొల నరుణ మేఖలయు, భుజమున డవాలు
శిరమునను పాగ, చేత కౌక్షేయకంబు
గల జవానులు రాజమార్గంబునందుఁ
బార్శ్వముల, ముందు వెనుకల, బలసి నడువ,

తే. గీ. ఊరికెల్లను దల్లియై యొప్పు చాన
విశ్వమంతకుఁ దల్లియై వెలయు గౌరి
నామె వల్లభుఁ బూజింప నరుగుచుండె.
నని, కరాంజలు లిడిరింతి కళల జనులు.

తే. గీ. రవిక, లాగూలు శోణ వర్ణంబు లీన,
బిగువు పైటలు పచ్చల నిగలు చిమ్మ,
కత్తులొరదాఁచి పరిచారికా ద్వయమ్ము
తెలిచి మేనాతలుపు నిరుదెసల నిలువ,

క. మెల్లగ మేనా దిగి, యా
ఫుల్లేందీవర దళాక్షి, ముకుళిత కరముల్
మల్లెలు, మౌక్తిక కాంతులు
చల్లఁగ, రాయంచవోలె చనె లోపలకున్.

సీ. నాతి చక్కదనమ్మునకు నోడి శశిదాఁగె,
చనె సక్కఁ డతివ ప్రజ్ఞతకు బెదరి,
సుదతి గభీరతకుదధి దవ్వున కేగె,
నిల వంగె సిగ్గున నెలత క్షమకు,
కని చాన పతిభక్తి వహ్ని జొచ్చె నసూయ,
బోసి చేసె గణేశుఁ బొలతి వినయ
మువిద యీగికి స్రుక్కి దివిఁ జేరె సురశాఖి,
వెల్లనయ్యె సురభి వెలది దయకు,

తన్వి దైవభక్తి తనభక్తి కెనయైన
వైచె కుప్పిగంతు వాయుపుత్రుఁ
డిట్టి రూప. గుణము లెట్టుల కూర్చెనో
తమ్మిచూలి యొక్క తరుణి లోన!

తే. గీ. తైల మాముదంబునుఁ బ్రమిదలను బోసి
వత్తులను చాల వెలిగింపఁ, బగలువోలె
నలరె నాలయ మారేయి, నభ్రసీమ
వెలుగు తారలు గుడిలోన వెలిగినట్లు.

## శ్రీబాలాత్రిపురసుందరీ ప్రతిష్ఠ

తే. గీ. అంత, బాలా త్రిపుర సుందరాంబ, నుమను,
నంబికను, సర్వమంగళ, నన్నపూర్ణ,
సంప్రతిష్ఠింప నా కోటీశ్వరుఁడు, సతియుఁ
నాత్మనాప్వాంగి యాసీనులైన వేళ.

వ. దేవి విగ్రహ పీఠమ్ము చుట్టును జానకీబాయమ్మ పసుపుఁ
జల్లి దానిపైఁ గుంకుమ నొత్తుగా పోసి దండమిడియె.

కాపది: అంతఁ గోడీ వంశాబ్ధి శశాంకుం
డింతియు వేగం బిందుశిలా రూ
పాంతర సన్మూర్త్యైక్యత గౌరీ
కాంత గొనంగన్ మదిఁ గోరన్.

సమహా నీగుడితోడ, నాంధ్ర భువినా జన్మస్థలం బౌటచే,
హిమశైలాయత కేళికా స్థలములున్, హృద్యాంతరితాపగా
రమణీయోద్ధవ కూల సైకత విహార ప్రత్న చైతర్ధికా
సముదాయంబులు, కేళిలోలవిలసజ్జాంబూనదీతోయముల్.

అంతియకాక, నాహృదయమంతయుఁ దానగు విశ్వనాథుఁడ
శ్రాంతము నిల్వఁగోరె నిట సంతత పూజలనందుకొంచు, నీ
ప్రాంతము వెండికొండవలెరాజిలు నంచును, నైక్యమయ్యెన
త్యంతముదంబునన్ నిజసమంచిత విగ్రహరమ్యమూర్తిలోన్.

సీ. కారుమబ్బులతోఁ శిరోరుహమ్ములు కూర్చి,
నల్లని ఫణులతో నల్లి వేణి,
రెండు భ్రూలత లిక్షుదండంబుల నొనర్చి,
యలక లిందిందిరంబుల నమర్చి,
తెలితామరల, నల్లకలువలఁ గనులను,
పుష్పాంబకములఁ జూపులను మలఁచి,
ఘనసారమునఁ జెక్కుటద్దముల్ పచరించి,
మొగ్గ సంపెంగతో ముక్కుఁ దీర్చి,

గళము దక్షిణావర్త శంఖమున మలచి,
లలిత సుమవల్లికల బాహులతలు పేని,
మెఱపుఁదీగను సంపెంగ పరిమళమునఁ
బొదిగి చేసిన బంగారు బొమ్మ వోలె

బాలా త్రిపుర సుందరీ రమణి నిల్వన్ జెల్వు సారించియా
వ్యాలోలాంబకఁ గన్నులారఁగని, స్వర్యాతాయన శ్రేణులం
దాలేఖ్యవ్రజముల్ త్రికోటు లిఁక నార్యానాథుఁడుం బోల్పునేఁ
డాలోకింతము రండటంచుఁ బయనంబై రాంధ్రసుశ్రోణికిన్.

క. రోలంబ, జంబు, దిగ్గజ,
నీలాంబుజ, నీర దేంద్రనీలమణిశిలా,
కాలాగురు, వేణుల, వలె
బాలా త్రిపురాంబ శ్యామ భాసుర యగుచున్.

క. క్షీరాబ్ధిభంగ, వికసిత
కైరవ కాసార, మౌక్తిక ద్యుతి మాలా,
శారద రాకాకౌముది,
తీరున స్మేర ప్రవాళ దీపితయైనన్.

తే.గీ. నగవు నిగలకుఁ జెదరిని నరుల కనులు
చెలువ చెలువమ్ము చూచి నిశ్చేష్టమయ్యె;
తత్ప్రమోదోద్భవ మగు నిద్ర యొడిఁ దోఁగి
జనతతి, యరజామునకుఁ గోల్కొనియె స్పృహను.

వ. ఇంతలోన :

తే. గీ. ఆ యమాయక లోచన నద్రిబాల
ముగ్ధమోహన లావణ్యమూర్తిఁ గాంచి,

జానకీ బాయి చేతులు చాఁచి పిలిచెఁ
గొమ్మ! యొడిలోని కొక సారి రమ్మటంచు.

మాతృపయస్సుకై పఱచుమాడ్కి హిమాద్రిజచేరెనంతటన్
శీతప్రవాళముల్ మెఱయు లీల నవారుణ భాసురంబులై
నూతన పిప్పలచ్ఛద మనోజ్ఞములౌ చలితాధరద్వయీ
జాత దరస్మితామృతము జల్లుచుఁ జానకి యంక దేశముస్.

తే. గీ. కౌఁగిటఁ గదించి, వక్షు యుగ్మమున హత్తి,
ముద్దు చెక్కిళ్ళఁ జుంబన ముద్రలుంచి,
సుమనసాలోకనమ్ములఁ జూచి, చూచి,
తనివి కానక, కను లమృతములు కురియ.

బాలా! యొక్కడనుంటి వింతదనుకన్? స్వప్నప్రపంచంబులన్,
నీలాకాశ, చలద్ర వీందు, చపలానీక, చ్ఛవిశ్రేణులన్,
బాలక్రీడల, సాలభంజికలఁ, బుష్పశ్రేణిలో, షట్పదీ
లీలాగీతులఁ, బూవుదేవియలఁ దల్లీ! నిన్నుఁ గాంక్షించితిన్.

అనుకంపన్ ఫలియింపఁ జేసితివి నా యన్వేషణల్ నేటికో
తనయా! ఇంకిట నోమధీవిభు కళాధమ్మిల్లు నాగేశ్వరున్.
జన బృందారక, భోగిమండలులకున్ సంసేవ్యునిన్ గూడి పా
వన సౌభాగ్య సమస్తమంగళములున్ ప్రాప్తింపసంతోషివై

తే. గీ. సర్వకాలము సుఖయింపు సన్నుతాంగి
యనుచు జానకీ బాయమ్మ యద్రిసుతకు
నిగనిగలు చిమ్ము క్రొంగ్రొత్త నగలు తొడిగి
ముద్దులిడి, మాటిమాటికి మోము నిమిరి

క. కనుఁగొంటిరె, యీ సొబగులు ?
కనుఁగొంటిరె, వీనిలోని కమ్మదనంబుల్ ?
మన యమ్మఁడిదిగొ కొనుఁడని
తన భర్తకు జానకమ్మ తనయ నొసంగెన్.

క. చనవున నతఁడును బాలాం
బను గారాబం బొనర్చి పండెను కోర్కుల్
మనభాగ్యము, పుణ్యము, తప
మని పొంగి, యొసంగె బాల నాత్మేశ్వరికిన్.

తే. గీ. కలిత ముఖ హాస్త లోచన. కమల మగుచు,
బాలికామణి నాళీక పాణి వలయు
మతివ గళసీమ నంభోజహార లీల
జెలఁగ నాలింగిత నితంబ పులిన యగుచు

నవపుల్లోత్పల మాతృనేత్రముల జ్యోత్స్నారోపముల్
స్వీయ దృ
గ్భవజై వాత్సల్యతూణ సాంద్రములుగప్పన్ మేనకా పుత్రివా
గ్నవనీతంబులు చింద నాకుసెలవింకం; బోయి యీయింటిలో
నవతంసేందుకళావిలాసుఁడును నేనమ్మా!నిల్తుమ శ్రాంతముగ్.

వ. అనిన జానకీబాయమ్మ,

మధ్యా: మదిలోన వెల్లుబికి పొంగు మాతృత్వభావమ్ముపిరియు
హృదయమ్మునకుఁ బాలనదిమి. యేటికీ తొందరల్? తల్లి!
వదలంగలేనైతి నిన్ను; వదన కపోలముల్ నుదురు
పెదవులును చిబుకమ్ము శిరము ప్రీతిగా ముద్దాడనిమ్ము.

వ. అని ముద్దాడుచుండఁ గొంత తడవున కా బాలికామణి

అంతరాక్కార: పుట్టుదును కలలోన మున్ననినయట్టు:
లిట్టులగు శీఘ్రముగ; మహేశ్వరుని, నన్ను
నిట్టులఁపు భక్తిఁ బతియు నీవుఁ బ్రతిష్ఠింప,
నిట్టిపడుఁ గోర్కెల ఫల ముద్ధర్ష ముగను.

తే. గీ. ఎప్పుడు కోరిన నపుడె మీ యింట నుందు;
నన్ను వీవేము; సెలవిచ్చి యనుపుమనుచుఁ
బలికి, యల్లనఁ దన శిలా ప్రతిమ యందు
లీనమయ్యెను శంభునిలేమ యపుడు.

కిసలయపల్లరీ కుసుమ కృత్త దళంబులఁ బూన్చి చేసి, మా
నస సలిలాకర స్థితి మొనర్చిన పూవ్వుల తెప్ప మాడ్కి, భూ
మీసుర వధూరుచిరి విడి మీనసులోచన సాగు వేళ, జం
ఘుసంశోకిన్ వఁల్ కలమగర్భచయమ్ములువంచె నమ్రతన్.

ఆ కాత్యాయని పాదకంజ శుభ రేఖాసిక చిహ్నవళుల్
సోఁకన్ గుంకుమ రాశి, తత్పదరుహాస్త్రోకోడు శోభాఢ్యలన్
బ్రాకృష్టోజ్వల సత్ప్రవాళ లతికా పాదాంగుళీ రోచి, ను
ల్లోకంబయ్యెను కుంకుమం బనుచు నాలోకించి రాదంపతుల్.

క॥ ఈ కుంకుమ సౌభాగ్యద
మీ కుంకుమ సౌఖ్యదంబు, నిష్టార్థదమున్;
శ్రీకరమిది, శీలద మని
యా కుంకుమఁ బొగడి రెదల నాలున్ మగఁడున్.

## రజతాద్రి మీఁద శ్రీ నాగేశ్వరుని తపస్సు

తే. గీ. ఆ కోఠి రామచంద్రరావతని సతియు
నటుల బాలాత్రిపురసుందరాంబ సంప్ర

తిష్ఠ గావించి శంభుఁ డేతేరు కొఱకు
హృదయసీమలు తివిరింప నెదురు చూడ.

తే. గీ. ఆ కొంకి దంపతుల కోర్కు లార్క యెఱిఁగి
యభయహస్తంపు టరుణ కల్హారసీమ
కేసరోపమమైన రేఖికలఁ జిలికి
పద్మరాగ పరాగోరు పరిమళములు.

తే. గీ. భర్తృ సాన్నిధ్యమును మనః ఫలకమందుఁ
జిత్రిత మొనర్చి, భక్తిఁ బూజించి, దృఙ్మ
యూఖ జాలము లాశాంత రేఖ లంట
విశ్వ మెల్లెడ ధవునకై వెదకఁ బఱపఁ

ఉ. ఆ రజతాద్రిమీఁద గహనాంతర నిర్ఝరిణీ లసత్ప్రయో
ధారల తుంపురుల్ సుమవితానములట్టుల పూజచేయు, మి
న్నేఱు మయూరపింఛగతి నింపు ఘటింప జటాకిరీటి, కా
ర్యారమణీ లలామము మహోనటుఁజూచె తపోనిరూఢినిఁ

వెలసెఁ దనంత తానిచట; పృథ్వి వినిర్గతుఁడయ్యె దోఁటలోఁ
బలు పలు రీతులం దెలియబల్కెను సమ్మతి సుప్రతిష్ఠుఁడై
నెలకొని యుంట కీ గుడిని; నేను నెఱుంగుదు; నిట్టిపట్టునన్
దలఁగునె యష్టమూర్తి ? నియతమ్మగు రాకకుఁ దప్పునేర్చునే?

తలఁపఁగ, నేటికార్యచయ తత్పరుఁడై త్రిపురాంతకప్రభుం
డలరెడు నంచుఁదోఁచె; నడియామినివేళకు నాలయంబునన్
నెలకొను; మానవాళి నిటనిత్యము బ్రోవఁగ లింగమూర్తి కు
జ్వలమగు శక్తిఁ గూర్చుటకు సల్పె కపర్ది తపంబు దీక్షమై.

క. అని నిశ్చయించి, ప్రాణే
శుని యేకాగ్ర తపము సతి చూచెడు వేళన్
గను తేఁట్లు ఱెక్కవిచ్చి వ
దనజలజస్మిత మరంద ధారలు చిందన్.

తే. గీ. హైమవతి యేఁడు నాగేశ్వరాలయమ్ము
వెనుకఁ బ్రసరించి చంద్రికా ద్యుజ్ఝరీమ
లచటఁ దారల నడుమ హిమాంశు క్రీతి
నలరు బాలాత్రిపురసుందరాంబఁ గాంచి

తే. గీ. పలుకరింపంగ, నా దేవి పలికె, దేవ!
మన కోఁటి రామచంద్రరావును నదేను
లిచట నీ రాకకై వేచి, రేనుకూడ
హృదయ ముప్పొంగఁ బిలుతుఁ బ్రత్యేకముగను.

శివుని మనుగుడుపులు

తే. గీ. ఏలయన, నేను దక్షుని యింటఁబుట్టి
నపుడు పుట్టిల్లు నేఁటి యీ యాంధ్రభూమి ;
గౌతమీతీర దక్షవాటీ తలమ్ము
ఖ్యాతి బందరు నీకు సంప్రీతిఁ గూర్చు.

తే. గీ. మఱచి యుంటివు నీ తొలింటి మనుగుడుపులు ;
దక్షు గృహమెల్లఁ జూడంగఁ దరలి వెడలి
క్షితి చతుస్సాగరముల దక్షిణ మహాబ్ధి
భాగమగు నాంధ్రవారాశి ప్రక్క నడచి

సీ. చిలుక సరస్సులో జలకేళి సవరించి,
మాహేంద్రగిరి నాడి మంతనములు,
జవ్వాది కొండపై నవ్వు పుష్పాలు చల్లి,
కావేరి యొడ్డునఁ గబురులల్లి,
కోతికొమ్మచ్చి పంపాతటమ్మున నాడి,
తీయని తుంగఁ బాపేరు మాని,
భీమలోఁ దామరల్ వేణిలో బంధించి,
గోజైఁగల్ పెనుగంగ పజ్జ ముడిచి.
వింధ్య శృంగాగ్రముల బాణవృష్టిముంచి,
దండకను సింహ శార్దూల దర్ప మణఁచి,
యా గిరి వనాళి దాఁగుడు లాడి, యోడి
ఘస్ర మొక్కక్షణమ్ముగ గడపి నపుడు.

తే. గీ. మాయ దక్షుని గేహంబు-మన గృహంబు-
నిందుఁ బెద్దది యెవరిది? సుందరాంగి!
యనెడు నీ ప్రశ్న కే నేమి యనక నిలువ,
నఖిల విశ్వమ్ము మన గేహమనుచుఁ జూపి

ఆ. వె. ఇంటికన్న మేటి యిల్లాలు పురుషున
కట్టి నిన్ను దక్షుఁడిచ్చె నాకు;
సర్వశక్తియుతవు సర్వమంగళవైన
నిన్ను గన్న తెలుఁగునేల ఘనము.

ఆ. వె. తనయ తగును తండ్రి దక్షప్రజాపతి,
కతఁడు జనకుఁ డగుట సుతకుఁ దగును;

అనుచు బుజ్జగించి యాడిన మాటలు
మఱపురావు భవము మగుడఁ గొనిన.

తే॥ గీ॥ గౌతమీకృష్ణలనుఁ దోఁగి, కడలి దరిని
నిసుకతిన్నెలఁ గూర్చుండ, నింతలోన
భంగనివహమ్ము కడిగి నీ పాదయుగళి
చిలికె నీటిని నా శీర్షసీమ యందు.

తే. గీ. అప్పుడు నవ్వుచు. నింతటి యాగడములు
పుట్టినింటనె కాని నీ మెట్టినింటి
మానస సరోవరాదులఁ గానఁ బడవు
లెమ్ము; బెదరకు హరిణేక్షణమ్ము లదర.

ఆంధ్ర సముద్రము

ఆ. వె. అనుచుఁ బలుకు నీకు నబ్ధియానముఁ గూర్చు
కడలి లోన నేను పడిన నడపి
ముద్దుకొలుపు తెలుఁగు మున్నీటి సొబగుల
కెనలు కలవె జగతి? ననెడు వేళ.

సీ. ఒకసారి కెరటాల యున్నతాగ్రము లెక్కి
మబ్బు నేస్తుల తోడ మాటలాడు;
నుత్తర క్షణమున నుల్క జారిన మాడ్కి,
నతి వేగమున నధః పతిత మగును;
మఱల విజృంభించి మకుర గుచ్ఛాలపై
స్వారి పోలిక భంగ సంఘమెక్కు;
నింతలో కరియూథ మెదురు సాగిన భంగిఁ
గవయు వీచీశ్రేణి కనులు కప్పు;

చలన మేమియు లేక స్తబ్ధముగఁ నిలుచు,
కదలు నిటునటు నా మఱుక్షణములోన,
షట్పదము లీల రయమున సాగు, మనము
తరలి వెడలిన దోనె సాగరముమీఁద.

క. కల్లోలాంబు ప్రాంతం
బెల్లను గమియించి, దూరమేగిన పిదపన్,
జల్లని చంద్రాతపమున
ఫుల్లేందీవరము పోలె పొలుపెసలారెన్.

గగనతలంబు కన్నులకుఁ గట్టినయట్టుల వారిరాశిలో
నగపడుచుండ, వెన్నెల విహారమొనర్చెడు మీలు నింగిపై
పెగురుచు, క్రిందికింబడుచు, నింపుఘటింప, దిగ్వియద్వనాం
తగణము చక్రమై పుడమితన్వికి మేఖలయట్లు తోఁపఁగన్.

తారకపంక్తులూర్ధ్వ వసుధాతల పట్టణ వజ్రదీపికా
హారములట్లు భాసురములయ్యె. నుడుప్రజఖండ పూర్ణబృం
దారక నిమ్నగా తట సుధాకరుఁ డుజ్జ్వల కౌముదీ రుచుల్
వారిధిపై స్రవించె సురవల్లి పరాగము రాల్చునైవడిన్.

ఆ. వె. నీకు డెంద మపుడు మోదసంభరితమై
మెప్పుమీఁద మెప్పు గుప్పెఁ బైన;
వింతలెల్లఁ జూపి వెనుకకు మరలిన,
నుడుప మాపు మంటి వొక్కచోట.

శివ్వఁ డిట నవతరింతునన్న కథ

మిక్కిలి లోఁతు నీరగుట, మెట్టఘటించి మదాత్మశక్తిచే
నక్కడ బొమ్మలోతు జలమందు నరిత్రముపాతుమంటి ద్రా

డొక్కటి కేనిపాతకము నోడను గూరిచి కట్టుమంటివి; నా
చక్కని నీవొనర్చి యిఁకఁజాలునె? యింకను నాజ్ఞలున్న వే?

అని నను బృచ్ఛచేసి, వికచాంబక సుందరి యుండెయుండగా
మనసు జనించె రేయి, కసమాన హిమాంశు పరాగరోచిలో
వనధి రహర్విశాల విభవంబుల మధ్యను, దక్షపుత్రికా
నన విలస త్త్రిపోత్కలిక నర్మవిలాస ప్రమోద మాధురిన్.

తే. గీ. అనుచు నేవేవొ ముచ్చట లచ్చటలతో
గడపి క్షణదాంత వేళఁ, జుక్కపొడువంగఁ
బ్రాగ్దిశాకాశసీమ, "నో భావజారి!
యరుగుదమె యొడ్డునకు?" కటన్న నంటి వీవు.

ప్లవమీ రేయిని నిల్చె నెక్కడ నటన్ వర్తింతు నిన్ గూడి, యు
ర్ణవ భాగంబు పురంబుగాఁ దనర, విప్రశ్లేష్మనిర్మాణమం
దువివస్వత్సుతుఁడేలునాఁ; డిచటనుందున్ మూఁడువేలేండ్లునే
నవనీపాలన చేయుచున్, జెలువ! యీయాంధ్రాబ్ధితీరంబునన్.

ఆ. వె. ఆ ముహూర్త మిప్పుడే తెంచెఁ బ్రాణేశ,
యంబుజములు రవికి నమరులమృత
మునకుఁ, జాతకములు పూర్ణ చంద్ర జ్యోత్స్న,
కట్లు నీకు వేచి రఖిల జనులు.

తే. గీ. అనుచు బాలా త్రిపుర సుందరాంబ పిలువ,
సతి మగండు, శశాంకుని మద్దుకుండు,
దక్షు జామాత, తన తపః స్థలము వీడి
తత్క్షణమ బయలుదేర నుద్యుక్తుఁడయ్యె.

చిన్నతనంపు టాటలను చిత్తమునన్ స్ఫురియింపఁజేసి ము
న్నెన్నఁడొ భూమిఁ శైశవపుటెల్లలు మీఱని నాఁటి కార్యముల్
నిన్నటి నేఁటి వట్లు మది నింపి ఘటించితి పూర్వ బంధముల్,
పొన్నున వన్నె, వాసనలు పూవుసకట్టుల. నాదు రాకకున్.

ఆ. వె. ఇదిగొ, వచ్చుచుంటి ముదిత! హుటాహుటి;
నాలసింప, భీతహరిణనయన!
యనెడు శివుని మాట కమ్మవారి మనమ్ము
శాంతి నిలయమగుచుఁ గాంతిఁ జిలికె.

శ్రీనాగేశ్వరుని ప్రయాణము

సీ. కోలాహలోరు నిర్ఘోష సంఘాతమ్ము
పలికె ముక్కోటి దేవతల రాక;
వల్లకీ ప్రముఖ వాద్యోల్లాస మెఱిఁగించె
గంధర్వ కిన్న రాగమన వార్త;
మర్మర, శింజిత, మధురాస్ఫుట ధ్వనుల్
తెలిపె పంచాప్సరస్త్రీల జాడ;
నవరత్న మణి కాంతి నివహమ్ము యక్ష సి
ద్ధోరగాగమ్ముల యునికిఁ జూపె;
వరుణ, వాయు, కుబేరాగ్ని వాసవాది
హరిదధిప సంప్రవేశమ్ము లనిలు జవవి
భేదములు తెల్పె; ప్రజల సంప్రీతి విస్మ
యములు వారల నిర్వృత్తి యందుఁ దోఁచె,

సురసంఘమ్ములు పుష్పరాశుల క్రియన్ జూపట్టె; గంధర్వ కి
న్నర యక్షగ్రహ సిద్ధసాధ్యులు శకుంతశ్రేణులై యొప్పె; ఋ

ష్కరగానీకముతోఁ జెంగావచయమ్మై యమాహావళిన్ దృక్ఫలన్
నరబృందమ్ముల కామహేశ్వరవిశన్ నాగేశ్వరేచ్ఛాగతిన్.

తే. గీ. జానకీ రామచంద్రు లాసీనులైరి
చేరఁ నాగేశ్వరుఁడు లింగ శివునటంచు;
జన సురాదులు సంతోష సంభ్రమములఁ
దేలిరెలయెడఁ బద్మినీ జాలమట్లు.

తే. గీ. శివుని లింగంబు చుట్టునుఁ జెలువుమీఱ
ముత్తెముల చూర్ణమున లేమ ముగ్గుపెట్టి
పసుపు కుంకుమ లా ముగ్గుపైనఁ జల్లి
జానకీ సతి కరసరోజములు మొగిచి,

క. అభవా! నమ్మిక; హిమనో
త్రభవయు, నేను, భవదీయ దర్శనభాగ్యా
నుభవమున నెదలు పొంగెడు
శుభ వేళకు నిరత మెదురుచూతు మటన్నన్.

తరుణము మించకుండ నడితామసి కిక్కడఁ జేరుకోరికన్,
బరుగిడువేళ శీర్షరుహబంధము వీడి జటాసమూహముల్
పఱచె మరుత్పతంగముల భాతి విశాల విహాయసస్థలం
బరుణ విమిశ్రితాసిత మయం బొనరించి శివుండువచ్చుచోన్.

హారివర్షోన్నత భూమిరాచునో యవస్యాయావనీధ్రాగ్రముల్
హారుసిన్ గుచ్చునో, వింధ్యగీచునో, యటంచభ్రాపగాతన్వివే
పరిరక్షింపఁ దదూరుపర్వములు, పంపంబోలు స్వేయోరు పు
ష్కరసంచారమనోజ్ఞ కూర్మముల నిచ్చల్ శంభుసేవింపగన్,

వ. అని దేవతాతతు లాశ్చర్య నిమగ్నులై తిలకింప;

రయమున వచ్చువేళ మకరంబులఁ బోలిన శంభుజంఘముల్
నయనకనీనికా ద్వయమునన్ జపలోపమలై త్రిణప్రభా
చయములు నింప మా కొలముసాములు వచ్చిరటంచు బొంగుచున్
దయఁగొనుడంచు విష్ణుపథధామము గ్రాహమొసంగె పాద్యముల్.

సీ. మా ఫలంబులు శంభు మడచులఁ బోలును
మము మించరెవరనె మత్తిచెట్టు;
మా పూలబోలు నుమాధవాంఘ్రు లటంచు
గరువమ్ము మెట్టతామరలు చూపె;
మా గింజలను బోలు నాగిరీశుని దంత
ములని దానిమ్మలు ముందుకతికె;
మా పూలఁబోలు దుర్గాపతి నేత్రమ్ము
లని గొప్పలనుఁ జెప్పె నంబుజములు;

నలరు మాపండ్ల వలె గడ్డ మనియె నుత్తి;
యలరు మా పూలవలె ముఖం బనియె నళిని;
భావనోద్ధతి, వాదోపవాదములును,
చెలఁగె నిట్టుల దారిలోఁ జెట్ల నడుమ.

తెల్లని మేని క్రొన్నిగలఁ జేలిన స్వేద కబంధ బిందువుల్
మల్లెలు మొల్లలయ్యెను నుమాపతి మార్గ లతాగమంబులన్
ఫుల్ల సితోత్పలమ్ము లయిపోల్చె సరోవరపాళి; నభ్రమం
దుల్లసిలెన్ మహార్జున మయూఖము లీను నుడుప్రజాంబులై.

కలిత వశత్, శోభ శివకాయ మరీచుల నుద్భవింపఁగాఁ
దెలతెలవాఱె శంభుని ప్రతిష్ఠను గాంచని మొద్దునిద్రలో
మెలఁగితి మంచు శారికలు మేల్కొనె, గీర, పికావళీ స్వనం
బులు చెలఁగెన్, మనోజ్ఞ రుతపూర్ణములయ్యెఁ గపోతపాలికల్

శ్రీ నాగేశ్వరుఁ డాలయముఁ జేరుట

తే. గీ. శీఘ్రగమనమ్ము సాధించి శివుఁడు గుడికి
వచ్చుసరి కింకఁ నించుక వ్యవధియుండ,
నడక సాగించె శ్రమ కొంత సడలుకొఱకు;
గడప దూరక ఘను లొక ఘడియ యైన.

నానాశాంతములన్ ధరాభరము మేనన్ మోయుశుండాల స
న్మానంబుల్ గొనునంఘ్రిపంకజగతుల్ నవ్యోద్ధతుల్ చూపగా
నా నాగేశ్వర దేవుఁ డాలయమునం దైరావతేంద్రు క్రియన్,
ద్యోనాకాగతి సంచరించె లతికాస్తోమంబు వీక్షించుచున్.

తే. గీ. దిక్కరీంద్రుల తొండముల్ దేవు బాహు
వులకు సమముగ సృజియింప నలవి కాక,
బోలు బోలుగ, నజుఁడెట్లొ పొందు పఱచె
ననఁగ శివు దృఢ బాహు రమ్యత లెసంగె.

తే. గీ. గమన విభవమ్ము కతనఁ దత్కరము లూఁగ,
గర్భ గృహమున కీశుండు కదలి నడవ;
రాక గమనించి, నంది విగ్రహము హర్ష
సూచకమ్ముగ పెనుఱంకె వైచె నపుడు.

క. ముట్టెను ముద్దుగ నిమురుచు,
తట్టుచు నందీశు వీపు, దారికి నీయా

తట్టులఁ గల, ముని, విబుధుల
కట్టెదుటను శివుఁడు చేరె గర్భ గృహమ్మున్.

సీ. తొలిసారి మొగలి పూవుల సుగంధంబులు,
పదపడి సంపెంగ పరిమళములు,
తొలిసారి జాయక, మలయజ గంధంబు,
పదపడి రాజార్క పరిమళములు,
తొలిసారి హిమవాలుకల సుగంధంబులు,
పదపడి మృగనాభి పరిమళములు,
తొలిసారి యగురు మంగళ సుగంధమ్ములు,
పదపడి శ్రీవేష్ట పరిమళములు,

నెనయ నాగేశ్వరస్వామి తనువు నుండి,
పవన వీచిక లామోద భరిత మయ్యె;
నాలయమ్మును, జనుల హృదాలయముల
బంధుర మొనర్చె ననవద్య గంధలహరి.

తే. గీ. చందనాది సుగంధముల్, నంది అంకె,
ధవళ కాంతులు నాసికా, శ్రవణ, నయన
ములనుఁ బావన మొనరింపఁ బులకితాంత
రంగుఁడై కోశీ రామచంద్ర ప్రభుండు.

లేచి కనుంగొనెఁ శివుని లేనగవానన దుగ్ధవారిధిన్
వీచికయై. క్షణంబునను వెల్లువయై, కరుణార్ద్ర ఫేనమై,
పూచిన మల్లెచెండయి ప్రఫుల్ల సితోత్పల పుష్పమాలయై
సూచిత సర్వభావలయ శోభనమై, చెలువొప్పు నీశ్వరున్.

అపుడరుదెంచినట్టి కమలాసనసూనున్ సిరిదేవి కౌగిటన్
దిరిపుర విష్ణుదేవేశ్వరుల శ్రీ సహజమ్ముగ ప్రీతి గ్రుచ్చుచో
నపరిమిత ప్రమోదమున నంబుజనాభ హిరణ్యగర్భులన్
ద్రిపురహరుండు కౌఁగిట గదించుచు క్షేమమెఱింగె; నంతటన్

కమల ద్వంద్వసమాన పాణుల నమస్కారంబు గావించుచున్
న్యామరశ్రేష్ఠుని రామచంద్రుఁగని, శ్రేయఃక్షేమ సర్వంబునీ
కహరం గావుతమంచు, మోదమున గాఢాలింగితుంజేసె నా
హిమశైలేంద్రకుమారికాధవుఁడు వాగీశాచ్యుతుల్ మెచ్చగన్

వ. అంతఁ గౌశి రామచంద్రుండు,

మధ్యా: తెల్లదే నుండు నెక్కి, నూత్న తేజమ్ము హృదయమ్ము నిండ
నెల్ల లోకము తేలినట్లు లెద పొంగ, లింగమ్ము కడకు
నల్లనల్లన నీశుఁ జేర్చ, హరుఁడు తొంటి ముదివిప్రుఁడయి
యెల్లరుం గననిల్చి, శుభము క్షేమమగు నంచుఁ బలుక,

వ. అందఱును నాశ్చర్య చిత్తులై విలోకించు నెడ నా రామ
చంద్రుఁడు: దేవా! నిన్ను మహాదేవునిగాఁ దొల్లి గుర్తింప
మికి క్షమింపుమని నమస్కరించె; నంత.

## శ్రీ నాగేశ్వర ప్రతిష్ఠ

అచ్చో విప్రులు వేదమంత్ర పఠన వ్యాపారులై పల్క, గా
నోచ్చ్వాణ తతస్వరానక మృదంగోద్యధ్వనుల్ శ్రావ్యమై
మెచ్చుల్ దీర్ప; ప్రతిష్ఠఁజేయుఁనటస్వామిన్ దత్తాత్రేయుండు వే
విచ్చేసెన్ శివుఁడైక్యమున్ బొరసెఁదద్విఖ్యాత లింగంబునన్.

వాసుకి, యాది శేషుఁడును బాహువులై, ప్రతలంబులై స్ఫుటల్
భాసిలు గూఢపాంగదు, ప్రభంజనభుగ్గళ శంఖ భూషణున్,
భాసిత కుండలీ శ్రవణభాసురు, ధూమ్రశిరోజ జూట సం
వాసిత సర్పరాట్కలితు, పన్నగముఖ్య లలంకృతా ధరున్.

సురపథమైన నెన్నడుము చుట్టును కృష్ణమ దేభ చర్మమం
బరముగఁ దాల్చి, నాగమణి భాసిత శీర్ష మనోహరంబులౌ
నురగుల శృంఖలమ్ము కటినొప్పఁగ, వాహనరాజు జన్నిడం
బురమున వ్రేల, లింగమున నొయ్యనఁ జేరు మహేశుఁ
జూచుచోన్.

శైలతనూజ నెమ్మనము శౌరిపదోన్నత మాచుఁ గౌముదీ
లాలితమైన పాల్కడలిలాగునఁ బొంగెను నాథు రాక; కా
యాలయమున్ దరీముఖర మయ్యె సమస్తమనుష్య దేవతా
జాల జయధ్వనుల్ చెలఁగ, శంకరుఁ డెల్లరుఁ జూడ
నిల్చుచోన్.

దండకము : జయ జయ, శంభో! మహాదేవ! విశ్వాంతరాళం
బునం దొక్క స్తంభాకృతిన్నిల్చి, ప్రాలేయశైలేంద్ర
కన్యా తపశ్శక్తి సంప్రీత చిత్తుండవై, యంబుజాతోద్భ
వున్ సృష్టి నారంభముం జేయ ప్రేరేపణం జేసి లింగో
ర్ధ్వమండంతరిక్షంబునన్ భద్ర పీఠంబునం దర్ధనారీశ్వరా
కారతన్ బొల్చి, జీవావళీ రక్షణోల్లాసివై యొప్పు దేవా!
హిమాద్రాత్మజా చిత్తనేతా! నమో, దారు కాంతార
కైలాస, విశ్వాఖిలోద్యన్నివాసా! నమస్తే, నమస్తే, నమః.

దండకము : జయ జయ, నాగేశ్వరా! దక్షు జామాతవై,
భార్యతో నాంధ్ర పాథోనిధిఁ వీచికా డోలలం దేలి,
నీ వీ స్థలిన్ నిల్తు నంచా మెకుం దెల్పి, యా చొప్పునన్
లింగ రూపంబునం బుట్టి, భూగర్భవాసుండవై, శ్రీ కోటి
రామచంద్రాఖ్యు నుద్యాన మందున్ స్వయం భూత
శోభా విరాజన్మహా లింగ దేహుండవై, పొల్చి, నీకున్
గోటి రామచంద్రుండు దేవాలయం బొందు కట్టించి,
నిన్నున్ భవత్పుత్రులన్, పార్వతిన్, నంది నందుం
బ్రతిష్ఠింప, నానందముం బొంది, యెన్నెన్నో మాహాత్మ్య
ముల్ చూపి, తద్రామచంద్రాఖ్యు నాహ్వానముం బొంది
సర్పాపగల్, వార్ధులున్ జేరి యీ మూలయాజ్ఞాకరం
బైన నాగేశు కుండంబునన్ శాశ్వతం బాచు నిల్వన్,
దదీయాంబు పూరంబు నిత్యాభి షేకంబులన్ నిన్ను
తన్పన్ సమస్త ప్రపంచంబులన్ బ్రోచు నాగేశ్వరా!
సర్వ కల్యాణ దాతా! నమస్తే నమస్తే నమస్తే నమః,

తే. గీ. అనెడు సుర, నాగ, నర నుతు లందుకొనుచు,
కలువ కనుదోయిఁ గరుణ క్రొమ్మొలక లెత్త,
హాయిఁ డరసె రామచంద్రుని, నఖిల సభను;
ఫలిత మరచేత సుజనుల కలరుఁ గాదె.

నానా దివ్య నదీనదంబుల నిశాంతంబైన కోనేటిలో
పానీయమ్ములుఁ కుంభపూర్ణములుగా బ్రహ్మణ్యులా ప్రాజ్ఞధీ
రానీకమ్ము బుజాల కెత్తికొని రా, నా నీట సుస్నాతుఁడై
యా నాగేశ్వర దేవుఁ డొప్పెను సహస్రాంశుప్రభాపుంజమై.

క. మృదు నొడలి తడిని తుడిచెను
జడ చిక్కులు తీసి, తిరుగ జడ ముడి వైచెన్;
పుడమి ధరించిన కులగిరి
యొడయని బుడుత యపుడు కడు నుత్సాహమునన్.

క. ఆ హారుఁ జడలకుఁ బైఁ దుహి
నాహార్యకుమారి యుంచె నంచద్రుచి సం
దోహామృతమయు సుందర
నీహార మయూఖ రేఖ నేతృత్వమునన్.

తే॥ గీ॥ అపుడు నాగేశ్వరస్వామి యాలయమున
నలరు కోనేటిలో నుండి యభ్ర గంగ
యుబికి, ధవరాకృతి, వనముయూర మట్లు,
చొచ్చె ధారగ, శివు జటాజూట మునను.

భూసుర ముఖ్యుఁ డార్యజనపుంగవుఁడంతఁగోటీంద్రుఁడిచ్చెసిం
హాసన మర్ఘ్య పాద్యములు, నాచమనీయము, నాగచర్మమున్,
సేసలు, జన్నిదంబులు, విశేషకమైన విభూతి, గంధమున్,
వాసిత యక్షకర్దమపర్ణ మెదన్ విహరించు వాసికిన్.

తే. గీ. మేలు సుమములఁ బూజించి, మృగమదంబు
నలది, గొజ్జెఁగ నీరమ్ము చిలికి, సుమము
పరిమళములీను తైలదీపములు, చంద్ర
సంజ్ఞ నీరాజనము రామచంద్రుఁ డిచ్చె.

కోటిపత్రి, కోటి కుంకుమపూజలు

తే. గీ. లేఁత మారేడు దళములఁ జూత పల్ల
వములఁ బూజించి కోటి పత్రముల తోడ,

గ్రీవమున వైచి రుద్రాక్ష తావళములు
దంపతులు చేసిరపుడు ప్రదక్షిణములు.

తే. గీ. హరనమస్కృతి సాష్టాంగ మాచరించి
జయము, నాగేశ్వరా! సర్వశతవిభూష!
శంకర! మహేశ! శంభూ! మృగాంకమౌళి!
హర! శివా! యోమహాదేవ! యంబికేశ!

హే, నాగేశ్వర! హే, హిమాచలసుతాహృచ్ఛైత్ర వేందిందిరా,
హే, నీరేజ భవాంబుజోదరసఖా! హే, యక్ష రాణ్మిత్రా!
హే నిర్వ్యాజదయామృత తర్ణవవిభూ! హే, భక్తహృన్మందిరా!
హే, నైజార్హ పదప్రదాత! గొనుమా, యేమిచ్చు భక్త్యంజలుల్

వ. అని పునర్నమస్కృతు లాచరించి, పిమ్మట;

తే. గీ. కోటి కుంకుమ పూజలు కుసుమకోమ
లాంగి బాలాత్రిపుర సుందరాంబ కపుడు
చేసిరా దంపతులు భక్త చిత్తు లగుచు;
గుట్టలై, కొండలై యొప్పఁ గుంకుమంబు.

తరువోజ: జయము దాక్షాయణీ! సర్వజ్ఞ రాణి!
మహిషదైత్యాంతకా! మాహేశ్వరాంబ!
జయమమ్మ, హింగుళా! శ్యామలావర్ణ!
కామాక్షి! మీనాక్షి! కంఠీరవాశ్వ!
జయమమ్మ, కాళీ! విశాలాక్షి! వింధ్య
వాసినీ! పర్వతవర్ధనీ! దుర్గ!
జయమమ్మ భ్రమరాంబ! శాంభవీ! శైల
పుత్రికా! బాలా త్రిపుర సుందరాంబ!

హే,లింగాకృతి చంద్రమౌళి రమణీ! హే, గౌరి! హే, మేనకా
ప్రాలేయాచల బాల! హే సకలసౌభాగ్యప్రదా! దక్షజా!
హే, లక్ష్మి జలజాసనా ప్రియసఖీ! హే, సర్వకల్యాణి! హే,
బాలా త్రైపురసుందరీ! కొనుము మాభక్త్యంజలుల్ మంగళా!

వ. అని సాష్టాంగనమస్కారము లొనర్చి మ్రొక్కులిడి,

## ఆలయ, తటాకోద్యాన, భూదానము

తే. గీ. ఘనముగను దాన మీనొప్పు గౌరిపతికి
నా యథాశక్తి నిప్పుడీ యదనునందు
నని కోశీ రానుచంద్రాఖ్యుఁ డపుడు భాను,
చంద్ర, తారా, మర, నరోరగేంద్రు లరయ.

క. కిసలయ కోమల కర సా
రస కేంజల్ల ధూళి రాజిత నవ గం
ధ సపరిమళ జలములు జల
జ సమంబగు ధవు కరముల జానకి పోయన్.

దానమొసంగె, నా సలిల ధారలు తోడుగ సస్య శోభితా
నూన విశాల ధాత్రి యిరు నూఱెకరంబులు, నాలయంబు,ను
ద్యానవనంబు, పుష్కరిణి, నంచితభక్తిఁ గౌరీంద్రు డంబికా
జానికిఁ బాలితోర్వీజనజాల యశశ్వికి, నేణపాణికిన్.

## గురురాజు మున్నగువారి పూజలు

ఆ. వె. ఖోడపాటి వంశపుంగవుండగు గురు
రాజు శివునకుమకుఁ బూజ చేసె

సత్తులందు శీతలానంద భాష్పముల్
వఱల మంచుకొండ కరఁగినట్లు

ద్విపద : పూజించి రఘుడు శిల్పులను, మేస్త్రీలు
తేజో విరాజితో త్తృప్త చిత్తముల;
ఊరిపెద్దలు పిన్నలోనరించి పూజ
భూరి సంతృప్తిని బొంది రేద లందు.

ద్విపద : పిమ్మట ముక్కోటి బృందారకులును
సమ్ముదమ్మున నుమాశంకర పూజ,
సేవలు, స్తోత్రముల్ చెలువారఁ జేసి,
దీవించి రఘుడు భూదేవ దంపతుల.

ద్విపద : ఆ నవగ్రహములు, నష్టదిక్పతులు,
మానిస ప్తక, ముదుమండల వ్రజము,
పదునాల్గు భువనాల ప్రభు పుంగవులును,
సుదతీ సమేతులై, శూలిని నుమను
గని, కొల్చి మ్రొక్కిరి కరములు మొగిచి.
మనుజకుంజరులు, నిమ్నహీ నేడు దీవు
లను, నవవర్షంబు లందుత్తములును
జను దెంచి, నాగభూషణుఁ త్రిపురాంబ
సేవించి యేగి రాశీర్వాదములను
గావించి యా కోటి గ్రామణిని, సతిని.

ద్విపద : ఏడధోలోకమ్ము లెలమిఁ దేలినవి;
కోడె నాగులు నవ్య కుండలీ కన్య
లందాలు చిందించు నంగనా మణులు,

సుందరరూప చతుశ్శ్రుతుల్, మఱియు
భవర నాగుం, డధః పాతాళ మేలు
నవముక్త కంచుకానంత నాగుఁడును.
పిల్లలు, ప్రౌఢులుఁ, వృద్ధులు వచ్చి
యెల్లరీశ్వరిని, నాగేశ్వరుఁ గొల్చి
యా కోటీ రామచంద్రాఖ్యుని, జాన
కీ కాంత దీవించి, కీర్తించి, చనిరి.

ఆ మఱునాఁటి ప్రొద్దున మహాశివ పూజలొనర్చి, పిమ్మటన్ శ్యామల దేవి పూజలును సల్పి, కొలసంగ నివేదనంబు దివ్యామృత సన్నిభంబులగుభక్ష్యములన్ ఘృత, తక్ర, సూపశాకా,మలపూప,పాయసములన్నియుఁగూర్చి కాటీంద్రుఁడంతటన్

తే. గీ. మాఘ బహుళ చతుర్దశి మలయు వేళ
పారణ యొనర్చెఁ బదివేల బ్రాహ్మణులను
పంక్తి నిడుకొని యా కోటీ వంశ భవుఁడు.
వడ్డన లొనర్చె నొకలక్ష ప్రజల కపుడు

తే. గీ. అమ్మవారినిఁ బూజించి నట్టి భవ్య
కుంకుమము లిచ్చె నూరూర, పంకజాతి
పాణి యుగ భాసిత లతాంగి జానకమ్మ
తలిరుఁబోఁడుల భాగ్యముల్ తరుగ కుండ.

వ. అంతట నా కోటీంద్రుఁడు.

క. ఆలయమునుఁ గట్టిన మే
స్త్రీలను, విగ్రహముల ఘనశిల్పుల, విలస
త్కీలుర, శిల్పప్రౌఢవి
శాలురఁ గడు సత్కరించి శ్రద్ధాళువులన్.

తే.గీ. శిల్పులార! మీదు శిల్పశాస్త్రమ్మును,
హస్త లాఘవమ్ము, నాత్మశక్తి
కాక నేదియైన గమనింతురే? యన్న,
చెప్పె నిట్టు లొక్క శిల్పి యపుడు.

వ. ఏవిగ్రహమునకుఁ దగుశిలల నెంచి తెచ్చి యావిగ్రహముఁ జెక్కవలయు.

ఆ. వె. ఎవరి విగ్రహమ్ము నేము చెక్కఁగ వలెనొ
వారి జీవితమ్ము, వారి మహిమ,
వారి గుణగణమ్ము బాగుగా గ్రహియించి
పనికి దిగుదు మార్య! భక్తి తోడ.

ఆ. వె. శిలలు నిద్రనున్నఁ జెక్కవచ్చును వాని;
కాని యప్పు డులిని గదప రాదు;
మత్తు పెట్టి చెక్కుటుత్తిమమ్మును గాదు;
శిల్ప విద్య చాల చిత్ర విద్య.

తే.గీ. దైవ. విద్యానుభవ సముదయ బలమ్ము,
నైజశక్తియు, సాలోచనా విధాన,
మాత్మ శుద్ధియు. ధర్మ సత్యానురక్తి
తప్పనివి దేవ! శిల్ప వేత్తలకు నెపుడు.

తే.గీ. సహజధృతి కొంత, నేర్చిన చదువు కొంత,
స్వామి కృపకొంత, మీచేతి చలువ కొంత
కలిసి కృతకృత్యుల నొనర్చె కరుణ మమ్ము,
ధన్యులము దేవ! నీదు సత్కారమంద.

వ. అని తమ సంతృప్తిని వెల్లడించి సెలవొంది చనిరంత.

## ఆశ్వాసాంతము

సకుటుంబంబుగఁవచ్చి యిచ్చటఁ బ్రతిష్ఠఁబొంది దాక్షాయణీ
చకితేక్షణ కబ్ధి మధ్యమున భాసల్ చేసినట్టి శ్రీపీఠిన్
బ్రకటీభూత విశాలశక్తి తతితో భాసిల్లు నాగేశ్వరా!
సకలాభీష్ట వరప్రదాతవయి, విశ్వంబెల్లఁ బాలింపుమా.

ఉత్సాహ: అవనిగర్భమందు మణులహారములు ఫణులొసగన్
నవ వసంతపూజ వనమునను పరాగము జరుపన్,
ధ్రువముగ నిటనీవు నిలువఁదొడఁగు గుడి వెలయఁగన్
శివునిశను బ్రతిష్ఠఁగొన్న శీతలాంశు ధరా! హరా!

స్వాగతము: స్వామి! నీదు ప్రతిష్ఠన్ భవవార్ధుల్
రామచంద్రుఁడు తదాత్మ నెఱిపన్.
క్షేమమయ్యె భవత్సేవలు సూకున్
సోమలేశ్వర! చక్షుశ్శ్రవహారా!

గద్యము: ఇది శ్రీ శ్రీ వత్సనగోత్రాంతర్గత తేకుమళ్లాన్వయ సంజనిత । రాజగోపాలరాయ తనూభవ రామచంద్ర రావు నామధేయ ప్రణీ । తంబైన శ్రీ బాలాత్రిపుర సుందరీ సహిత శ్రీ నాగేశ్వర మాహాత్మ్యంబునందుఁ బంచమాశ్వాసము,

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ



## శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత
# శ్రీ నాగేశ్వర మహాత్మ్యము

## షష్ఠాశ్వాసము

క. శ్రీ లాలితమగు బందరు
బాలాత్రిపురాంబతోడ, వరదాతవుగా
భూలోకమెల్ల బ్రోవగ
నాలయమున నొప్పు పన్నగాభరణధరా!

## క్షేత్ర మాహాత్మ్యము

ఆవిధిఁ బూతమైన సుదినాంత నిభావరి, రామచంద్రుఁడీ
రేవుకచేరిలో నుచితరీతులఁ దీరిచి పేరుకొన్న కా
ర్యావసరంబులన్, నిజగృహంబునకశ్వము నెక్కి వచ్చుచున్
గోవెలయొద్ద నాగె వలగొందు నటుంచును దేవతాతతిన్,

ఆసమయంబునందపరయామిని మూఁడవజాము వేళనం
బాసుత, నందికేశ్వరుల భావణముల్ చెవిసోక, నాకొకీ
భూసురుఁ డప్రయత్నముగ బోధితుఁడయ్యెఁ బ్రహేళికాసము
ద్భాసనమాహ్రుతమ్ములగువార్తల క్షేత్రమహత్వ సంహతిన్

వ. ప్రదక్షిణానంతరమా భూసురోత్తముండు దేవాలయాం
తరంబున భాషించు సౌరభేయ, గణేశుల యనుమతిం
బొంది లోననాసీనుండయ్యె.

తే.గీ. ఏకదంతున కపుడు నందీశుఁ డెఱుక
చేయునెడఁ గోటీంద్రుని చెప్పఁ బడిన
క్షేత్రమాహాత్మ్య సంయుతోక్తి వ్రజమ్ము
తినరు శంభుని దయకు నిదర్శనముగ.

ఆదిత్యాదులు బొంగరమ్ములుగస్వీయాకర్షణప్రౌఢిమన్
మేదిన్యాదులఁ ద్రిప్పునట్టుల, మహామేయంబు, విశ్వాత్మకం
బౌ దివ్యోజ్జ్వలశక్తి యర్యమకుటుంబానేకముల్ ద్రిప్పి, స
మ్మోదమ్ముల్ సమకూర్చు, కోరుకుబులా మూలాగ్ర
విజ్ఞాతకున్.

క. ఈ నాగేశ్వరలింగం,
బా నిత్యామోఘశక్తి నాదృతమయి, యీ
శాను తపస్సంప్రాప్త
నూన బలం బాగరిమ నినుమడింపంగన్.

ఆకర్షించును తండతండములుగా నశ్రాంతమున్ మానవా
నీకంబున్ మచిలీపురస్థము, భవానీనాథులింగం, బథో
నాక, త్సొ భువనత్రయీ యశము, శ్రీనాగేశ్వరాఖ్యమ్మునె
చేకూర్చున్ శుభమంగళప్రకర మత్యైక శక్త్యన్వితిన్.

క. సత్యముకల దేవుఁడగుట
నిత్యము నాగేశ్వరుని ననేకులు సౌఖ్యా
పత్య వివాహ యశాదులు
నత్యంతైశ్వర్య, జయము లడుగుదు రిచటన్.

తే. గీ. భక్తి నడిగిన, లేదని పలుకఁజాలఁ
డరమరిక లేక యొసఁగు సద్యఃఫలమ్ము,

దాత్రికి కీడగు తేటహృదయము నందుఁ
గల దయారస మెప్పుడు గానఁబడఁగ.

తే. గీ. సుంత జాగైన నోర్వదు సుందరాంబ
మగలకునుఁ దగువారికా, మగువ లెప్పు
డేమి పుణ్యమొనర్చిరో యిచటి జనులు
వెలయ నిచట నుమేశులు వెదకి వెదకి.

ఈ లింగేశ్వరుపూజ, దద్రమణి నాగేశాఖ్య దేవేరి పూ
జాలబ్ధమ్ము లఖండసంపదలు శశ్వత్సర్వ సౌభాగ్యముల్;
సాలోకమ్మున భుక్తి చేకుఱును; భోగావాప్తియా స్తోత్రగీ
తాలాపాదుల, నృత్య వాద్య భజన వ్యాసంగ మూలంబునన్.

తే. గీ. తారక మొసంగు నిట కాలధర్మ మందు
నెల్ల సజ్జనులకును నాగేశ్వరుండు;
పయ్యెదను పీచు పాప తాపములు వోవ
నతివ బాలాత్రిపురసుందరాంబ దయను.

తే. గీ. పశుపతిని భక్తి ధ్యానించు ప్రాణి యిచట
జీవములు వాయుచో సాంబశివుఁడు తెలుపు
తారకబ్రహ్మమంత్రంబు, తద్రహస్య
మంతయును నాకుణంబున వంత తీర.

సీ. ఏమహాశివరాత్రి నేని నాగేశ్వరు
నకు నంబకు సహస్రనామపూజ
లొనరించి, శ్రుతులు మాఱఁడును ననర్గళముగా
పలుకు నష్టాదశబ్రాహ్మణులకు

శక్త్యనుసారమ్ము, సద్భక్తి. రజత, కాం
చనదాన మిచ్చెడు సజ్జనుండు
కాంక్షించు ఫలితమ్ముఁ గాంచుట తథ్యము;
చోరహస్తగతము చేరునిల్లు;

పట్టునట్టి మట్టి బంగారమై యొప్పు,
వేదమగును నోట వెడలు మాట ;
మఱియు నిట్టి ఫలము మాసశివనిశల,
నార్ద్ర నిత్తురీశ్వరాద్రిసుతలు.

తే. గీ. ఎవరు బాలాత్రిపురసుందరీశ్వరి నవ
రాత్రులం దేని, నాగేశ్వరప్రభు నిటఁ
గార్తికములనేని కొలువఁ, గలుగు వార
లకిరునాలుగైశ్వర్యముల్, సకలశుభము.

సీ. బందరుపురి యందు బాలాత్రిపురసుంద
రాంబాసమేతుఁడై యాలయమున
వఱలు నాగేశ్వరస్వామి కారుణ్యమ్ము
కొంగుపసిఁడి ప్రొముక్కుకొను జనులకు
దర్శనమాత్రాన ధారామృతమ్ముగా
హృద్యముల్ కుఱియింతురీశుఁడుమయు;
నడుగకున్నను నిత్తురవసరంబు లెఱింగి
యిష్టకామ్యార్థమ్ము లెల్లరకును;
పీడలు, ననారోగ్యమ్ము, పేదతనము
భూతముల, దయ్యముల, పిశాచేతిబాధ

లష్టకష్టార్తినష్టమ్ము లణఁగఁద్రొక్కి
యవని పాలింతు రిచట శాంభవియు శివుఁడు.

తే. గీ. అనిన నందీశు నమృతవాక్యములు వీను
లలర విని కోటీ రామచంద్రాఖ్యుఁ డంత
భక్తి నుమను నాగేశ్వరుఁ బ్రస్తుతించి
నందికి గణేశున కొసర్చి వందనములు.

## బందని కథ

వ. మహాత్మా! శివదేవుండు దాక్షాయణీ దేవికిం జెప్పిన
తెప్పు డుదయంబయ్యె? నాఁటినుండి మాకుం గోచ
రుండగు వఱకు నీ నాగేశ్వరదేవు చరిత్రను నీ కవ
కాశమున్నపుడు తెలుపవేడెదనని ప్రార్థింప నందీ
శ్వరుండు ఫాల్గుణ శుద్ధ యష్టమినాడు భవత్సదనంబున
కొక విప్రుండే తెంచి నీ కోరినవెల్లఁ దెలియంబల్కునని
సంతుష్టుఁడై ధన్యవాదము లర్పించి సదనంబునకుఁజనియె.
అట్లొక విప్రోత్తముఁ డేతెంచి సత్కృతుఁడై యానాఁటి
సాయాహ్నంబున గుడియం దేర్పఱచిన సమావేశమున
నిట్లని చెప్పదొడంగె. మున్ను దాక్షాయణికి శివుఁడు
తానిచ్చట వెలయుదునని చెప్పిన, కొన్ని యుగంబులకు
నేఁటికి పదిపండ్రెండు వందల యేండ్ల క్రిందట బందఁడను
భక్తవరేణ్యున కీ నాగేశ్వరుండు తొలుతఁగఁ గోచరించె.

సాగరవారి వెన్వెనుక చక్కగజారి క్రమంబునన్ మహీ
భాగము మెట్టతేలఁ నటఁబల్లెల గూడెము లేచె సుప్రభా

తాగత మారుతోల్లలితమై యులరాలిన పారిజాత పు
న్నాగ సుమావళిక్రియ; జలంబెసఁగన్ బుద్బుధాళి కైవడిన్.

తే. గీ. జాలరుల పెద్ద బండెలకు చాల వయసు
మీఱినట్టిఁ డతివయుఁ గుమారులు నట
నొక కుటీరగుచ్ఛంబున నుండి దూరి
జనులతని యనుభవజాలమును గ్రహింప.

వనమయూరము: చల్లనగు మారుతము సందె సమయాలన్
మెల్లగను వీవగను మెండుగను గాథల్
పిల్లలరుదెంచి కడుఁబ్రీతి నడుగఁగన్
దొల్లిటివి చెప్పును గుతూహలముతోడన్.

సీ. ప్రాగ్దిశాముఖముగఁ బయనింప గాన్పించు
భర్మదేశమ్ము సంపద్యుతమ్ము;
దక్షిణదిక్కుగాఁ దరణిపై నేగిన
బరగు సింహళమును బౌద్ధసీమ;
ఈశాన్యమున వంగదేశ మొప్పును వేయి
పాయలై గంగమ్మ పరగుచోటు;
ఆగ్నేయ దిక్కున నాంధ్రమణి ద్వీప
చయమొప్పు ముత్యాలసరము వోలె;

వాని తూర్పున మలయదేశమ్మెసంగు
చందనాగురు తరులతా చయముతోడ;
దాని పొంతను యవ, సుమత్ర, బలి, భరణి
యనెడు దీవులు ద్వీపహారమై చెలంగు.

సుగంధి: అంతఁ దూర్పు దిక్కుగాను నబ్ధిమీఁద యోడలో
సంతసంబునన్ దరంగసంఘముం దరింపగా
నంతులేని లోఁతులో నహర్నిశంబు సాగగా
గాంతు మంత శోణవర్ణగాత్రులేలు రాజ్యముల్.

ఆ. వె. ధరణి పజ్జను శలభ ముదీచిఁ జంపయు,
శ్యామ, కంబుదములు శాంతిఁగూర్చు;
వాని కుత్తరమునఁ బరగు చీనా దేశ
మచటి పట్టునేఁత యద్భుతంబు.

తే. గీ. వఱలె 'హాంగ్-తీ' యనెడు చక్రవర్తి యచట;
నాంధ్రవిష్ణువినిర్మితంబైన కుడ్య
మతఁడు తిలకించి, చీనాకు నపరదిశనుఁ
గట్టి యొకకుడ్య మతుల విఖ్యాతుఁడయ్యె.

తే. గీ. అటకు మన కశ్యపమతంగు డరిగి బౌద్ధ
మతము నెలకొల్పె రాజదంపతులుఁ బ్రజలు
కోర; మన యర్కదేవుని కొమరుఁడేలు
నుదధి, లంకలు చీనాకు నుత్తరోర్వి.

ఆ. వె. సింహళమ్ము సరసఁ జెలఁగుఁ గన్యాకుమా
ర్యగ్ర మబ్ధిచోళ లరులు ప్రిదుల;
ననిలుడిశను వెలయు నసురభూ, బ్రాహ్వ్యాలు
సింధుదేశ, పారశీకములును.

ఆ. వె. వరుణు దిశనుఁ జెలఁగు మరుభూమి జలహీన
మచట నొంటెలెక్కి యరుగు జనము;

కాంతుమచ్చటచట ఖర్జూరతరు; లవల
నెసఁగు నీలనదియు నెత్తుకడలి.

తే. గీ. యవన, రోమక, ఫీనిసియాద్యనేక
లానదీ సంగమాబ్ధితీరానఁ గలరు.
దానికవ్వల నొక వార్ధి తనరు: దాని
కుత్తరపుతీర మాజనులుండు చోటు.

తే.గీ. రావణుండేలె నానదీప్రాంతమెల్ల;
దాని దరిసి తెలుఁగుదేవతల గిరులును;
వాని యామ్యమున నసితవర్ణులైన
జనుల నెలవును, స్త్రీలరాజ్యమును నెసఁగు.

తే.గీ. నైరృతినెసంగు ద్వీపవంతం బఖండ
మైన భూభాగ మబ్ధిత్రయమ్మునడుమ.
దక్షిణధ్రువ ప్రాంతపు ధాత్రివాస
మతి కఠోరము మనుజసంతతుల కెల్ల.

తే.గీ. చెప్పి యిట్టుల, పిల్లలఁ గొప్పచేసి;
మీరు బంగరు కొండలు, వీరవరులు,
సింహళముదరి ముత్యాలు; చేయవలయు
పెద్దలై ఘనకార్యముల్ పెక్కు లనును.

ఆ. వె. భయము వేయలేద? బంద డు తాతయ్య!
దేశదేశములనుఁ దిరుగునాఁడు
సాగరమ్ములమీఁద సాగిపోయిన నాఁడు
కడలి కవలి జనులఁ గలియు నాఁడు?

ఆ. వె. అనుచుఁ బిల్లలడుగ నతఁడిట్లు చెప్పెను:
శివుని యాజ్ఞ లేక చీమయైనఁ
గుట్టు; దళలజగతి గొలుచును శివదేవుఁ;
జేయుచుందు నెప్పుడు శివునిపూజ.

## బండడు సొరచేఁపకు చిక్కుట

వ. ఇప్పుడు మనకుటీరముల కనతిదూరమున నొకపాము పుట్ట నానుకొనియున్న శివలింగము పూర్వముకడలి నానుకొని యుండెను. ఆదేవునకు నాచిన్ననాఁటి నుండియు భక్తితత్పరుఁడనై పూజాదులొనర్చి సంతుష్టాంతరంగుఁడనగు చుంటిని. ఒకనాఁడాంభోధియందొక యోజనపర్యంత మీరాఁతఁగొట్టి తిరిగివచ్చుచుంటిని.

మధురాక్కర: అంతలో హఠాన్నిశ్శబ్దమువతారమెత్తినట్లు
నింత నైశ్చల్యపటుఁ దోఁచె భీకరాకృతి వహించి;
కుంతి నడిపట్టి గదపెట్టు ఘోరాజి యందు వోలె,
దంతిశత బలమ్మున నేదో తాఁకెను నన్నద్రిమాడ్కి.

అల్పాక్కర: నా వామపార్శ్వమ్ము నలుగ గ్రుద్ది,
యూవాడ నన్నెత్తి యుదుకులెత్తె;
వేవార్ధి రాకాసి వేగ మంది
ప్రోవ్రాల్చినట్లు నన్ ద్రోయసాగె.

అంతరాక్కర: ఆ మహాకాయ మటుల నాలోడించుచు
నా మెయి నడుము బలము నా వెను తొమ్ములఁ
దోమి, వామభాగమును దోఁడెన్, బిండెను,
ప్రాణమెను కుడితట్టునకుఁ; జైతన్యంబాదవెన్.

మధురాక్కర:

కుత్తుకన సహ్యత జనించె; కదిపెను వాంతి భ్రాంతి;
మెత్తగా దిండువలె కుడిమేను వెంట దిగ నేడా;
యత్తరిని. మోముతోడుగు మాయమయి చూపుగనదైతి;
నొత్తిడి మటింతయై నొక్క; నూపిరి యాడదయ్యె.

మహాక్కర:

విడివడఁ బ్రయత్న మొనరింప, మరలతో బిగియఁ జేసినదిమ్మ లం జిక్కన
వడువు తోఁచె; తత్క్షణము మెదడు నంతవఱకుఁ గప్పిన బుద్ధిమాంద్యమును
నుడిగె;నిప్పఁపైనున్ననిగురుగాలియూఁపునకుఁ దొలగినట్లు
పడియెసారచేపదవడలనడుమనీబందఁడాఁబ్రాద్ధిననుచుఁ దెలిసె

క. సొర చేఁప వక్త్రబిలమున
నిరికిన యరమేనుఁ బట్టి యీడెదు వాతూ
లరయపు త్రోఁపున జలపు
టొరపిడి భరియింపఁ బ్రాణ మోర్వక, బ్రుక్కెన్.

తే.గీ. మొగము క్రిందయి, తనువు బోరగిలి, దూసి
కొనుచు నేఁగ, నిద్వార పాటుఁ గొంటి; గాని
నొప్పి తోఁపకుండె; నెవరో చెప్పినట్లు,
చింతలో వింతయనఁ దట్టెఁ జిన్న యూహ.

ఉత్సాహ: నా యిరుకరములనుఁ జాచి, నా వెనుకకువీపువై
పాయత మొనరించి, యా మహాంబుచయ చరంపు కన్

దోయిఁ బుడికి, గిల్లి, చింపఁ దూకొని, తడుము నెడ, దా
నై యది సడలించె పట్టు నతిహాతాత్తుగ, నపుడేన్,

తరువోజ: విడివడు నాసలు పెంపొంద మదిని,
వెనుకకు మేనొక పెట్టున నెట్టి,
కడు వడి వెలువడఁ గడఁగిన, గడియ
నడుమనె పడెఁ బ్రయత్నంబున; కెట్లొ
తుడిజబ్బు తూతె నాక్రూరమీనంపు
నోట సూటిగ; నానె నొచ్చిళ్లి; మనసు
పడిన వన్నియు సురవరులకె కావు,
మనకగునె మనుజ మాత్రుల కిలను!

త్రిపద: గునపము లొడలెల్ల గ్రుచ్చి పొడిచిన య
ట్లనుపమానవ్యథ కలిగె; నది సహింయింప లేనైతి;
పెనుమూలుగులు గొంతు వెలువడి, మాఱుమ్రో
గెను వార్ధి జఠరగోళమున; కీచు కేకలు లేపె నలల.

సీ. పడరాని యమబాధ ప్రతి యంగుళపు మేను
నమిలి, నఱ్ఱాడి ఱంపమునఁ బెట్ట
నేమైన నగుఁగాక; యిందు శేఖరమూర్తి
నాగేశ్వరుఁడె కాచు నన్నటంచు,
సారచేఁప నోటిలో కఱచిపట్టిన పండ్ల
బిగువు పట్టులనుండి పెకలలాగి
కొంటి వాకుడిచేయి; గుంజితి నామేను
దంష్ట్రియు తానన తలమునుండి.

రుధిర ధారలోలికి, రోహితమ్మయి వార్ధి,
యరుణుఁ గనెడు సాంధ్య తరుణి వోలె
గానఁబడఁ, విముక్తిఁ గాంచితి చెఱనుండి;
కడలి వెడల నీఁద గడఁగి నాఁడ.

వ. అని బందఁడు పిల్లలకుం జెప్పనసి విప్రివర్యుఁడిట్లనియె:

షట్పద: సారచేఁప నోటిలో నిరికిన బందని
హరుఁడు చూచెను తెప్ప వాల్పకుండ;
సరసి చెచ్చెరఁ గావనుఱికఁడేలా యను
చు రెపరెపమనె నీశ్వరికి గుండె;
మెఱపుమెఱసె నప్పు డరగలిలేని జా
లరి మాట నాగేశ్వరుఁడె కాచుఁ ద
న్నురహీనని ; శివుకర మభయ ముద్రను
ధరియించె; పల్లె గండమునుఁ దాఁటె.

కా ర్తి క ము

వ. మఱియు భక్తుండగు నా బందఁడు పిల్లలతో నిట్లనియె;
నాగేశ్వర దేవుఁ డొనర్చిన యీమహోపకారమన న్యసా
ధ్యంబని మనంబునం దోఁప, లింగంబునకు శతఘటప్రహా
నోదకాభిషేక మొనర్చి యానందించి, విడువక సేవిం
చుచున్నాఁడ. తేపు కార్తికపూర్ణిమ; అది సోమవార
ముతోఁ గలసి వచ్చుటచే మహాఫలదాయకము.

తే.గీ. కార్తికను నేకభక్తి నక్తములఁ జేతు;
రందధికము పూర్ణిమయును, నిందువార

ములు; నుపవసింతు రేకాదశులను, శివుని
రేయి నాఁడు; శివున కివి ప్రియము లగుట.

సీ. అమృతాంశు వాసరంబమృతాంశు ధరునకు
కడుప్రీతి; పెనుప్రీతి కార్తికమున;
నుడురాజు కృత్తికాయుతుఁడై చరించెడి
కార్తిక పూర్ణిమ కరము ప్రీతి;
తొలిసంజనుండి, రేతొలిజాము తుదిదాక
శశిమౌళి కభిషేకచయముఁ ప్రీతి;
కార్తికదీపముల్ గాఢమ్ముగా ప్రీతి;
యాకాశ దీపమ్ము లనిన ప్రీతి;

విశ్వశాంతి, మనశ్శాంతి, విజయలబ్ధి,
ధైర్య సామర్థ్యములు, బలోత్సాహ దీక్ష
లఖిల శక్తులైశ్వర్యముల్, సుఖము, శుభము
కలుగు జనతతి కభిషేక కారణమున.

తే. గీ. దీప దర్శనమునఁ డుల్లు పాపరాశి,
భయము, దారిద్ర్య, మజ్ఞాన చయము, జడిమ;
మఱియు నెదుగు మేధాశక్తి, మాన్యతయును ;
చెలఁగు జ్ఞాన తేజములు, సంస్కృతియు, యశము.

తే. గీ. అని, పిల్లలఁ దోడ్కొని తా
ననుదినమునుఁ బూజచేయు నఖిలేశ్వరుఁడు
న్న నెలవునం గల లింగ
మ్మునుఁ జూపి, యుదయమున నతిమోదముతోడన్.

తే. గీ. శివుని లింగము దగ్గఱి చెఱువునందు
స్నాన మొనరించి శుభ్రులై జాలరీఁడు
బాలబాలికలును వృషధ్వజుని లింగ
మూర్తికి నొనర్చి రభిషేకపూజలపుడు.

క. ఎన్నడు పుట్టెనొ లింగం
బెన్నాళ్ళుదకంబులోన నేగతి మనెనో,
యిన్నాళ్ళకిపుడు మెఱకనుఁ
జెన్నొందెను, గనిని వెడలి చెలువగు మణియై.

వ. అని, బందఁడు పిల్లలును నా పగటిపూట భుజింపక, నీర
మైనను గ్రోలక, నాయంతనము నుండియు సహస్రదీప
మాలికలతో నాప్రదేశమును తేజోమయ మొనర్చి
యాకాశదీపము నెత్తుగా పెట్టి, జ్వాలాతోరణవిధులను
నిర్వర్తించి దీపజ్యోతుల యందు బాలాత్రిపురసుందరీ
సహిత నాగేశ్వరు నా వాహనచేసి.

తే. గీ. కీటక, పతంగ, మనుజ, భోగీ, ద్రుమాదు
లుదకమున, భూమి, నెటనేని బ్రదుకు నెల్ల
జీవుల సకల పాపముల్ పోవు గాత!
చూడ నీ దీపికల; మేన సోకఁ గాంతి.

వ. అని ప్రార్థించి, పదునొకండవ యభిషేకానంతరమున
పుష్టివర్ధనుఁడగు మహేశ్వరునకు నైవేద్యమును వారి
తియు నొసంగి నక్తమునఁ భుజించిరి.

తే. గీ. అతుల పుణ్యఫలప్రదమైన నాఁడు
భక్తి శ్రద్ధా ప్రపూర్ణుఁడై వఱలఁ గాంచి,

బందనికి యశో మోక్షము లిందుధరుఁడు
కలుగఁజేయుంగ మదిలోనఁ గరుణ నెంచె.

తే.గీ. మఱియు నాదివ్య పంకజాకరము నందు
స్నానమాడుటచేఁ దన సన్నిధాన
మందు నుండగ నెన్నేడులభిలషించు
నన్ని యేం డ్లుంపఁదలఁచె రూపాద్రి మీఁద.

వ. ఆలింగమూర్తియే యిచటినాగేశ్వర దేవుం డాప్రాదమే యీ నాగేశ్వరకుండము. అంతం గొన్ని దినంబులకు బృహాత్పాలాయన వంశ్యుండగు జయవర్మ యీ ప్రాంతమున రాజ్యము చేయునప్పుడు.

బందరు, మత్స్యద్వారము

క. బందఁడొకనాఁడు కొంకకుల
నందఱఁ బిలిచి, పెనుమీను లతిదీర్ఘంబుల్
వందగజములవి, తెండన,
నెందుండు నో? యట్టి మీల నెట్లగుఁ బట్టన్?

తే.గీ. అనిన, బందఁడు దోనెలో నాత్మజులునుఁ
దాను, జలధిలో ఛీకరస్థలికి నేగ
నెంచి, తగునట్టి యేర్పాటు లెల్లఁ జేయ
నాజ్ఞ యిడి, వారితో మఱి యనియె నిట్లు.

తే.గీ. వాని నటుఁ బట్టఁ జాలము; గాన, మనము
దోనెలోఁ గాగడాలను, నూనెసిద్దె

లనుఁ, జెకుముకిశిలలఁ గొని చనవలె నని
గ్రచ్చి యాతఁడు సుతులను హెచ్చరించె.

క. పిమ్మట శివునకు సాష్టాం
గమ్మొనరిచి, మ్రొక్కి, పొంగి, కదలికఁజని శా
ర్యమ్మును సుతసహితుండయి
యిమ్మగ సాధింప దోనె నెక్కెను దీక్షన్,

తే.గీ. ఆబు తెడ్లంబురాశిలో నాడుచుండ
క్రీడి శర మట్టు లాచిన్ని యోడ సాగె,
పారిజాతమ్ము హరియింప గోరి యేగు
నాయుపేంద్రుఁడెక్కిన వైనతేయునట్లు.

ఆ నిశ్శబ్దపు యామినీసమయ నిర్వ్యాపార నైశ్చల్యమం
దా నీలాభ్రముసం జరించు బహు గోళానేక విన్యాసమఁ
దా నిమ్నాబ్ధి నెసంగు దిగ్వలయ పర్యంతోరు నీరంబులన్.
దోనెన్ ముందున కుద్ధతిన్ గడపి, పాథోరాశి మధ్యంబునన్,

క. బందని తనయులు కనుఁగొని
ముందటగా నతి సమీపమున పెనుమీ లా
నందంబున నెటుఁగించిరి
బందని కావార్త, నతఁడు ప్రముదితుఁడయ్యెన్,

ఈ మీనంబులఁ బట్టు నేర్పరితనం బీ రక్తనాళంబులం
దీ మేథాగతి, గుండెనిబ్బరమునం దీ బాహు విస్ఫూర్తియుం
దామృత్యుంజయుభూరిసత్కృపమెయిన్ వ్యాపించి జీర్ణించె; నేఁ
డామారద్విషు నాజ్ఞ తాదలను మోయన్ వేయుముందంజలన్

తే. గీ. బొంకఁడెఱిఁగిన విద్యలు వానితోడ
సమయరాదన్న శంభుని శాసనంబు
మీాలవేఁటల మెలకువల్ మీాకు నేర్పి,
వింటిపట్టున నున్న పన్నిటకుఁ దెచ్చె.

నాలుగు వత్సరమ్ములుగ నా కనుచూపులు తగ్గగాన, నీ
మీాలను బట్టు కౌశలము మీాయది నేఁడు కుమారులార! నా
జాలరి విద్య మున్నపుడొ, సర్వజగమ్ముల మెప్పులందిసన్
కాలము సాఁగెఁగ క్షయవక్ర ప్రముఖాఖ్యల లోకవశ్యమై.

తే. గీ. కాన, వెలిగించి చూపుడు కాగడలను,
ప్రకసి, యా కాంతిపుంజంబుఁ బట్టుకొనఁగ
దంకు వెడలుఁ ప్రభంజనోద్దండ వేగ
సద్భ్రశము, దోనెపైన మత్స్యముల పిండు.

తే. గీ. అగ్నిశైలోష్ణ భూరి గహ్వరముఁ బోలు
నోట నొక్కొక మీాన మీాలాటి దోనె
నొక్క గ్రుక్కను కబళింపనోపు; నట్టు
నట్టుగను రాహుకేతువులట్లు కాక,

వాలహతిన్ బలమ్ముగల వర్తకనౌకల, యుద్ధనౌకలన్
చీలిక వాలికల్, చిఱుత చెక్కలు ముక్కలు, నుగ్గుపిండిగా,
ధూళిగ, గాలిగా, చితుక ద్రొబ్బెడు నైజము పిపిదబ్ధిలో;
తేలొకకొండపోలెటుల దేహముగ్రుచ్చునొ యట్టులూరకన్.

తే. గీ. దంష్ట్రిల సకుల జంట విద్యాస్త్రరత్న
మగుచు, మూర్ణితాంబోధిగర్భాంతరాళ

వజ్రమును, వజ్రదుర్భేద్య బలయుతమ్మొ
నగు; ఝషాబాల్యకేళికాభ్యాసకలన.

తే. గీ. వాని చర్మము దైత్యరాట్పుట్టుకుడ్య
సన్నిభంబయి, శూలాది సాధనముల
కెదురు తిరుగును, మున్నీరు సదన మగుట,
స్థానబలమున మీలతిశయముఁ గాంచు.

తే. గీ. కానఁ, గాగడలకుఁ బెకుమీను లలరి,
వెంటఁ బడుచుండ దోనె వేవేగ నడపి,
యొడ్డుకడ మీలఁ జంపుట యుక్త మనిన,
బందని కుమారులు కడంగి రిందులకును.

క. కాగడ వెలుగుల నీడలు
సాగరమునఁ దోఁప, మీనసంఘము లుఱికెన్
కాగడ నీడల బ్రింగఁగఁ
గాగడలను బ్రింగ సమదగర్వాంధములై.

బందని పుత్రులిద్ద రొగి బాహుబలమ్మునఁ దెడ్లఁ నూప, ము
న్నుం దయివచ్చు మీలఁ గని మూఁడవసూనుఁడు కర్ణధారియై
యందగనీక వేయి వలయమ్ములుగాఁ దమ దోనెఁ ద్రిప్పఁ బెం
పందిన నేర్పుతో ఝషచయమ్ము నకున్ ద్యుతిఁజూపె జ్యేష్ఠుడున్

మహాస్రగ్ధర :
జలమధ్యాభేద్య గేహస్థశకులములు పక్షావిహీనంబు లౌ చున్
దలపైనన్ బ్రహ్మగీతల్ తలుసు, పడవచెంతన్ గమించెన్!
దుఃదిన్ జేఁ

పలు మాఁడంభోధితీరప్రఘుణతలమునన్ బట్టెనో డ్డంత బల్లెంబుల నోటన్ గ్రుచ్చి మీనంబుల కొడు పెనయున్ మాతులన్ గట్టి రుచ్చుల్.

క. ఆ పాఠీనములందు, ను
మాపతి కొక్కటి యొసంగి, మఱియొక దానిన్
భూపతి కిచ్చిరి; మాఁడవ
చేఁపను నందఱకు విందు చేసిరి ప్రీతిన్.

తే.గీ. విశ్వనాథుఁడు మెచ్చె నైవేద్యమునకు;
మత్స్యమైనను భక్తుని మానసమ్ము
ముఖ్యమగుఁ గాని నైవేద్యముల వివేక
మెంచ నొప్పునె సర్వజ్ఞుఁ డీశ్వరుండు.

క. వేనకు వేలు భుజంగము
లానైవేద్యము గ్రహించి యరిగె, జనుల కే
హానియుఁ జేయక, శివుఁడు మ
హానటి, నాగేశ్వరుఁడని యందఱు నెఱుఁగన్.

భూపాలాగ్రణి కాత్మబంధుతతికిన్ భోజ్యంబు రుచ్యంబునై యా పాఠీనము బంధనామమును రాజాంతఃపురోద్యాన కేళీ పర్యంకతలంబులన్ రసనపాళిం జేలి, తన్మోభృత్సభా వ్యాపారాంతర భాషితంబులు నమాత్య స్తోత్రపాత్రంబులై

క. వెలయఁగ మహామాత్యుఁడు
తిలకించెను మీనరాజు దేహస్థములై
చెలఁగిన వెన్నెముకను బొమి
కెలఁ; గడు విస్మితుఁడయి పలికె నరేంద్రునితోడన్

క. ఎన్నఁదగు మనుజుఁడైనను
నెన్నందగు వస్తువైన నేరాజ్యమునం
దున్నను శైలాగ్రానల
సన్నిభముగ దద్యశమ్ము తప్పపతి చాటున్.

ఒక్కటికాక యిట్టి తిమియుగ్మము నింకనుఁ బట్టి జాలరిఁ
డొక్కటె వేఁటలో! ధ్రువసముద్భవమీనములాంధ్రవార్ధిలో
నొక్కెడ నుండు టెట్లొకొఁగనో! మునినాథ దినేశ్వరాదులం
దొక్కనిఁజేసె నే ఁడనుభవోన్నతు లీతని. వాని కంజలుల్.

తే. గీ. అని యమాత్యుఁడు తన హృదబ్జాకరమున
జంటరాయంచలట్లు యోచనలు మసలఁ
జనపతికిఁ దెల్ప; జెక్కిళ్ళ చంద్రవంక
లొప్ప శస్తము, సుకృతంబు నొలసె ననుచు;

వ. ఆ నరేంద్రుఁడు వానినంగీకరించి.

బందని నామమీవసుధపైఁ జిరకాలము నిల్చునట్లు లా
బందఁడు దాశబృందము నివాసమొనర్చెడు ప్రాంతభూమికిన్
'బందడి'యూరటందుఁజయవర్మయొసంగెను పేరు; రానురాన్,
'బందడియూరు' బందరన భాషితమయ్యెను కాలయాత్రలోన్

సీ. మూఁడు మీనమ్ముల మూఁడు వెన్నెముకలఁ
దెప్పించి, యంభోధి తీరమందు
నిర్మించె నతిరమణీయ మత్స్యద్వార
మా పశ్మవంశత్రయంబు తోఁడ;

చేఁపల యెముకలఁ జెక్కించె నగిషీలు
లతలుగా, పూలుగా లలితగతుల;
నోడలు, నౌకలు, నుడుపమ్ము లాద్వార
సీమ నాగు వసతిఁ జేసె విభుఁడు;

చిఱుగవను లాఱు చేయించె చేఁప కనుల;
సంతసించెఁ జతుర్దశజగము; లజుఁడు
వయసు వేయేండ్లు వోసె నాద్వారములకు;
సార్థకంబయ్యె బందని జన్మ మిలను.

వ. ఇదప కైలాసవాసమును మోక్షమునుబందనికి శ్రీనాగేశ్వ
రుండొసంగె; నంత.

బసవఁడు ఇనుగుదురు

వసుధ జనించె నంది శివభక్తవరుండయి, సత్కులీనుఁడై
బసవన మంత్రిగా; నతఁడు భారత భూమిని వీరశైవమున్
బ్రసర మొనర్చు కాలమున బందరు పట్టణ మేగుదెంచి, సం
తసమున నిప్పుడ్రొక్క నెలతాల్పునఁ దన్ని విశిష్టపూజలన్.

తే.గీ. ఇనుపకుదురులు పెక్కు చేయించి, వాని
యందుఁ గణకణలాడెడు నగ్ని రగులు
కొల్పి, దుముకుచు భక్తు లాకుదురులందు
పరవశతఁ జెందుటల్ పరిపాటి యయ్యె.

తే. గీ. దవడలకు, నాలుకకునుఁ బెదవులకును, సిత
రాంగములకు నారసముల నంటఁ బొడిచి

చిందులను ద్రొక్కి, బొబ్బలు జీల్వ దిశల,
పాడుచుండిరి వీరాంగ మాడు వేళ.

తే.గీ. ఇట్లు ప్రతిమహాశివరాత్రి యుందు లింగ
మెదుట వేయుయు నెనిమిది కుసుమాంకులకును
తగ్గకుండ, శివప్రీతిఁ దాండవమును
వీరశైవులు చేసిరి పెక్కునాళ్లు.

తే.గీ. శంభుడెసఁగును గాన నీశాన్య దిశను
గుదురు లీడుచుండి రాదిక్కు కెదురుగాను;
ఈశ్వరుని లింగమునకు నైర్బతిగ నిట్లు
విస్తరించెను కుదురులు వేఁగొలది.

తే.గీ. చాల నూఱుల యేండ్లిట్లు సాగిపోయె;
నెందఱెందఱు రాజులో యేలి చనిరి;
ఇనుప కుదురుల సంఖ్యయు నెదిగె తరిగె;
నా ప్రదేశము 'ఇనుగుదు' రనిరి జనులు.

తే.గీ. నేఁటి ఖాజ్లిల్లి, సర్కిలుపేట, లినుగు
దురు, జలాల్‌పేట, మఱియు ఫతుల్లబాద,
పాతరామన్నపేటల ప్రాంతమగుచు
నలరు తొల్లింటి యినుగుదుర నెడు చోటు.

తే.గీ. ఇనుపకుదురుల కాలము చనిన పిదప
క్రొత్తగా దొంగిలించిన ముత్తెమట్లు;
ధ్వాన్తముల వాతఁబడు చిత్రభానునట్లు
దాఁగె నా లింగమూర్తి పథ్వ్యంతరమున.

వ. అని పూర్వకథలను తెలిపిన బ్రాహ్మణ శ్రేష్ఠుని కొంతిం
ద్రుడు సత్కరించి యంపె; నిట్లు యథావిధిగ గుడియం
దభిషేక ధూప, దీప నైవేద్యాదులు జరిపించుచుండఁ
క్రమంబున బందరు పదునెనిమిది పేటల మహోపట్నమై
భారతావనికిం దిలకాయమానమయ్యె.

ప్ర తి ఫ లే చ్ఛ

దినములు సాగ నిట్లు సుదతీసుమజాజి, సుభద్ర యాశివున్
మనమున నమ్మి, కోర్కి మధుమాస సమీప సమీర వాసనన్
దనర, విరాగ మేది, గిరితల్లునిఁ గొల్చె నిజేశు రాకకై
దిన మొక యేడుగాఁ,గనులు దివ్వెలుగా,మది స్వాతిశుక్తిగన్.

క. వందయు నెనిమిది రూప్యపు
బిందెల కుండోదకమున వేకువ సమయం
బం దభిషేకించుచు న
ర్ధేందుధరుని నిత్యముఁ; దన హృద్యముఁ దెలిపెన్.

సీ. ఏ పూర్వభవమున నేమూలుమగల కే
నెడబాటు కావించి యుంపుఁ గంటి;
వైరైన మిథునమ్ముఁ గూరుపఁ జాలియు
నేనాఁడు నే మాని యుంపుఁ గంటి;
నేజన్మమున మున్ను హృదయేశు నెద నహం
కృతి తోడ నొప్పించి యుంపుఁ గంటి;
నేతొంటి పుట్టువులో తృణీకృతుఁ జేసి,
యీసడించి నిజేశు నింపుఁ గంటి;

నెఱుఁగఁ జాలను; సర్వాఘహారుఁడ వఖిల
భక్తసురశాఖి వని యెంటఁ బట్టి నాకు
నీశ! బాలాత్రిపురసుందరీశ! గిరిశ!
ఇడుము పతిభిక్ష నాకు నాగేశ్వరాఖ్య!

ఎనిమిది చైత్రముల్ గడుచు నీడునఁ గన్నియనైన నన్ను నా
పెనిమిటి ద్వాదశాబ్దముల పిల్లఁడు దానము పొంది, పెండ్లియై
యెనిమిది శ్రావణమ్ములకు నింటికితోడ్కొనిపోయి, కాపురం
బొనరిచి నాలుఁగేం; డ్లరిగె నొయ్యనవత్తు నటంచు నేడకో.

ఏడులు పూడులుం గడవ నిట్లు సువాసినినో, వితంతువో
చేడియనో మదిన్ గనని జీవితరేఖ చిగిర్చె నాశకున్
దోడగు నీదురాశ; కిక తోషముఁ గూర్పవె భక్తవత్సలా!
వాడిన నిమ్మతోఁట తొలివానలకున్ సిరులొల్కు కైవడిన్.

గుండెలలోన రాయిపడి, గుట్టగఁ గొండగఁ బర్వతమ్ముగా
నిండి ఘనీకృతమ్మయిన నిస్పృహతో నడియాస జీవముల్
బెండుపడంగ, నీవు సరివేళకు ధైర్యముఁ గూర్చి తార్తివే
దండమృగేంద్ర! రక్షితపృదాకుకులేంద్ర! దయామృతార్ణవా!

ఆ. వె. కాశి కరుగమాని, గంగఁదోఁగుటమాని,
యచటి విశ్వనాథుఁ డిచట వెలసె,
నచటి గంగ చెలఁగు నిచటి కుండములోన
ననుచు నమ్మికొంటి మనమునందు.

నమ్మితి నిన్నె నా మనమునన్ మచిలీపుర నిష్కుటోద్భవున్
సమ్మదితాంధ్ర భూవలయు, సాగరచుంబిత పాదపద్ముఁ, గృ

ష్ణమ్మయు గౌతమాంబయును చామరముల్ తమ కేలబూనిపా
ర్శ్వమ్ముల నిల్చి వీచ నగజాహృదయేశు నీశ్వరున్.

ఫాలమువోపి యీ కటిక బంధమయిన్ నతియింతునిన్ జగ
జ్జాల సమస్తపాలక విశాలకము, నాగులు శీర్షరత్నపున్
మాలల హారతుల్ నెఱపుమాక్కు మదీయశిరఃప్రసూనపుం
జాలులతో నివాళులిడి, నాంబశివా! పతిభిక్ష పెట్టినన్.

వ. అని, నిజనిరీక్షోత్సుకతకుం సముంబగు విబ్బరంబెదంగానక
నాగేశ్వరు నుద్దేశించి,

ఆ. వె. ఉలుకు పలుకుసున్న; యూరడింపును లేదు;
మనసు వినుట లేదు; మంచి లేదు;
ఎండమావి నెఱుంగ కేమేమొ యొరిగింతు
వనుచు, నజ్ఞారాల నాసపడితి.

ఆ. వె. వీడి యిచటి గుడిని వెండికొండనుం జేరి
యొక్క చటియం గూరుచుండి, కనులు
మూసికొని తపమ్ము మొదలుపెట్టితి వేమొ
జనుల నమ్ముమఱచి, జగతి మఱచి.

కం. వెలసితి వీ పూందోంటను;
గొలువంగం గట్టించుకొంటి గుడినిట నీకై
కలశాలము వరదుండవై
నిలువక నిటునటునుం దిరుగ నీతియె నీకున్?

ఆ. వె. ఆలకింపవమ్మ! బాలాత్రిపురసుంద
రమ్మ! నాదుమొఱ, దయాబ్ధివమ్మ;

నన్ను తేగదమ్మ నాగేశ్వరు కృపార్ద్ర
దృష్టి; కుడుపవమ్మ కష్టములను.

నానాటన్ మిము, నాదిదంపతుల, నా నాగేశ్వరున్ నిన్ను స
న్మానింపంగల నిత్యభాగ్య మమరెన్ నాకంచు సంతుష్టనై
ధ్యానారాధన నమ్మికొంటి మిము, కష్టాంత్యాహ
మీనాఁడె యం
చా నాగేశ్వరుఁ గుండె మెత్తపడఁ జేయంగ జెల్లదే నేఁటికిన్.

సీ. వసుధాతలము పాపపరిపూర్ణత నశింప
ప్రళయాంత శుభవార్త బలుకు నెవఁడు,
జీవరాశుల మోక్షసిద్ధికై మఱల సృ
ష్ట్యారంభకృషి చేయు నఘుఁ డెవఁడు,
సౌభాగ్య, సంతోష సకల సౌఖ్యైశ్వర్య,
మంగళార్థమ్ముల నను చు నెవఁడు,
అడిగిన తక్షణం బర్థితార్థములిచ్చి
పిలిచిన వెంటనే పలుకు నెవఁడు,

ఆ దయామతి, నాగేశ్వరాఖ్యుఁ డార్తి
హరుఁడు, బాలాత్రిపురసుందరాంబ మగఁడు,
భూమి పాలింపఁ బార్వతీ భామతోడ
వచ్చి నే కోరువరముల నిచ్చు గాక.

తడవుగ సహింపఁ జాలనిఁక దక్షసుతాహృదయేశ! యీశ్వరా
వడి నను గావవే, తలఁపువాహిని నాదెస సాగనీవె, నా
యెడ భవదాశ్రితార్త్యపహమగు నీక్షణముల్ ప్రసరింపఁ జేయవే,
యిడుములఁ బాపవే, నను మహీస్థలి మన్ననఁ బొందఁ జేయవే.

వ. అని మొఱలిడుచు బ్రార్థింప

ఖండశశాంకమండిత శిఖావలయ ప్రకరప్రకాండుఁడు
ద్దండ తమస్వినీముఖ పృథగ్విధ ధూమ్రమ శిరోజ జూటుఁడా
ఖండలపుత్త్ర ఖండనవిగాహ కృపాదృతభిల్ల వేషుఁడీ
శుండు సతీసమేతముగ చోదిత మానసుఁడయ్యె భక్తికిన్.

వ. అంత, నడిమివయస్కులగు మానవ దంపతులట్లు బాలా త్రిపురసుందరీ నాగేశ్వరు లామె కడకరుదేఱ, దేవి యిట్లనియె.

ఆ.వె కష్ట సుఖములైన, కలిమి లేములు నైన
నుండవెల్లకాల మో లతాంగి!;
ఏమి కష్టభరము లీవు మోయుచునుంటి
వేల కుంది చిక్కి దిందువదన!

వ. అని యడుగ, నాసుభద్ర,

ఆ.వె. ఏలనమ్మ, దీనురాలి కష్టమడుగ?
నార్చువార? మీరు తీర్చువార?
యడ్డు వడెడు వార యాపదలందున?
కరుణఁ జూడ వలయు హరుఁడు, నుమయు.

వ. అనిన నా ముద్దరాలికా దేవి యిట్లనియె.

సీ. ఆర్చువారము మేమె, తీర్చువారము మేమె,
యడ్డుపడుదు మేమె యాపదలకు,
తరుణి! నే బాలాత్రిపురసుందరిని, నాదు
హృదయేశుఁడితఁడు నాగేశ్వరుండు;

వసుధ పాలింపంగ వచ్చి నీమొఱ విని
కష్టముల్ బాపి సుఖమ్మొసంగ
నెంతుము నీ కష్ట మెఱిఁగింపు మన, జెప్పె
మ్రొక్కి, కథను పూసగ్రుచ్చినట్లు;
ఇది వినిన సతీశు లీ నెలలోపల
చేయుమమ్మ నీవు శివునిరాత్రి
పారణ సహితమ్ముగా; రయమ్మున నీదు
భర్త వచ్చుననుచుఁ బలికి చనిరి.

వ. ఆమె చైత్రమాస శివరాత్రి నాఁ డట్లొనర్చి పారణ విధ్యుక్తమ్ముగాఁ జరిపిన మధ్యాహ్నమ్మున.

సన్నని మేనివాఁ డొకఁడు, సత్వపటిష్ఠుఁడు పైడిచాయఁ వా
డన్నులమిన్న యున్న గుడియందుఁ జెలంగఁగఁ, జెంతఁ జేరి, యా
సన్నసుఖప్రముద్రితవిశాల లలాట తలప్రఫుల్లసం
పన్నత, బోడపాటి కులపావని నా గురురాజుఁ గాంచుచున్.

మీరు దివానుగారుకద? మీదొరగారును, మీకుటుంబమున్,
మీరును, క్షేమభాగ్యము, లమేయ సుఖంబులుగల్గి పొల్తురే!
సూరతుకున్ పరంగి వణిజుల్ కొనిపోవఁగ వెంటఁబోయి, వే
లాఋపదుల్ గడించితి, గృహాళిల మప్పుడు వీవఁ బెట్టుగన్

చేరితినోడపైఁ దెలుఁగుసీమకు; వేగిరపాటు హెచ్చె నా
వారిఁ జూడ; మూఁత బిగపట్టిన బుడ్డివి ద్రాక్షసారపుం
దీరునఁ నూహలాగక మథించె మదీయ హృదంతరాళమున్;
గోరికయున్, భయమ్ము, నులుకున్ సుడిసుళ్లుగఁ దత్తరింపగన్.

వరికిఁ గీడు లేక సుఖయించుచున్నటు లెంతు నాత్మలోన్;
జేరువ సత్తమూరని ప్రసిద్ధివహించు మదీయ గ్రామ, మా
యూరఁ గలండు పేరన నియోగి ధరాసురుఁ డాలువేల వాఁ
డౌ సుఁడన్ దదుత్తమున కేనని వెక్కుచు నేడ్చె భోరునన్

వ. ఆ గురురాజాతని నప్పుడు పోల్చి

క. బావా! వచ్చితివే, యని
దేవరుఁ గౌగిలుచుఁ గనులఁ దేమ చెమర్చెన్;
దా వచ్చుట కడుగికి, సి
గ్గావహిల, సుభద్ర గార్చె నానందాశ్రుల్.

వ. అంతట నయ్యాలరాజు నామధేయుండగు నాయాగంతకుని
తలిదండ్రులకు గబురంపి, ప్రాయశ్చిత్తాది కర్మానుష్ఠాన
మునకు వైశాఖశుద్ధచతుర్థినినిర్ణయ మొనర్చి, యంతదనుక
నయ్యాలరాజునకొక సత్రమున వసతి సేర్పఱచిరి. ఈ
యాలస్యమునకు సుభద్ర చీకాకు పడుచు

సీ. గుణ, రూప, బుద్ధి, వాగ్గణ లక్షణమ్ములు
మారెనో, తొంటివో మగని కనును;
ఏ క్షుత్పిపాసాదు లేకష్టనిష్ఠుర
మ్ములు గ్రసించెనో యంచు నులికిపడును;
ఏల ప్రాయశ్చిత్త? మేటికీ యడ్డంకు?
లని విమర్శించు నియమము లెల్ల;
విరహాగ్ని వేధింప, వెఱ్ఱియై, నూలుకం
డెను బోలెఁ దిరుగు నింటికిని, గుడికి,

చలువ గాలుల వడఁగాఁచు; స్మరునిఁ గసరు;
నమవసనుఁ దిట్టు; లేని సుధాంశుఁ దిట్టు;
పోడము నెలఁదిట్టు తడవేల వడకననుచు;
నవ్వ వచ్చితే! యను మఱునాఁటి శశిని.

వ. పిమ్మట, ప్రాయశ్చిత్తాది కర్మానుష్ఠా నానంతరమున సాధ్వీమణి యగు నా సుభద్ర.

సీ. నవరకుప్పెయు, పైడిజడ, చంద్రహారము,
గోట్లు, వంకీలును, గోమ్మరాలు,
వడ్డాణమును, నాగవత్తులు, జంపులు,
కాసుల పేరును, కాసి పుట్లు,
కంటెయు, మురుగులు, కంకణా, లుంగర
మ్ములు. సూర్యచంద్రులు, ముత్తెసరులు,
పోచీలు, మఱి ముక్కుపుడకలు, బావిలీ,
లడ్డబాస, బులాకి, యళగు బిళ్ల;

రాగిడియుఁ జంద్రవంకయు, నాగరమ్మ,
పలకసర్లు, పాపటబింద్రి, పట్టెడయును,
మల్లెమొగ్గలు, నాను, చేమంతిపూవు,
తమలపాకు, మొగలిరేకు, తళుకుబొట్టు,

సీ. పుస్తె లందెలు, నల్లపూసలు, రావిరే
కయును, తాబేదులు, కమ్మజోళ్లు,
కడియాలు, మఱి తుమ్మకాయల గొలుసులు,
పాంజేబులును, చుట్లు, పావడాలు,

మామిడిపిందెలు, మట్టిగొలుసులును,
చుట్టుగొలుసులును, మట్టె, లుట్లు,
పగడాలపేరును, సొగసు ముక్కెర, దండ
కడియాలు, జూకాలు, కంచిచీర,

పసుపు, పారాణి, సుహాముల పట్టురవిక,
గాజులును, గంధ, మత్తరు, కాటుకయునుఁ,
దాల్చి, మచ్చాలుఁలుగఁ పూలు తలను ముడిచి,
చెలువ వెచ్చెసె చిలుకల కొలికివోలె.

వ. అప్పుడా యయ్యలరాజు,

తే. గీ. మొలఁ బసిఁడి త్రాఁడు, మురుగులు, ముక్కుకాడ,
యంటుజోళ్లను, బుజబందు, లాంజనేయు
బిళ్ళ, చెవులతీగలు, కాలి వెండితీగ,
తులసితావళి, ముంగరములునుఁ జెలఁగ;

తే. గీ. బిళ్ళకోచి జరీపంచె, వెండిపొన్న
కఱ్ఱయును, కాశీ పట్టుకండువాయు,
సరిగ మహాములు టోపి, లోచనపు సురమ,
యొడల నంగరఖాయును, నొప్ప, నిలువ.

వ. ఆ సుందరి అత్తమామల పాదములకు నమస్కరించి పిదప భర్తృచరణములకు నమస్కరించుచుతటి నందఱును శుభాశీర్వదమ్ములు నిన్ను ముట్ట సేసలు చల్లిరి. అనంతర మామిథునము శ్రీ బాలాత్రిపుర సుందరీ సహిత శ్రీ నాగేశ్వరస్వామి పునర్దర్శనమాచరించి, మొక్కులు చెల్లించి

మధురగతిద్విపద : తల్లీ! దేవీ! త్రైపురసుందరి!
యుల్లము రంజిల నొప్పులు చిలుకుచు
దండము గొనవే, దయ నెప్పుడు మా
యండను నుండవె, హైమవతీ!

ద్విపద : బందరు పురిలోనఁ బ్రభవించి నిలుచు
నందివాహన! శివా! నాగేశ్వరాఖ్య!
మాదండము లివే, యుమాపతీ! కొనుము;
సాదరమ్మున నిమ్ము సౌఖ్య సంపదలు.

వ. అని కీర్తించిరి. అంతటితో తృప్తిఁ గనక నా తలోదరి.

సీసము: అను వారమును నూఱు నెనిమిది పేరులు
పలుకుచు నోరార బందరు లోని
బాలాత్రిపురసుందరీ లలామకు భక్తి
చేతుఁ గుంకుమపూజ చేతులారగను,
ఖాజిల్లిపేటలో కొలువున్న నాగేశ్వ
రుని దర్శన మొనర్తు గనులార సతము,
నిత్యనమస్కృతుల్ నెఱపి కేల్దోయిఁ, బ
త్రినిఁ దాల్చి శిరమున, దేవుఁ గీర్తింతు.

వ. అని ప్రమొక్కి యబ్బంగి నోఁకుచు, నెడబాటులేని దాంపత్యమును, సత్సంతానమును, మన్ననయుఁ గలిగి వర్ధిల్లె; నంత.

ఆశ్వాసాంత పద్యములు

కం. పున్నెముల కోవ యమ్మను
బన్నగధర ! నీదు కతన బందరు పట్నం

బెన్నఁగఁ దరమె భవద్దయ
పున్నమ వెన్నెలలఁ బోలి పురమున విరిసెన్.

కం. బందరు పురి కీ పేరే
బందని మూలమునఁ గలిగె వాని మనః పు
ష్పేందిందిర! బసవని హృ
న్మందిర! నాగేశ్వరాఖ్య! మకుటేందుధరా!

మందాక్రాంతము:

నీయం దెవ్వారు తమ మనమున్ నిల్పి, యత్యంతదీక్షన్
సాయం బర్థింతురు సకల విశ్వంబునం దెచ్చటేనిన్
ధ్యేయంబున్ దక్షిణమున భవద్దేవియు న్నీవు సంగన్
మా యుద్ధర్షంబు హరిపద ధామంబుగా పొంగు నీశా!

గద్యము: ఇది శ్రీ శ్రీవత్సస గోత్రాంతర్గత తేకుమళ్లాన్వయ సంజనిత రాజగోపాలరావు తనూభవ రామచంద్రరావు నామధేయ ప్రణీతంబైన శ్రీ బాలాత్రిపుర సుందరీ సహిత శ్రీ నాగేశ్వర మాహాత్మ్యము నందు షష్ఠాశ్వాసము.

మంగళమ్ మహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# శ్రీ బాలాత్రిపురసుందరీ సహిత
# శ్రీ నాగేశ్వర మాహాత్మ్యము

## సప్తమాశ్వాసము

క. శ్రీదశ్రేయస్కర న
వ్యోదయమున నిహపరముల నొసంగగ మాకీ
వై దయచేసి, శుభోత్కర
మాదారినిఁ దెలిపి ప్రోచు నాగ్యానాథా !

వ. అట్లు కోటీ రామచంద్రాఖ్యుఁడు, కోవెలలో క్షేత్ర
మాహాత్మ్యమును వినుచుండ :

### బాలా త్రిపురసుందరీ కల్యాణము

క. ఆ రేయి జానకమ్మకుఁ
గూతురు రాదయ్యెఁ గనులకునుఁగట్టఁగ గా
రీరమణి; యపుడు తలఁపఁగఁ
శేరెన్ భుజబంధమాగ్య చెలువుట్టిపడన్.

ఉ. కోరిక గట్టిదైన సమహూర్తు తుమేశులు సజ్జనాళి; కి
తీరున జానకీసుతలు తేలఁగ సంతసదుగ్ధవార్ధిఁ, గ
చ్చేరినిఁ, గోవెలఁగడచి చేరి కోటీంద్రుమసృయ గేహమం
దారసె నక్షిపర్వముగ నద్రికుమారికి నాత్మజాతగన్.

వ. ఇట్లు భక్తితత్పరతచేతను. నిజసద్వర్తనముచేతను ప్రసా
దితమైన భగవత్కృపాకటాక్షలబ్ధ వైభవానం దోల్ల

సితులైన యా జానకీ రామచంద్రుల యింటికి జానకీ బాయమ్మ కోరినప్పుడెల్ల బాలాత్రిపురసుందరీ దేవి యరు దెంచి వారి పుత్రికామణియై, వారి కుమారులగు వేంకట రమణరావు, జగన్నాధరావు, శాయజీరావు అను శాయ న్నలకు చెల్లెలై శశ్వద్ద్వాదశవర్ష ప్రాయగఁ జరించుచు,

తే. గీ. చక్కదనమునఁ, బొంకము, సత్ప్రవర్త
నమును, సౌమ్యతయును, వినయమునుఁ గలిగి,
తల్లోకీ గృహరత్నమై తనరె బాల,
తల్లిదండ్రుల మనము సంతసమునంద.

సీ. తోఁటలోఁ గట్టిన త్రాటియూయల లూఁగు
తూఁగుటూయలలో నూఁగునింట;
నావరణమ్ములో నాడు దాఁగుడుమూత
లింటిలో వామనగుంటలాడు;
తల్లితో పచ్చీసు, తండ్రితో చతురంగ
మాడు, వంటలను రుచ్యముగ వండు;
సంగీత, సాహిత్య, శాస్త్ర, గజాయుర
శ్వాస్త్రాది విద్యలఁ బ్రతిభఁ జూపు;
కడలి నీఁదును; నౌకల నడపు నేర్పు,
బలుతుపాకి ఫిరంగుల ప్రధనమాడు
పటిమయునుఁ జూపు భారతావనిని స్త్రీల
కవసరమ్మిట్టి యని యెల్లరనుసరింప.

తే.గీ. తనయ యాటలఁబాటలఁ దనివి చెంది,
మాఁడు ప్రొద్దుల సుతసేవమునిగి తేలి,

పగలు రేయియు జానకీబాయి హృదయ
పారవశ్యంబుఁ నందె నా బాలఁగాంచి.

వ. అంతట వైశాఖాగమమం బగుటయు.

ఆ.వె. ఆవసంత వేళ నా కొఠీ మిథునమ్ము
సుతను, పద్మమణిని, సుందరాంబ
నవ్యగృహనివాసి నాగేశ్వరునకిచ్చి
పరిణయమ్మొనర్చు తరుణమయ్యె.

అని వారున్విళులూరుచుండ, గురురాజచ్ఛోటికే తెంచె నం
గన తోడన్ దనయక్కబావలఁబునర్గార్హస్థ్య లగ్నంబునన్
గనిదీవింపఁగఁబిల్చుకోర్కి;నచటన్ గాత్యాయనిన్ రామచం
ద్రునియిష్టాత్మజఁగాంచెనాత్మగతసంతోషంబు మిన్నంటగన్

తే.గీ. పనసతొనవోలె, కాశ్మీర ఫలమువోలె,
లలిత పరిమళమీను గులాబివోలె,
కలశ పాథోధి విరిసిన కలువవోలె,
సురపథమ్మున నెగురు పావురమువోలె,

అలరెడుబాలగాంచిహృదయమ్మున నక్కజమున్ బ్రమోదముం
జెలఁగ, నదృష్టమిట్లు విలసిల్లుఁగదా సుజనానుభావ్యమై
తులమె? కొఠీంద్ర దంపతులతోనొరులంచు; వివాహమెప్పుడీ
లలనకు శూలితో? నికవిలంబన మేటికి నీడు వచ్చినన్?

వ. అనిన గురురాజు భార్యయగు శాంతమ్మకుఁ బ్రత్యుత్తర
ముగా, కొఠీంద్రుఁడు మాబాలకు శ్రీ నాగేశ్వరునితో
వైశాఖ శుద్ధ చతుర్దశి నాఁడాలయమున వివాహ

సుముహూర్తము నిర్ణీతమై యున్నది. మీ దంపతులు పెండ్లికొడుకు వారుగనుండి యీకార్యమును నిర్వర్తింపఁ గోరుదు మనుటయు వారమందానందంబున నియ్యకొని త్రిపురేశ్వరి వంకకుంజూడ.

క. దిగ్గునఁ దలవంచెను, కని,
సిగ్గున నాలేనెలంత; చిఱు సొట్టలతో
బుగ్గలు నిగ్గులు తేఱెను,
లగ్గగు నీ పొంతనమున లలనకు ననుచోన్

వ. అంతట సప్తమి నాఁడభ్యంగనానంతరమున

సీ. పసిఁడి పసుపుఁ బూసి కుసుమాంఘ్రియుగళికి;
సందె పారాణి తోచాలు లునిచి;
గారుడమణి వర్ణ కల్యాణ తిలకమ్ము
కృత్తికా తారకాకృతిని దిద్ది;
పికచాంబుజమ్ముపై విడియు భృంగము రీతి
బుగ్గపై కాటుక బొట్టు పెట్టి;
మూఁడుపాయలు తీసి మొగలి పూజడ నల్లి,
మొగ్గ మల్లెలు వేయి ముడిచి సిగను;
ముత్తెముల హారతిసి; కట్టి క్రొత్తకోక;
ఒగతుఁడిచి పోసి మున్మూరు తొగరు నీరు;
శ్రావ్యఘనకుమారి సుందరీకన్యనప్పుడు
పెండ్లికూఁతునుఁ జేసె సాధ్వీగణమ్ము.

తే. గీ. పృథ్వియంతటి యరుగును విష్ణుపదము
సంత పందిరి నిర్మించి, యరటి చెట్లు

చూతతోరణములుకట్టి, సున్నమలంది,
కోలముల బార్లు పసుపు కుంకుమల దిద్ది.

వ. ఊరిలోని సర్వజనులను బంధు మిత్రులను సపరివారముగా నాహ్వానించి మంగళ వాద్యములు మ్రోయం గల్యాణోత్సవమున కుపక్రమించిరి. శివలింగమునకును నభ్యంగనాదులు జరిపి పెండ్లికుమారుని చెవులకు చేగోడీలను తగిలించి కాశీయాత్రకు బయలు దేరతీసిరి అంతట

తే గీ పెండ్లికొడుకు కాశీయాత్ర విడిచె, జాన
కమ్మ తుదికొడుకైన శాయన్న చెల్లి
నిత్తుననంగ; చేగోడీలనీశుండపుడు
తన చెవులనుండి తీసి శాయనకువైచె.

వ. వివాహ వేదికమీఁద.

తే. గీ. అపుడు బోడపాటి గురురాజు పడతీసు
ణియు, సుభద్రయుఁగాత్యాయనికి శివునకు
జీరగుడ మొసఁగి యొకరిశిరమున నొక
రినిడఁజేసి గెల్చిరిహుర్రనిరి వేడ్క.

సీ. ఆరామ తరులతా హరిదంగ రాగమ్ము
వనదేవతకు చక్కఁదనము కూర్ప,
పూలగుత్తులనుండి పుడమిజారెడు తేనె
తరుణోష్ఠ మధురవాగ్ధారఁబోల,

మధుకరమ్ముల కోడిమల్లియలరింప
    వామాశిరోజ షట్పదచయమ్ము,
వేకువ వేళలో విశ్వకేతునిగొప్ప
    లిప్పపూవుల తావు లినుమడింప.

జెలఁగు పుష్పర్తువందు, వైశాఖమాస
శుక్లపక్ష చతుర్దశిన్, సోమసుమము
విరియఁ గాయఁగఁ, ద్రిపురసుందరికిఁ బెండ్లి
జరిపి రపుడు నాగేశ్వరస్వామితోడ.

తే.గీ. తాళికట్టించి రంత శాంతయునుఁ దల్లి
    సకల జనులును సురలుఁ జేసలనుఁ జల
    నగ్నిసాక్షిగఁ ద్రిపురేశ్వరాంబ నార్య
    నెలమి పరిణయమయ్యె నాగేశ్వరుండు.

సీ॥ మా కార్తికతతులట్లు, మా హేంద్రమణులట్లు,
    నల్లకలువలట్లు, మల్లెలట్లు,
తోఁ చెఁదలంబ్రాలు దోసిళ్లతోఁబోయ
    నాగేశ్వరుఁడును సుందరియు వరుస;
మల్లెపూ చెండు జాబిల్లిగా నీశుంచు
    బ్రమసి, యాదలఁ దాల్చె బంతులాట;
నేనుఁగంబారిపై నూరేగు వరవధూ
    దృక్తృప్తిఁ జేసె కార్తికపు చలువ;

మొనసె బాణసంచు వెలుగు, మ్రోత గగన
మందు, కల్యాణవిభవమాహ్లాద మొసఁగ;

బువ్వపుంబంతి నిటు నటు బూరెలెగిరె;
తలుపుకడ, బువ్వకడ, పాటలో లసేఁ బెక్కు;

తే. గీ. చల్లుకొనిరి బుక్కాలు; వసంతములను
చిలుకుకొనిరి; దండాడిరి; చిఱునగవులు,
పెదనగవులును, దొంగదోపిడియు, నలుక
నుప్పు లేన్ను, పప్పేనుఁగు నొప్పెసంగె.

వ. ఆయలుక సమయమున శాంతమ్మ పెండ్లికూఁతుతో నిట్లనియె

ఆ. వె అలిగి కూరుచుండెనమ్మ నీ మగఁడిప్పు
డేలయలిగె దెలియ మెవ్వరమును;
యలుకఁ దీర్చి యెట్లు కులుకఁ జేతువో నీవు
చూచి కొమ్ము త్రిపుర సుందరాంబ!

ద్విపద: అత్తకు మామకు నాడబిడ్డకును
చిత్తముల్ రంజిల్లఁ జేసి మరియాద
లన్ని లాంఛనములనతి తృప్తిఁ గూర్చి
రెన్నికానుకలో యిచ్చి రేలోటు లేదు.

ద్విపద: తనమదికిఁ దృప్తిగాఁ దనరించి రెల్ల
యని పెండ్లికొమరు డేయనియె మాతోడ
ననుచుండ, దన మేనయల్లుఁ సుభద్ర
వెనుక వైచి కొనుచు వేగమ వచ్చి

తే. గీ. కారణంబేమియైనను, గాంతు నలుక
మాన్ప కిట్టుల తడయుట మాన్యమగునె?

యన, గౌరీదంపతులు కొంచె మలజడి పడ,
వధువు చనె వేగముగ శివునలుకc దీర్పc.

వ. అప్పుడామె శివుని గడ్డము క్రింద బెల్లపు గడ్డను పెట్టి నొక్కి యలుకకుం గారణమేమని యడుగ నాగేశ్వరుం డిట్లనియె.

ఎక్కడి వింత ఛాందసులో! యేమి యొసంగినc గాదటంచున న్నొక్కరి బిక్కిరిం బఱచి, యొంటిని cజేతుల రాచిరాచి, నా చిక్కటి భూతి బ్రాహ్మణులు చేకొనిపోయిరి; వారిమీcదనా కెక్కడ లేని కోపమును నేర్పడె: నైనను భక్తులెల్లరున్

వ. అని సదస్యము నాcటి తన యనుభవమును తెలుప, గోమయమును చిన్నయుండలుగ చేసి బాగుగ నెండ బెట్టి యూక పోసిన నిప్పున, నవి తెల్లబడు వఱకు పుటము పెట్టి, పొడిచేసి, మూcడు రాత్రులు వెన్నెలలోc బెట్టి శ్రద్ధగ చేసిన భస్మము సరియైన విభూతియని యెఱింగి, దానిని రాసులుగc దెప్పించి యీయ నాగేశ్వరుం డలుకమానె. ఇట్లు వేడుకలతో కలసి వివాహమహోత్సవ మైదు దినములు యథావిధిగ జరిగి పుర జనులకు నితర ప్రేక్షకులకు మఱపురాని యానందాను భూతిని కలిగించె.

జానకీదేవికి షష్ఠికాజననము

వ. అంతట స్వభాను సంవత్సరమున దుర్గాష్టమియందు,

జలధారా తుషితావనీకలిత చంచత్స్వాత జీమూతమం
డల మధ్యోద్భవ శక్రచాపమనఁ, దోఁటన్ జానకీదేవికిన్
గలలోఁ జెప్పినయట్లు, పుత్రి సుతియై కాత్యాయనీదేవి, యే
యిలువర్షించునొ దానధారలీల నాయిల్లామె పుట్టిల్లుగన్.

వ. ఆ పిమ్మట శార్ధసంవత్సరమున త్రీరాబ్ధి ద్వాదశినాఁడు

మృదుల లతాంతభాగమున మేదినిఁ గాంచిన పూవుతీగెయం
దుదయ సమీరవీచికల నూఁగు గులాబులవోలె జానకీ
సుదతి యొడిన్ గవల్, త్రిపురసుందరి చెప్పినరీతి, శ్రీయు, శా
రదయు జనించిరిట్టులిలఁ బ్రాప్తముగంగద మేలు మంచికిన్.

అనుదినవర్ధమానలగు నాసుతలున్, సతియున్, గోత్రీంద్రుడున్
దనయులు, జోడపాటి కలతల్ల జుఁడైన దివాన్ కుటుంబమున్
ఘనతయు, సర్వభాగ్యములు కల్గి సుఖించిరి, దేవిసేశ్వరున్
మనసులు తీఱఁగొల్చుచు క్రమంబున మోక్షముగాంచిరెల్లరున్

మోక్షస్వరూపము

వ. బాలా త్రిపురసుందరీ నాగేశ్వరులు దేవాలయమున స్థిర నివాసులై భూమి పాలించుచునెక, నొకనాఁడు బాలా త్రిపురసుందరీదేవి నాగేశ్వరునితో నిట్లనియె.

క. వచ్చితిమిచటకు; భక్తుల
కిచ్చుచునుంటిమి సతమ్ము నిష్టార్థములన్;
జెచ్చెర వీరికి మోక్షం
బిచ్చు నుపాయము ననుగ్రహింపుడు దయతోన్.

క. ఒకదుఃఖముఁ దీర్చిన, మఱి
యొకదుఃఖమునంగలంగి, యోరుపుచెడి, మా
టికి మాటికిసి, మనకు మ్రొ
క్కుకొను జనులగతికి నెడద కుతకుత మనెడున్.

వ అనిన నాగేశ్వరుండామెకిట్లనియె; దేవీ! మోక్షప్రాప్తి సులభముకాదు. ఏ జీవి మోక్షమా జీవికృషివలన మాత్రమే లభించును. మోక్షము భగవదనుగ్రహాధీనమే యయ్యును భగవంతుడు తన నియమముల నెన్నడును తప్పఁడుకాన, నానియమాను సారముగ కృషి చేయువారికి మోక్ష ప్రాప్తి కరతలామలకము.

తే. గీ. చావుపుట్టులతుదను శాశ్వతపదమగు
మోక్షరూపము మదిని తథ్యముగ నెఱిఁగి
స్పష్టముగ నిర్వచింప నసాధ్యమగుట,
వివిధగతుల వచించిరి విబుధవరులు.

తే.గీ. జీవి నశియించిపోవును చిట్టచివర
కదియె 'నిర్వాణ' మదె మోక్ష మనిరి బౌద్ధు;
లర్కుఁ డేగఁ, గిరణము లరుగు నటులఁ
దనరు బరమాత్మ ననుచు నద్వైతు లనిరి.

తే.గీ. పొంది నైజోచితసుఖాను భూతిచయము
జీవి నైజస్వభావజ్ఞుఁడై వఱలుటె
'మోక్ష'మని ద్వైతులని; రిట్లు మూఁడు తెఱఁగు;
లెడనెడ చిఱుత మార్పులు నిండెసంగు.

వ. పరమాత్మయన, హరియని కొందఱు విజ్ఞులును, శివుఁడని కొందఱువిజ్ఞులును పలుకుదురు. ద్వైతులందుహరియే పరమాత్మ యనువారిని మాధ్వులందురు. ఈ యాలయ నిర్మాత కొఠీ రామచంద్రరావు మాధ్వుఁడు.

తే. గీ. హరియె దైవము; జగము సత్యమ్ము సుఁడు
భిన్నులెల్లజీవులు, తరతమభేద యుతులు;
హరి కనుచరులు; నైజ సుఖానుభూతి
ముక్తి; తత్సాధనము స్వచ్ఛభక్తి; మఱియు.

తే. గీ. భౌతికముగఁ దెలియునవి; వాని వలన
నూహలకందునవియు, వేదోక్తులును బ్ర
మాణమునియు, హరి యఖిలామ్నాయవేద్యుఁ
డనియుఁ, బలికి, రావిజ్ఞానధనులు మగువ!

వ. అద్వైత ప్రతిపాదితమైన మోక్షము జీవుఁడు భగవంతునిలో లీనమగుటయే. ఇది జ్ఞానసాధనవలన లభించును. వైష్ణవులు ప్రతిపాదించు మోక్షము విష్ణులోకమను వైకుంఠము; శైవులు ప్రతిపాదించునది శివలోకమను కైలాసము.

తే గీ. హరియు శివుఁడు నొకరె; రమయన సతియన
నొకరె; శివవిష్ణులోకమ్ము లొకటె; మఱియు
నెట్టి పేరున నేదేవి నెట్టి దేవు
భక్తిఁ గొలిచిన, నది పరబ్రహ్మ పరమె.

సీ. కష్టము, బాధ, దుఃఖము, మనోవ్యథ, యీర్ష్య,
దారిద్ర్య, మాకలి, దప్పికయును,
నితరార్తులును లేక నెటఁ దృప్తి నవిరామ
సుఖశాంతు లొలయు, నాచోటు తనరు
మోక్షపదంబన, ముక్తజీవుల శాశ్వ
తావాస; మటఁ, దన యంతరమును
యాథార్థ్యముగఁ దెల్పునట్టి 'చిత్'జ్ఞానమున్,
భగవత్సన్నిధి వలనఁ గలుగు మహి

తమగు నానందమును జీవి కమరు; జీవు
లందలి తరతమభేద మటను నిలుచు.
నెవరికగు చిదానందానుభవము వారు
పొందుదురు దేవి! యా మోక్షమందిరమున.

తే. గీ. పరముడును, ముక్తజీవులుఁ, బరిమళములు
కాంతియు. మనోహరాకృతి కలుగు వస్తు
వులనుఁ బుష్పాదులుండు; జీవులట నవ్య
యమగు భగవత్స్వరూపమ్ము నంది చెలఁగ.

తే. గీ. కోరినంతనె తీరును కోర్కెలెల్ల;
పెద్దకోర్కెలు పుట్టవు చెలఁగ వచట;
జీవి వినుఁ, జూచు, నడచు, నాశీర్వదించు,
పలుకు; కాని, భౌతికమగు పగిదిఁగాదు.

తే. గీ. సత్త్వజీవులు మోక్ష నిఃసరణిఁ గాంచ
తామసులు బంధముక్తి, నంధతమమునను

నిరతదుఃఖము 'చిత్' జ్ఞానభరము గాంత్రు;
దుఃఖమే నైజసుఖ మింతి! దుష్టులకును.

తే. గీ. రాజసులకు 'చిత్' జ్ఞానము పాప్తియగును
బంధమోచనమున; దుఃఖభరము, సుఖము
గాంతురు నిరతమీ జీవగణములెల్ల; వీరి
నందురు 'నిత్యసంసారు' లనుచు.

వ. ఈ మూఁడు ముక్తస్థానములును బ్రహ్మాండములో నివి కావు. దానికావల నవ్యాకృతాకాశమను నవధులు లేని ప్రదేశమున నివి కలవు.

## మోక్షమార్గము

సీ॥ శాస్త్రయా దేవుఁడు, శాస్త్రములు, శిక్షయు,
గురు శిష్యులును, బంధ, నిరయ, ముక్తి,
లేవు, నేనను, వ్యక్తివైవిధ్యమును, మోక్ష
సాధన మివియెల్ల సత్యమగుట;
నవనిలో జీవులు శ్రవణ, మనన, విధి,
ధ్యానసనముల నీశ్వరాపరోక్ష
సంపాదన మొనర్చి, సర్వేశ్వరానుగ్ర
హము చేత మోక్షము నందవలయు;

నీ సదావకాశమును జీవరాశి కొసఁగి
యనుభవమున మంచిచెడుగుల నెఱుఁగుటకు
జీవులను, జడములఁ జేర్చి సృష్టి చేయు
టవసరంబయ్యెఁ; బరమేష్ఠి యట్లొనర్చె.

లయగ్రాహి: జీవులకు సాధనకు నై వలయు దేహములు
క్రేవల కుటుంబములు, తావులును, వృత్తుల్,
కావున, మహీస్థలిని జీవి యొకవృత్తిఁ గొని
జీవనమొనర్చుట యథావిధిగఁ జెల్లం
గా, వెలయు వర్ణములు, నావిధిగ నాశ్రమము
లావిధిగ వాడుకలు, నావిధిగ ధర్మం;
బీవిధముగాఁ బనులు దేవునకుఁ బ్రీతిగను
జీవులొనరింప, దయ దేవుఁడిడు ముక్తిన్.

వ. భగవంతుఁడే కాక యుత్తములగు జీవులునుఁ దమతమ యంశలచే బ్రహ్మాండమున నుద్భవించి ప్రబోధ ప్రోత్సాహములచేతను, నియమ సద్వర్తనములచేతను జీవులకు మార్గదర్శకులుగ నుందురు. జీవోత్తముఁడగు వాయ్వంశను పుట్టిన హనుమంతుఁడు అట్టి వారిలో ముఖ్యుఁడు.

క. భక్తి, జ్ఞాన, విరాగము
లుక్త పథమ్ములు జనమ్ము లొందఁగ ముక్తిన్;
వ్యక్తులు నీతినిఁ దప్పిన,
ముక్తిపథమ్ములనుఁ బడవు ముందునకడుగుల్.

వ. నీతిగ పనులు చేయుటను సత్కర్మ యందురు.

సీ. కర్మచే జ్ఞానమ్ము కలుగును; జ్ఞానమ్ము
వలన భక్తి కలుగు; భక్తివలన
వైరాగ్యముదయించు; వైరాగ్యమనిస దు
ర్విషయ విరక్తి; సద్విషయ తతుల

ననురాగము కలుగుటను భక్తి యందు; రా
చార మంత్రము క్రమశిక్షణనుఁ, బనుల;
నుత్తమవర్తనం బుత్తమ కర్మయు
నుత్తమజ్ఞాన భక్త్యక్తులున్న,
ముక్తికలుగును జీవి స్వశక్తివలన;
భౌతికము కాదు చేతికి పరులొసంగ;
నాత్మపరివర్తనము జీవియందుఁ గలిగి
పక్వమగునేని మోక్షసంప్రాప్తి యగును.

క. మ్రొక్కులు, పూజలు, భజనలు,
సు్రుక్కుట లుపవాసములును, సోలుట, శివు రే
లక్కరకురావు నడవడి
చక్కంబడి నీతిచాయ సాగెడు వఱకున్.

గుడులును, విగ్రహమ్ములును కుండములాపగలబ్ధితీర్థముల్
కడుగవు పాపముల్ హృదయకల్మష మేరికివారు వీడకుం
డెనువఱకున్;నరుండది వడిన్ గని, చిత్తముమంచితోవ వెం
బడిఁ జనునట్లు త్రిప్పుటకు వాడవలెన్ జుమి వీని నేర్పునన్

జీవుల దుష్టబుద్ధులు నశింపఁ జికిత్సకులంతరాత్మలే
నీవును, నేనుఁ జూపఁదగు నేర్పులు లేవు భవాని! ముక్తిపై
భావము కల్గువాఁడు తనవర్తనమున్ సరిదిద్దు; లేనిచో
గోవధ చేసి, పాపమొక కోవెలఁ గట్టిన మాయమౌ ననున్.

తే. గీ. గర్వమును, క్రోధము, నహంకారము, మమ
కారము, విషయాసక్తియుఁ గట్టిపెట్టి;

కామము, ఫలాపేక్ష, దుష్కర్మ, డంబ
ము, చెడుచెలిమియు, దుశ్శాస్త్రములును, వీడి,

క్రమముగఁ దామసం బణఁచి, రాజస మవ్వల కూడ్చి, సత్త్వ, ధర్మము లిల నిత్యజీవనసమస్తముసం దెసఁగ న్నియుక్త కార్యములొనరించుచున్ భగవదర్పణ చేయునో తత్ఫలంబు నుత్తముఁడగు నట్టివాఁడు నిరతంబగు ముక్తిపదంబు డగ్గఱున్.

తే. గీ. జడముతో బంధనము విడివడుట కిట్లు
జీవి కృషి చేసి విజయము చెందునేని,
యతని కరచేతి పాయసమగును ముక్తి;
కానిచో, చావుపుట్టులు కాంచు చుండు.

తే. గీ. ఇట్లు సాధనచే నితరేచ్ఛలందు
బుద్ధి చాలింప, నిహపరంబులను గరిమ
తనరు; శీలము, దీక్ష, సత్యమును, దాన
ముర్విజనుల నడవడి సత్యోత్తములు.

తే. గీ. తనర శీలము, దీక్ష, సత్యమును, దాన
మలర క్రమశిక్షణయును, నియమయుతమ్ము
లైన కట్టుబాట్లను, లోటులేని సత్ప్ర
వర్తనమును, సత్కర్మ తప్పఁడు నరుండు.

జ్ఞానాత్ముల్, మఱిసంశయాత్ములును, నిచ్ఛల్ నిత్యసంసారులున్
గానస్వాత్తు రిలాతలంబునను; మోక్షంబుందఁ గాంక్షించు నా
జ్ఞానాత్ముల్ దమ యస్వతంత్రతయు, విశ్వంబెల్ల విశ్వాత్మ్యధీ
నానూకంబనియున్ గ్రహించియెదలన్ ధ్యానింత్రు సర్వేశ్వరున్

మధ్యా: పరముఁడుత్కృష్టుఁడధికుఁడు, పరమునధీనమన్నియని
పరిపూర్ణముగ లోనెఱింగి, బాధాసహస్రమ్ములెన్ని
దరికొన్న చెదరకన్నిల్చు, తనమీఁది మమతను మించు,
నిరత ప్రవాహమై పొల్చు నిబిడానురాగమే భక్తి.

వ. సత్కర్మయు, అమలమగు భక్తియు. సుజ్ఞానమును వైరాగ్యమును ముక్తికి మార్గములగుటయేగాక ఇహజీవితము నందును ప్రధానములు; విజయకారణములు. ముక్తస్థానములు కాక స్వర్గము, నరకము నను రెండులోకములు కలవు, మోక్షమునందఁజాలని జీవులలో

కలుగున్ స్వర్గము తత్సుఖంబులును సత్కార్యంబులన్ జేయు జీవులకున్ దత్ఫలితమ్ముగా; నటులె జీవుల్ చేయుదుష్కృత్యముల్
కలుగంజేయు నివాసముల్ నరకలోకంబందుఁ దద్దుఃఖబాధలకుంజిక్కి; తదంతమందుఁగలుగున్ ధాత్ర్యాదులన్ జన్మముల్

పుట్టుచు గిట్టుచున్ మఱలఁ బుట్టుచు గిట్టుచు, జీవి గిఱ్ఱునన్
జుట్టెడు చక్రమట్లు పఱచున్ నరకంబును, భూమి, స్వర్గమున్
మెట్టుచు బుణ్యపాపముల మేల్చెడుగుల్ భరియించియాగుచున్
దొట్టెనుఁ బిల్లవాని క్రియ దుఃఖసుఖంబులమధ్య నిత్యమున్.

వ. స్వర్గనరకములందే కాక కర్మఫలంబులగు సుఖదుఃఖములను జీవులు భూర్భువరాది చతుర్దశ భువనములందెందేని ఏ రూపముననో జన్మించి యను నను భవించుచుందురు.

క. వెనుకటి కర్మఫలంబుల
నను భవమందంగ వలయు నందఱు జీవుల్

మనుజుల కొసఁగెను దేవుఁడు
తన నియమము లెఱుఁగుశక్తి; తగదవి మీఱన్.

## ఆలయ పాలన

వ. అని నాగేశ్వరుండు తెలుప, బాలాత్రిపురసుందరీ దేవి జీవులను సత్కర్మనిరతులనుగను మోక్షగాములుగను చేయుటకుఁ గట్టి కృషి యవసరము కాదా?

తే. గీ. అనిన, త్రిపురేశ్వరికి శివుఁడిట్టులనియె;
సజ్జనులు, వేదశాస్త్రంబు, లొజ్జ, లార్యు,
లఖిల దేవాలయము, మఠాదు లలరుచుండు
టిందులకుఁ గాదె? వంత నీ కెందుకింక!

వ. అనిన నాదేవి వీనికన్నిటికి నదనముగ,

తే. గీ. ప్రతిదిన మిరుపురము నేగి ప్రజలదరిసి
భూమి పాలింతమనె దక్షపుత్రి; యంత
నట్టులొనరింతమని శివుఁడనఁగఁ, దేలె
సకల జగములు సంతోషసాగరమున.

నిత్యము ధూప దీపములు నిత్యము పూజలు మూఁడువేళలన్
నిత్యనివేదనంబులును, నిత్యము సేవలు శూలికార్యకున్,
నిత్యపురాణ వాచకము, నిత్యము గోష్ఠులు సర్వవిద్యలన్,
నిత్యము వేదగానము లనేకము లీ గుడి సాగుచుండగన్,

క. ఏకోత్తర శతవర్షము
లీ కరణిని జరిగె, పిదప నీపురిపైనన్

భీకరముగఁ బొంగి పడె మ
హాకూపార మ్మొకయర్ధయామిని వేళన్.

క. తుడుచుకొని చనె జనమ్ము చ
వుడు పట్టెను పల్లెటూళ్ల భూముల నెల్లన్;
గుడిపూజ లెట్లొ సాగెను
కొడమంచిలి వంశ్యుఁడర్చకుండగు వఱకన్.

తే.గీ. ఆ గుణఖని, సుజనుఁ డప్పనాఖ్యుఁ డగు వె
నలరె; భక్తుఁడు, సకలవిద్యాప్రవీణుఁ,
డాగమమ్ముల శాస్త్రములందు ఘనుఁడు,
పూర్ణదీక్షాపరుండునై పూజ్యుఁడయ్యె.

తే.గీ. విధివిధానమ్ముగా మూఁడు వేళలందుఁ
జేసి పూజాభిషేకముల్ వాసిగాంచె;
ప్రజలతని బ్రస్తుతింప; ముప్పదియొకేఁడు
లర్చకత్వము, యాజమాన్యమును నెఱపె.

తే.గీ. తనువు దప్పన తొఱఁగిన తరుణమందు
గుడి శతాధిక వర్షమ్ము లడరినట్టి
ద్వీపవదనా విగ్రహామె యదృశ్యమైనఁ,
గుమ్మరి యొకండు నెలకొల్పె కుండబొమ్మ.

వ. ఆతని కుమారుఁ డట్టివాఁడుగ నుండమింజేసి, పురజనులు
తెచ్చిన యభియోగమునఁ గృష్ణామండల న్యాయస్థాన
మొక ప్రణాళిక నేర్పఱచి ౧౮౧౨ వ శాలివాహన శక
వర్షమున నండి స్వామి భూవనాలయాదుల పాలనను స్వీక

రించి, మూఁడు మూఁడేండ్ల కీపురముఖ్యులం దొక్కరిని
ధర్మకర్తగ నియమింప సాగె; నిట్లు

ఈ పురివైశ్యముఖ్యుని, మహేశ్వరు భక్తుని, సుబ్బరాయు,ని
ష్ఠాపరు, దానశీలియయి సత్రములాదిగ ధర్మసంస్థలన్
స్థాపనఁజేసినట్టి గుణశాలిని, వర్తకదత్తుఁ, జేసె నం
బాపతి యాలయాది పరిపాలనకున్ దొలి ధర్మకర్తగా.

వ. వినాయక విగ్రహమును చెక్కించి, కోవెలలో బ్రతిష్ఠించి
యాతాడేపల్లి సుబ్బారాయఁడు మూఁడేండ్లు పాలనచేసిన
పిమ్మట వరుసగా నియమితులై తాడేపల్లి హనుమంత
రాయఁడై దేండ్లును, తాడేపల్లి వేంకటసుబ్బారాయఁడు
మూఁడేండ్లును, కోళ్లపల్లి శివరామకృష్ణరాయఁ డాఱేం
డ్లును, పుచ్చా లక్ష్మీనరసింహరాయఁడు తొమ్మిదేండ్లును
చక్కగ పరిపాలించిన పిదప,

తే. గీ. పదియు నెనిమిది నూట్లు డెబ్బదవ శాలి
వాహనాబ్దమం దావటపల్లె వంశ్యుఁ
డైన హనుమంతరావు నియామకంబు
జరిపె మెప్పించి నామాట జడ్జి దయను.

వ. పిమ్మట కొన్నేండ్లకు మండలన్యాయస్థానమునుండి యధి
కారమును రాష్ట్రిపరిభుక్తము స్వీకరించె; నిట్లు.

తే. గీ. నిండుగా పదునాఱేండ్లు నిండె నితని
ధర్మకర్తృత్వ పాలనా దక్షతకును
మెచ్చి మగుడమగుడ నియమించి, సంత
సింప, నధికారులును, సుమహా శివులు, ప్రజలు.

సీ. హనుమత్ప్రసాదిత జననమ్ము గతమున
నిత్యసేవాసక్త నిరతుఁడయ్యె;
వ్యాపకేతరము శేలోపమ్ములనఁ లేని
కలిమి సేవకు నవకాశమిచ్చె;
నడుము వంచి యొకర్వ నాలుగు పెడ్డిండ్లు
స్వామిసొమ్మునఁ బొందుపు జరుపు టెఱిఁగె;
వివిధానుభవదశ్య విస్తృతి సామర్థ్య
మధికారులతో నెగ్గుటలవి చేసె;
శతక, నాటక రచనయు, సరళతయును,
కవులకుత్సాహమునుఁ గూర్చు కాంక్షనిచ్చె,
నయ. వినయ, నిరాడంబర, నియమ, శీల
ములు జనాకర్షితునిగను మలఁచె నతని.

వ. భూములను, కొట్లను బాగు చేయించి, రాబడిని పెంచి, క్రొత్తగా పొలములు కొని, అర్ష పుస్తక భాండాగారమును స్థాపించి ముఖమంటపమును విశాలమొనర్చె, యాగశాలను పాకశాలను అర్చకావాసములను నిర్మించి యతఁడుపన్యాస; పురాణప్రవచన, గానసభాద్యనేకము జరిపి కడుసమర్థతతో నిర్వహణసేవ చేయునెడ నాలయమొక ఋషివాటి వలె వఱలుచు జనతతుల నాకర్షించుచుండును. మాయమైన వినాయకుని విగ్రహము మాలయ తటాకమునఁ బయటపడ, నతఁడు దానిని ధ్వజస్తంభమున నిల్పెను.

స్వీయధనమ్ముతో నతఁడు చేసె నవగ్రహసంప్రతిష్ఠ, భా
ర్యాయుతుఁడై తదాలయమునందుకుమార్తెలుభర్తృపుత్రపు

త్రీయుతులై కనన్; ధరణిదేవులు, సజ్జనబంధు మిత్రులా
ప్యాయత దీవనల్ గుఱియ, భక్తిను మేశుల లోదలంచుచున్

వ. ఈ గ్రంథ రచన కాతని ప్రోత్సాహము ప్రబలకారణము. బాల్యముననే సన్యసించిన బాలస్వామి యీ యాలయమున నివసించి శ్రీరామపాదభక్త సమాజమును స్థాపించెను. ఆలయాస్థాన పౌరాణికుడుగ నుండిన కంభముపాటి రామమూర్తి శాస్త్రి [హో

అలఘుఁడు నాలుశాస్త్రములయందును వ్యాకరణంబునన్ మ
జ్జ్వలమగు పాండితీప్రతిభ వాసికెన గల్గినవాఁడు, శేముషీ
విలసితుఁడార్యధర్మచయవేది; యతండు పురాణ సత్కథల్
పలికినఁ, గర్ణరంధ్రములఁ బట్టిన తుప్పులు డుల్లె నెల్లెడన్.

వ. ఆయన పిమ్మట కుప్పా ఆంజనేయశాస్త్రి యను ప్రౌఢవిద్వద్వరేణ్యుఁ డాస్థాన పౌరాణికుఁడుగ నియమితుండయ్యె. ఇట్లు నిరంతరాభివృద్ధి నొందుచు శ్రీ నాగేశ్వరాలయము శశ్వత్కల్యాణదాయకమై యలరుచున్నది.

భరతవాక్యము

క. ఇరు నూఱేఁడులు చెల్లును
పురసూదనుఁ డిటఁ బ్రతిష్ఠఁబొందిన దాదిన్;
ధర నిప్పుడు జరుగు శుభకృ
ద్వారరాత్రికి కావ్యరచనమై నెల చెల్లున్.

తే. గీ. శాలివాహనశకపు వత్సరములు పది
యునెనిమిది నూఱు లెక్కబడియు మఱి నాలుఁ

గైన నేఁటి శుభకృదబ్ద మఖిల విశ్వ
శోభనారంభములఁ దృష్టిఁ జూచుఁ గాక!

మ. కలకాలమ్మిటు సాగుఁగావుత! ససంఖ్యాకమ్ములైసజ్జనుల్
బలవత్ప్రాంశు సురావనీరుహ సముత్ప్రాలంబిత స్థైర్య స
త్ఫల పుష్పాన్వితవల్లి కానిచయ శోభాస్తోమ సంపత్ప్రభా
కలితోద్యత్సుఖులాటకుంకువయినీ కారుణ్య మేపారుతన్.

తే. గీ. శత్రు, చోరాగ్ని, రోగ, కష్టములు జనుల
తాఁకకుండఁగ రక్షింత్రుగాక ప్రభులు;
ధర్మమును సత్యమును నీ రథంబునకును
చక్ర యుగముగ నీ తేరు సాగుఁ గాక!

తే. గీ. ఒక కుటుంబము వోలె నీయుర్విజనము
మానసము లెల్ల నొకటియై మనును గాక!
యుద్ధములు మాసి, భువి శాంతి యుద్భవించుఁ
గాక! నీరాజ్య మిలనెల్లఁ గ్రాలుఁ గాక!

ఆశ్వాసాంతము

తే. గీ. ఇట్టి నాగేశ్వరాఖ్య! యో, యిందుమౌళి!
హిమశిలోచ్చయ రాట్సుతా హృదయహారి!
స్కంద, హేరంబ జనక! వృషభతురంగ!
లలిత పుష్కరిణీ తటాలయ విహారి!